# అపరాధ పరిశోధన

రు.5.50 ఆగస్టు '84

సప్లిమెంట్ 128



అపరాధ పరిశోధన అనుబంధం—128

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అంధకారంలో అడుగులచప్పుడు

రచన: చంద్రశేఖర అజాద్

## తిరస్కారం

రచన: బి. రాజేశ్వరి

## ఎర్ర ఫైలు

రచన: ప్రతాపరవిశంకర్

## లక్షకో హత్య

రచన: టెంపోరావ్

కళ్యాణి దుర్గం - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 128
ఆగస్టు, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

14/7/84 Ranga Rao

# అంధకారంలో అడుగుల చప్పుడు!

చంద్రశేఖర ఆజాద్

డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని ఆకలిగా చూస్తున్న వినయ్ వంక నవ్వుతూ చూసింది రూప.

"ఏం బాబూ అంత ఆకలిగా ఉందా."

"యస్ మమ్మీ."

పళ్ళెంలో తెల్లటి మల్లెపువ్వుల్లాంటి అన్నం వడ్డించింది. ఆత్రంగా తింటాని కుపక్రమించాడు.

"ఐయామ్ ఆల్సో రెడీ" అంటూ వచ్చాడు కృష్ణ.

"మీకూ ఆకలిగా ఉందా."

"నీకూ ఉంటుంది కూర్చో" అన్నాడు.

రూప కూడా కూర్చొని అన్నం వడ్డించుకుంది. కొంచెం సేపటిదాకా ఎవరూ మాట్లాడకుండా భోం చేయటంలోనే నిమగ్నం అయ్యారు.

"శరత్ రేపు మనింటికొస్తున్నాడు" అంది రూప.

"నిజమా మమ్మీ" ఉత్సాహంగా అడిగాడు వినయ్.

"అవును."

"ఎన్ని రోజులుంటాడు."

"ఇంకెప్పుడూ మనతో నే వుంటాడు" అంది రూప.

అంతలో నే ఆమె కళ్ళలో విషాదం తొంగిచూసింది. భోంచేస్తున్న కృష్ణ లిప్తపాటు భార్య మొహంలోకి చూశాడు,

"మరయితే రేపటినుండి శరత్ తో బాగా ఆడుకో వచ్చు" అన్నాడు వినయ్.

"వినయ్, శరత్ కు కళ్ళు కనపడవుకదా. జాగ్రత్తగా వుండాలి" అంది.

"ఓ.కె. మమ్మీ" అన్నాడు వినయ్.

శరత్ రూప అక్క బిడ్డ. శరత్ తల్లి రూప స్వంత అక్క కాదు. ఆమె పెద్దమ్మ కూతురు. వాళ్ళు చాలా కాలంక్రిందట అమెరికా వెళ్ళారు. అక్కడే బాగా సంపాదించారు. అప్పుడప్పుడూ భారతదేశం వచ్చి వెళు తుండేవారు. వచ్చినప్పుడల్లా రూపా వాళ్ళకు మంచి మంచి కానుకలు తెస్తుండేవారు. వారికి శరత్ ఒక్కడే సంతానం.

వారికి శరత్ ను చూస్తుంటే అంతులేని బాధ కలుగు తుండేది. అందుకు కారణం శరత్ కు చిన్ననాటినుండి కళ్ళు కనిపించేవి కావు.

అతనికి ప్రపంచమంతా అంధకారంగా వుండి, ఏమీ కనిపించక ఏడుస్తుంటే వారి గుండెలు తరుక్కు పోయేవి. అతని కంటికి చూపు తెప్పించటానికి విశ్వ ప్రయత్నం చేశారు. అయినా ఉపయోగం లేకుండా పోయింది. దాంతో వారికి విరక్తి కలిగింది. ఇంక అమెరి

కాలో ఉండ బుద్ధి కాలేదు. అందుకే అక్కడి ఆస్థులన్నింటిని క్యాష్ చేసుకొని మాతృ దేశం చేరుకున్నారు.

ఇక్కడే స్వంతంగా ఓ పరిశ్రమ స్థాపించుకొని స్థిర పడాల నేది వారి నిర్ణయం.

శరత్ కు పది సంవత్సరాలుంటాయి. అతన్ని పరిశీలి స్తే అలా కనపడదు. ఆ మొహంలో విచిత్రమైన ఆకర్షణ వుంది.

శరత్ ఆలోచనల్లో ఉన్నప్పుడు ఈ ప్రపంచానికి అతీతంగా ఏదో ధ్యానంలో ఉన్నట్లుంటాడు.

శరత్ కు ప్రపంచం గురించి అతని తల్లి వివరి స్తుం డేది. అతన్ని తన దగ్గర కూర్చో పెట్టుకొని చెట్ల గురించి, నదుల గురించి, మైదానాలు, లోయలు, పర్వతాలు, మను షులూ....ఒకటేమిటి సమ స్త ప్రపంచం గురించి వర్ణి స్తుం డేది. ఆ లేత మనసు ఆయా దృశ్యాల్ని తన మనో పథంలో ఊహించుకు నేది.

శరత్ తల్లికి అతనంటే ఎంతో ప్రేమ. ఏ మాత్రం బాధ పడినా ఆమె తల్లడిల్లి పోయేది. జ్వరంలాంటి వొచ్చినా టాబ్లెట్స్ ద్వారా నే తగ్గించటానికి చూసేది. ఇంజక్షన్ సైతం ఆమెకిష్టం ఉండేదికాదు. ఆపరేషన్ అంటే ఆమెకు చెప్పలేనంత భయం!

ఆమె తల్లి తండ్రులు మరణించారు. వాళ్ళకామె ఒక్కతే సంతానం. ఆయన తరపున కూడా ఎవరూలేరు. వారు కూడా గతించి చాలా కాలమయింది. వేరే బంధు వులు లేరు. కాగా వారికి దగ్గర బంధువులు యీపా వాళ్ళే.

వాళ్ళు స్వదేశం రాగానే స్వంత ఊర్లో మంచి భవనం కట్టించుకున్నారు. కొన్నాళ్ళు అన్నిరకాల వత్తి

డులకు మారంగా వుండాలని వారి అభిలాష. ఈ నడుమే ఆయన ఏ పరిశ్రమ లాభదాయకంగా వుంటుందో పరిశీలించి తృప్తిపడ్డాక ఓ పరిశ్రమ స్థాపించాలని నిర్ణయించుకున్నారు.

ఈలోపు, సరిగ్గా నెలరోజుల క్రితం ఓ దారుణం జరిగిపోయింది.

శరత్ తల్లి తండ్రులిద్దరూ తమ కారులో వస్తున్నారు. అంతలో ఎదురుగా ప్రళయంలా దూసుకొచ్చిందో లారీ. కంగారుపడి ప్రక్కకు తీసేంతలోనే ధడేల్ మంటూ గుద్దేసింది. ఆ తాకిడికి కారు నాలుగు మొగ్గలు వేసింది. అందులోనివారు చిత్రవధ అనుభవించి ప్రాణం వదిలేశారు. అంతలోనే కారు ధడేల్ మంటూ పేలిపోయింది. వారిద్దరి శరీరాలు గాల్లోకి లేచాయి. ఆ లారీవాడు ఆపకుండా వెళ్ళిపోయాడు.

ఆ రోజు శరత్ ఇంటి దగ్గరే వుండిపోయాడు. అదృష్టమో దురదృష్టమో శరత్ ఒంటరిగా మిగిలిపోయాడు.

వార్త తెలిశాక రూప కుటుంబం వెళ్ళింది. రెండు రోజులుండి వినయ్ కు పరీక్షలుండటంతో తీసుకొని కృష్ణ వచ్చేశాడు. రూప మాత్రం అలానే వుండిపోయింది. వచ్చేటప్పుడు శరత్ ను తీసుకొచ్చేయాలనుకుంది. అయితే దూరపు బంధువొకాయన శరత్ ను పదిరోజులుంచుకుంటానని బలవంతం చేశాడు. అందుకోసం శరత్ ను వదిలివచ్చింది. వాళ్ళు రేపు రాబోతున్నారు. వచ్చాక ఇక్కడే వుండిపోతాడు.

కృష్ణ ఓ ఫ్యాక్టరీలో పర్సనల్ మేనేజర్ గా వుంటున్నాడు. వారికి ప్రస్తుతం వినయ్ ఒక్కడే సంతానం. వినయ్ కు ఏడు సంవత్సరాలుంటాయి. దాదాపు రెండు

వేలకు పైబడి జీతం వస్తుంటుంది. తల్లీ, తండ్రి లేని శరత్ పట్ల వారందరికీ ఎంతో సానుభూతి వుంది. అంతకు మించి శరత్ గుడ్డివాడు కావటంపల్లే మరింత జాలి.

## 2

వాకిట్లో కారాగింది.

రూప పరిగెత్తుకు వెళ్ళింది. డోర్ తెరిచి "మెల్లగా బాబూ" అంటూ చెయ్యి పట్టుకొని శరత్‌ను నడిపించుకుంటూ వచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

వినయ్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఏమైనా తల్లీ తండ్రీ అన్నీ నువ్వేనమ్మా. బాబును కంట్లో పెట్టుకొని కాపాడుకోవాలి" అన్నాడు శరత్‌తో వచ్చిన ముసలాయన.

శరత్‌కు తల్లితండ్రులు గుర్తుకొచ్చారు. కళ్ళ వెంట నీళ్ళు కారటం మొదలయి వెక్కిళ్ళు వచ్చాయి.

"ఊరుకో బాబూ, ఊరుకో" అనునయించబోయి రూప గొంతు బొంగురుపోయింది.

ముసలాయన పైపంచెతో కళ్ళద్దుకుంటూ ప్రక్కకు తిరిగాడు. వినయ్‌కు కూడా వెక్కిళ్ళు మొదలయ్యాయి.

"ఏడవకూడదమ్మా, చూడు నిన్ను చూసి తమ్ముడేడుస్తున్నాడు" అంది రూప.

శరత్ వెంటనే కళ్ళు తుడుచుకున్నాడు.

"వినయ్, ఇటురామ్మా. అన్నయ్య ప్రక్కన కూర్చో" అంది రూప.

వినయ్ వచ్చి శరత్ ప్రక్కన కూర్చున్నాడు. శరత్ ఒక్కసారి వినయ్ ఒళ్ళంతా తడిమాడు.

"అరే నీకిక్కడ పుట్టుమచ్చ వుందే" అన్నాడు ఆకస్మాత్తుగా.

వినయ్ ఆశ్చర్యంగా తన చేతికేసి చూసుకున్నాడు. నిజంగానే అక్కడో పుట్టుమచ్చ వుంది. రూప ఆశ్చర్యానికి అంతులేదు.

"కూర్చోండి బాబాయి వస్తాను" అంటూ వెళ్ళి డ్రైవర్‌కు చెప్పి శరత్ బట్టలన్నీ పై గదిలో పెట్టించింది. శరత్ కోసం ఆ గదంతా ఖాళీచేశారు. మొత్తం శరత్‌కు చెందిన సామానంతా సర్దించాక క్రిందకు వచ్చింది.

"రండి బాబాయి భోంచేద్దురుగాని" అంది.

"నాకు ఆకలిగా లేదు పిన్నీ" అన్నాడు శరత్.

"సరే. వినయ్‌తో మాట్లాడుతుండు. అంకుల్ వచ్చాక అందరం భోంచేద్దాం" అంది రూప.

"విధిరాత అంటే ఇలానే వుంటుంది కాబోలమ్మా. వక్రవాడు యెంత తెలివయినవాడో. ఏం చేస్తాం. ఆ కళ్ళు ఇవ్వలేదు. ఆ అన్యాయంతో సరిపెట్టాడా? తల్లి తండ్రుల్ని కూడా దూరంచేశాడు" భోంచేస్తూ అన్నాడా ముసలాయన.

"మనమేం చెయ్యగలం చెప్పు బాబాయి. అక్క నా కళ్ళలో యెప్పుడూ వుంటుంది. శరత్‌ను నా బిడ్డకంటే ఎక్కువగా చూసుకుంటాను. వాడికి అక్క లేని లోటు తెలియనివ్వను" దృఢంగా అంది రూప.

"నాకు తెలుసమ్మా. మీరిద్దరూ ఒకర్నొకరు ఎంత గాఢంగా ప్రేమించుకునేవారో."

"ఏమిటో బాబాయి ఇంకో నెలరోజులాగితే పెద్ద ఫ్యాక్టరీ....అంతా హడావుడిగా వుండేది. బావగారు అన్ని విషయాలు మాట్లాడారు. ఈయున్ని ఉద్యోగం వదిలి రమ్మన్నారు. దాదాపు అంతా నిర్ణయమైపోయింది.

ఈలోపే ఆ లారీవాడు పొట్టన బెట్టుకున్నాడు."

"ఈ లారీల వాళ్ళది మహా దారుణమైపోయిందమ్మా. వాళ్ళు తెగ తాగి ఇలా ఎంతమంది ప్రాణాలు తీస్తున్నారో. జనం ప్రాణాలంటే విలువలేని రాక్షసులు" కసిగా అన్నాడాయన.

భోజనం ముగించి వాష్ బేసిన్‌లో చేతులు కడుకున్నాడు.

"మరి నేను వెళతానమ్మా" అన్నారాయన.

"ఓ వారం రోజులుండు బాబాయ్" అంది రూప.

"లేదమ్మా, అర్జెంటు పనులున్నాయి. వెళ్ళాలి."

రూప ఇంకా బలవంతం చెయ్యలేదు.

"అప్పుడప్పుడు వస్తుండు బాబాయి."

"తప్పకుండా వస్తానమ్మా, శరత్ కోసమైనా రావాలి కదా" అన్నారాయన. వారిద్దరూ కలిసి హాల్లోకి వచ్చారు.

"కాకెలా ఉంటుందో తెల్సా?" వినయ్ అడుగుతున్నాడు.

"నల్లగా వుంటుంది. కావ్ కావ్ అంటుంది."

"మరి పులి."

"ఆ, ఘాండ్రుమంటుంది" గొంతు మార్చి చెప్పాడు శరత్.

"నువ్వెప్పుడు చూశావ్" అన్నాడు వినయ్.

"తప్పమ్మా, అలా అనకూడదు" వింటున్నదల్లా అంది రూప.

"ఓ, పిన్నీ, తప్పేముంది పిన్నీ. నాకు కళ్ళు కనపడవుగా. యెలా చూస్తానని వినయ్ అనుమానం. అమ్మ నాకన్నీ చెబుతుందేది. వాటిని నేను ఊహించుకోగలను"

అన్నాడు శరత్.

"మరి నేను వస్తాను బాబు" అన్నాడా ముసలాయన.

"తాతగారూ" అంటూ లేచి నిలబడ్డాడు. ఆయన ఆప్యాయంగా శరత్ నెత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు.

"అప్పుడప్పుడు వస్తుంటానమ్మా. నీకేం దిగులు లేదు. నీకు అమ్మ వుంది. తమ్ముడున్నాడు...."

"స్కూటర్ వచ్చిందే" మధ్యలో అన్నాడు.

అప్పుడే కృష్ణ లోపలకు నడిచి వస్తున్నాడు.

"బాబాయేనా వచ్చేది" అడిగాడు శరత్.

"అవునాయనా" అన్నాడు ముసలాయన.

"ఎప్పుడొచ్చారు. క్షేమమేనా" అంటూ పలకరించాడు కృష్ణ.

"కులాసానే బాబు. వెళుతున్నాను."

"అప్పుడేనా!"

"కొంచెం పనులున్నాయి. మరలా వస్తాను."

"మంచిది."

ఆయన వెళ్ళిపోయాడు.

"డ్రెస్ ఛేంజ్ చేసుకురండి. అందరం భోంచేద్దాం." అంది రూప.

"ఓ.కె" అంటూ గదిలోకి వెళ్ళాడు కృష్ణ.

# 3

"నువ్వెం పట్టుకోకు పిన్నీ. నేను నడుస్తాను" అన్నాడు శరత్.

"నీకేమైనా ఇబ్బందిగా ఉందా శరత్. చెప్పు. నీ గది క్రిందికి మారుస్తాను" అంది రూప.

"లేదు పిన్నీ, ఒక్కసారి దారి చూపిస్తే నాకు గుర్తు వుంటుంది. నేనే నడిచి వెళతాను. నాకు పైన గదే

వుంచు పిన్నీ. అప్పుడప్పుడూ క్రిందికీ, పైకీ నడిచి వెళు తుంటే కొంచెం ఎక్సర్ సైజ్ చేసినట్లుంటుంది" అన్నాడు శరత్.

"నీ ప్రక్క గదే వినయ్‌ది. నీకేమైనా అవసరమై పిలిస్తే వస్తాడు."

"వినయ్‌ను కూడా నా గదిలో ఉండమనకూడదా పిన్నీ" అన్నాడు శరత్.

"వద్దు వాడు చాలా అల్లరి పిల్లవాడు. నీ గదిలో వస్తువులన్నీ కదిలిస్తాడు.

"చిన్న పిల్లవాడు కదా" నవ్వాడు శరత్.

రూపకు శరత్‌తో మాట్లాడుతుంటే ఓ పిల్లవాడితో మాట్లాడుతున్న అనుభూతి కలగదు. జీవితాన్ని కాచి వడబోసిన వేదాంతి తో మాట్లాడినట్లుంటుంది. శరత్‌తో గదిలోనికి ప్రవేశించింది.

"ఇదిగో ఇక్కడ డ్రెస్సింగ్ టేబుల్ వుంది. తలుపు తీయగానే స్విచ్ బోర్డు వుంది. ఈ టేబుల్ మీద పౌడర్, దువ్వెన వుంటాయి. ఈ అల్మారాలో నీ బుక్స్ వున్నాయి. నీ బెడ్ ప్రక్కనే నీ చేతికందుతుంది స్విచ్. లైటు వేసుకోవాలన్నా, తియ్యాలన్నా నువ్వు లేవ నవసరంలేదు. నిద్రపోయేముందు ఆఫ్ చేసుకో. నువ్వు క్రిందికి దిగితే కొంచెం ప్రక్కగా కుండ వుంది. దాంట్లో మంచినీళ్ళున్నాయి. ఇంకేమైనా కావాలంటే గది బయటకు వస్తే వినయ్ వున్నాడు. మేం వస్తాం" అంది రూప.

"థాంక్స్ పిన్నీ" అన్నాడు శరత్.

"సరే రా. టిఫిన్ చేద్దాం" అంది. రూపతోపాటే క్రిందికి వెళ్ళాడు.

"నేను కాన్వెంటుకు వెళుతున్నాను" తింటూ అన్నాడు వినయ్.

"మళ్ళా ఎన్నింటికొస్తావ్."

"ఈవెనింగ్."

"గుడ్."

"నువ్వేం చేస్తావన్నాయ్" అన్నాడు వినయ్.

"నువ్వొచ్చేదాకా చదువుకుంటాను."

"చదువుతావా" ఆశ్చర్యంగా అడిగాడు వినయ్.

"అవును."

"ఎలా?"

"సాయంకాలం రా చూపిస్తాను."

"నీకు ఎ బి సి డి వచ్చా."

"నాలుగు బడులొచ్చు. నీకు లెటర్ రాయమన్నా రాస్తాను" అన్నాడు శరత్.

వినయ్‌కు అంతులేని ఆశ్చర్యంగా వుంది. కాన్వెంట్ కెళ్ళాడేగాని మనసునిండా అవే ఆలోచనలు. కళ్ళులేవు కదా—శరత్ ఎలా చదువుతాడు? ఎలా రాస్తాడు? తలుచుకుంటూనే ఆశ్చర్యంగా వుంది. సాయంకాలం వచ్చాక "అమ్మా, ఆకలి" అనకుండానే శరత్ గదిలోకి వెళ్ళాడు.

శరత్ పడుకొని శూన్యంలోకి చూస్తున్నాడు.

"అన్నయ్యా" అంటూ లోపలకు వచ్చాడు వినయ్.

శరత్ ఉలిక్కిపడ్డాడు.

"రా వినయ్" అంటూ లేచి కూర్చున్నాడు.

"మరి నువ్వు చదువుతానన్నావుగా. నా బుక్ తెచ్చిస్తాను. చదువు చూద్దాం" అన్నాడు వినయ్.

"నీ బుక్ చదవటం నాకు కుదరదు. నా బుక్ చదువ

తాను" అంటూ లేచాడు శరత్.

అల్మారాలో తన బుక్ అందుకున్నాడు. వినయ్ దానివంక చూశాడు. గుడ్డివాళ్ళకోసం ప్రత్యేకంగా తయారుచేసిన పుస్తకం అది. వేళ్ళతో తడుముతూ అక్షరాలను గ్రహిస్తారు. శరత్ వేళ్ళతో తడువుతూ ఆ పుస్తకంలో విషయాలు చెప్పసాగాడు. వినయ్ ఆశ్చర్యానికి అంతులేదు.

"అన్నయ్యా, మా ఫ్రెండ్‌తో నువ్వు చదువుతావని చెబితే నమ్మలేదు" అన్నాడు వినయ్.

"నువ్వూ నమ్మలేదుగా" అన్నాడు శరత్.

వినయ్ సిగ్గుతో తల వంచుకున్నాడు.

"ఎందుకు సిగ్గుపడతావ్. ఎవరయినా చూడందే నమ్మరులే" అన్నాడు శరత్.

"నీకు కళ్ళు నిజంగా కనపడవా అన్నయ్యా" అనుమానంగా అన్నాడు వినయ్.

"ఏమిటిరా విసిగిస్తున్నావ్" అంటూ వచ్చింది రూప. ఆమె చేతిలో ఓ ట్రే వుంది. రెండు ప్లేటనిండా బిస్కట్లు తెచ్చింది.

"విసిగించటంలేదు పిన్నీ, ఏవో అడుగుతున్నాడు."

"వాడంతే. ఎప్పుడూ వాగుతాడు."

"వాగనీ పిన్ని. ముందు వినయ్ అనుమానాలు తీరితే ఆ తర్వాత అతన్నడిగి కొన్ని విషయాలు నేను తెలుసుకోవాలనుకుంటున్నాను."

"వాడికేం తెలుసు శరత్."

"అదేమిటి పిన్నీ. ప్రతివారినుండి నేర్చుకోవచ్చని అమ్మ చెప్పింది" అన్నాడు శరత్.

అంతలో నే గంభీరంగా మారిపోయాడు. తల్లి

జ్ఞాపకం వచ్చింది. ఆమె ప్రేమ జ్ఞాపకం వచ్చింది. రూప శరత్‌ను గమనిస్తూనే వుంది.

"ఏమిటి శరత్ అలా అయిపోయావు."

"ఏం లేదు పిన్నీ. అమ్మ గుర్తొచ్చింది. ఓసారి అమ్మ అంది. నీకు కళ్ళు లేవు ఎలా బ్రతుకుతావో అంటూ. అమ్మా నువ్వెప్పుడూ నా ప్రక్కనుంటావు కదా. నాకు నీ కళ్ళున్నాయిగా అన్నాను. నాకు కళ్ళు లేకపోవటం కాదు దురదృష్టం అమ్మ లేకపోవటమే."

దిగ్భ్రాంతితో వింటుండిపోయింది రూప. ఆమెకు అక్క గుర్తుకొచ్చింది. ఆమె తన బిడ్డపట్ల ఎంత సునిశితంగా ఉండేదో శరత్‌ను చూస్తుంటే అర్థమవుతుంది. ఆ చిన్నవయసులో అతని భావాలు, మర్యాద, చురుకుదనం, తెలివితేటలు, మొత్తంగా శరత్ ఓ అద్భుత విషయంలా కనిపిస్తున్నాడు. శరత్ వెనుక అక్క మేధస్సు, ప్రేమాభిమానాలున్నాయి. అలాంటి తల్లికి దూరంకావటం ఎంత దురదృష్టం! అలాంటి అక్కను పోగొట్టుకున్న తాను మాత్రం దురదృష్టవంతురాలు కదూ!

"బిస్కట్లు తీసుకో శరత్" అంది రూప.

అంతలోనే మామూలుగా అయిపోయాడు శరత్. బిస్కట్ అందుకొని నోట్లో పెట్టుకున్నాడు.

"నీకిక్కడ ఏం బోరుగా లేదుగా" అంది రూప.

"గుడ్డివాడికి బోరేంటి పిన్ని" అన్నాడు శరత్.

రూప విలవిలలాడిపోయింది.

రాత్రి పదిగంటలు దాటింది. రూప వినయ్‌నూ శరత్‌నూ తీసుకొని వారి గదుల్లోకి వెళ్ళింది. శరత్ గది తలుపులు తీసింది.

"క్రింద తలుపులు మేం వేస్తాం. తలుపు దగ్గరకు

చేసి వెళతాం. నీకేం భయంలేదుగా" అంది రూప.

"లేదు పిన్నీ, ఒంటరిగా పడుకోవటం నాకూ అల వాటే" అన్నాడు శరత్.

రూప తలుపు దగ్గరకు వేసి వినయ్‌ను తీసుకు వెళ్ళింది. వినయ్‌ను వేరే పడుకోబెట్టడం ముందునుండీ అలవాటు చేసింది. ఒంటరిగా ఉండటం అతనికలవాటే.

"అమ్మా, అన్నయ్యకు కలలొస్తాయా?" అడిగాడు వినయ్.

"ఎందుకు రావు" అంది రూప. వెంటనే ఆమెకూ అనుమానం కలిగింది.

## 4

శరత్ వచ్చి వారం రోజులు గడిచాయి.

ఇప్పుడు దాదాపు ఇల్లంతా బాగా పరిచయం అయింది. ఎవరి సహాయం లేకుండానే మొత్తం ఇల్లంతా అతను తిరగగలడు. అలాగే బయటకు వెళ్ళి పచ్చికలో కూర్చుని మనస్సును ఏకాగ్రతతో నిలిపి, ప్రకృతిలోని ప్రతి చిన్న శబ్దాన్ని రిసీవ్ చేసుకుంటాడు. మొక్కల మీద వీచే పిల్లగాలి చిరుసవ్వడినుండి క్రిమికీటకాల సున్నితమైన చప్పుడును కూడా అతను గ్రహించగలడు. కొన్నిసార్లు మాట్లాడుతుండగానే వంటగదిలో ఏవో పడ్డాయని చెబితే రూప వెళ్ళి చూసి నిజమేనని గ్రహించింది. శరత్ గార్డెన్‌లో కూర్చుని ఫోన్ శబ్దం విని చెప్పేవాడు.

అతనికోసం ప్రత్యేకమైన పుస్తకాలకు ఆర్డరిచ్చారు. సాయంకాలంపూట రూప శరత్‌నూ, వినయ్‌నూ వెంట బెట్టుకొని వెళ్ళేది. శరత్ అడుగుతుంటే చెప్పేది. వినయ్ శరత్ మంచి స్నేహితులయిపోయారు. ఆ స్నేహం

వల్ల వినయ్ చదువుకు ఎలాంటి ఆటంకం లేకుండా శరత్ చూసుకునేవాడు. ఆ ఇంట్లో ఎవరికీ తనవల్ల ఎటువంటి యిబ్బంది కలగకుండా జాగ్రత్తపడేవాడు.

సాయంకాలం శరత్ తన గదిలో కూర్చొని టేప్ వింటున్నాడు. వినయ్ కాన్వెంట్ నుండి రాగానే శరత్ దగ్గరకు పరిగెత్తాడు. గదిలోకి వెళుతుంటే ఎవరివో స్త్రీ మాటలు వినిపించాయి. అలికిడి విని శరత్ టేప్ ఆఫ్ చేశాడు.

"రా వినయ్" అంటూ పిలిచాడు.

"ఎవరితో మాట్లాడుతున్నావు."

"అమ్మతో."

"ఏ అమ్మతో."

"మా అమ్మతో" అన్నాడు శరత్.

టేప్‌లోని క్యాసెట్ అంతా శరత్ తల్లి మాటలు రికార్డు అయి వున్నాయి. వారు ముగ్గురూ కలిసి మాట్లాడుతున్నప్పుడు ఆమె అలా రికార్డు చేస్తుండేది. ముఖ్యంగా శరత్‌కు మాటలు వస్తున్న దగ్గర్నుండి ఆమె అవన్నీ రికార్డు చేసేది. అలాగే యెప్పుడైనా శరత్ లేకుండా తనెక్కడికైనా వెళితే అక్కడి విశేషాల్ని అతనికోసం రికార్డు చేయటం ఆమె అలవాటు. శరత్ అవన్నీ వింటుంటాడు.

శరత్ తిరిగి టేప్ ఆన్ చేశాడు.

శరత్ తల్లి కంఠం వినబడుతోంది.

"అన్నయ్యా, పెద్దమ్మ యెలా వుంటుందో నీకు తెలుసా?"

"ఎందుకు తెలియదు. ఆమె చేతులు నన్ను ఆప్యాయంగా పట్టుకుంటాయ్. ఆమె కళ్ళు నన్ను ప్రేమగా

చూస్తాయి. ఆమెను నేను ఊహించుకోగలను."

"మీ డాడీ."

"ఆయన్ని కూడా. మా డాడీ చాలా మంచివారు. ఆయన నన్ను ఎత్తుకొని ఆడిస్తూ ఏడిచేవారు."

"పెద్దగానా."

"కాదు. ఆయన కళ్ళవెంట నీళ్ళు కారుతుండేవి."

"ఎందుకన్నాయ్."

"నాకు కళ్ళు కనపడవుగా. అందుకు."

"అన్నాయ్. నీకు కళ్ళు కనపడకపోయినా అన్నీ తెలుస్తాయి. నేను కళ్ళు మూసుకుంటే నాకేం కనపడటం లేదు. నీలాగే నాకూ కళ్ళు పోతే నాకూ అన్నీ తెలుస్తాయిగా" అన్నాడు వినయ్.

"ఛా....తప్పమ్మా, కళ్ళు లేకపోవటం ఎంత నరకమో నీకు తెలియదు" అన్నాడు శరత్.

"ఏం వినయ్. కాన్వెంట్ నుండి రావటంతోనే మొదలుపెట్టావా. డాడీ వచ్చారు. లాన్‌లో కూర్చుందాం పదండి" అంది రూప వస్తూ.

అందరూ లాన్‌లో ఛైర్స్ వేసుకొని కూర్చున్నారు. పనిమనిషి టీ తెచ్చి ఇచ్చింది. అంతా త్రాగి మాట్లాడుకోసాగారు.

"పిన్నీ నీ గడియారం ఆగిపోయింది. కీ ఇవ్వకూడదూ" అకస్మాత్తుగా అన్నాడు శరత్.

రూప ఆశ్చర్యంగా తన వాచీవంక చూసుకుంది. నమ్మకం కుదరక చెవికి ఆనించుకుంది. నిజంగానే ఆడటం లేదు. కీ ఇచ్చింది.

"నీ దగ్గర మానవాతీత శక్తులేమైనా ఉన్నాయా

శరత్" అన్నాడు కృష్ణ.

"అంటే ఏమిటి బాబాయ్" అన్నాడు శరత్.

"అంటే సూపర్ పవర్స్. ఆ శక్తులు మనిషికుండవు. దేవతలకూ దెయ్యాలకూ మాత్రమే ఉంటాయి."

"దయ్యాలుంటాయా బాబాయి."

"వుండొచ్చు. నేనెప్పుడూ చూడలేదు" అన్నాడు కృష్ణ.

"నాకు చూడాలన్నా కనపడవుగా" అన్నాడు శరత్.

"అవి కనపడకపోయినా ఆవహిస్తాయి. నిద్రలో కలలోకి వస్తాయి" అన్నాడు కృష్ణ.

"అబ్బ ఊరుకోండి. ఇంకేమైనా మాట్లాడుకుందాం" అంది రూప.

"చెప్పనీ పిన్నీ. చాలా ఇంట్రెస్టింగ్ గా ఉంది. మమ్మీ అయితే దేవుడూ దెయ్యం లేవని చెప్పింది. నీకు అన్యాయం చేసినవాడు దేవుడెట్లా అవుతాడురా అనేది."

"నిజమే. దెయ్యాలూ....భూతాలూ అంతా ట్రాష్" అంది రూప.

"దేవుడున్నాడంటావా" అడిగాడు కృష్ణ.

"దేవుడు వుండవచ్చు" అంది రూప.

"దేవుడుంటే దెయ్యం కూడా వుంటుంది" అన్నాడు కృష్ణ.

"మీ తర్కం బాగుంది. ఓ మూఢ నమ్మకంతో మరో మూఢనమ్మకాన్ని సమర్థించుకుంటున్నారు."

"ఏమో, నాకు దేవుడూ దెయ్యం గురించి చిన్నప్పుడు ఆలోచనలుండేవి. రౌటీన్ కార్యక్రమంలో పడ్డాక

అవన్నీ మరిచిపోయాను. తిరిగి ఇటీవల సాహిత్యంలో దెయ్యాలూ, భూతాల గురించి చదువుతుంటే వాటి గురించి ఆలోచించాల్సి వస్తోంది" అన్నాడు కృష్ణ.

"ఇంతకూ దయ్యాలున్నాయా" అడిగాడు శరత్.

"అది మనకు తెలియదు బాబూ."

"మొత్తానికి మన సాహిత్యానికున్న ఎస్కేపిస్టు ధోరణినే మీరు ప్రతిబింబించారు" అంది రూప.

"అదేమిటోయ్."

"అవును మరి, ఉంటే వున్నాయని చెప్పాలి. లేకుంటే లేవని చెప్పాలి."

"మరి నేను చూడలేదుగా."

"అంటే మీ అనుభవంలోకి వచ్చేంతవరకూ దెయ్యాలు లేవు."

"బాగా చెప్పావు పిన్నీ" అన్నాడు శరత్.

"నువ్వు లా చదవాల్సింది రూపా" అన్నాడు కృష్ణ.

చీకట్లు క్రమ్ముకొస్తున్నాయి. వినయ్ గుబురుగావున్న చెట్టువంక చూశాడు. అంతా గాఢాంధకారంగా వుంది. గాలికి ఊగుతున్న చెట్ల కొమ్మలు దెయ్యపు చేతుల్లా కనిపించాయి.

"మమ్మీ భయం వేస్తుందే" అన్నాడు వినయ్.

"ఎందుకు?"

"అక్కడ చెట్టు దగ్గర దయ్యం వుంది" అన్నాడు భయంగా.

రూప భర్తవంక చిరుకోపంగా చూసింది.

"చూశారా మీ మూలంగా వాడికి క్రొత్త భయాలొచ్చాయి" అంటూ వినయ్‌ను ఎత్తుకొని చెట్టు దగ్గరకు తీసుకెళ్ళింది. 'అమ్మో భయం' అంటున్నా 'నేనున్నాగా'

అంటూ తీసుకెళ్ళింది.

"ఏదీ చూపించు. అది రోజూ చూసే చెట్టే. అవి కొమ్మలు. చీకటిగా వుండటంతో అలా కనిపిస్తుంది. ఇక్కడినుండి చూస్తే డాడీ ఎలా కనపడుతున్నాడు. డాడీ కూడా దెయ్యమేనా? దెయ్యాలూ, భూతాలూ లేవు. తెలిసిందా" అంది.

వినయ్ అనుమానంగా చెట్టువంక చూశాడు.

"ఏమిటి మాట్లాడవు."

"తెలిసింది మమ్మీ" అన్నాడు వినయ్.

రూప తిరిగివచ్చి "ఇంక లేవండి. సాయంకాలంపూట మంచి టాపిక్ తీసుకున్నారు" అంది.

అంతా లేచారు.

## 5

శరత్ గదిలో పడుకున్నాడు.

కిటికీ తలుపు తెరిచి వుంది. వెన్నెల కిటికీనుండి చొచ్చుకొని వచ్చి మీద పడుతూంది. చల్లగా గాలి వీస్తూంది. టేప్ రికార్డర్ నుండి పాట సన్నగా వినిపిస్తోంది. అతని మస్తిష్కంలో యేవేవో ఆలోచనలు చిందర వందరగా పరుగులీస్తున్నాయి.

విశాలమైన పచ్చికబయలు. దూరంగా తానున్నాడు.

'శరత్' అమ్మ పిలుపు.

శబ్దం వచ్చిన వైపుకు తాను తిరిగాడు.

దూరంగా ఎక్కడో దూసుకొస్తున్న లారీ శబ్దం.... భయంకరంగా కారును గుద్దితే, ఆ తాకిడికి గాల్లో ఎగిరిపడి మంటల్లో కారు.... తెగిపడిన అమ్మా... నాన్న.

శరత్ కు చెమటలు పట్టాయి. టేప్ లో పాట అయిపోయింది. ఆఫ్ చేశాడు. శరత్ కిప్పుడు దెయ్యం అంటే

లారీనే గుర్తుకొస్తూంది. అమ్మనూ నాన్ననూ బలితీసుకున్న ఆ లారీ పెద్ద దెయ్యం అనుకున్నాడు. ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయాడు.

అకస్మాత్తుగా ఎందుకో మెలకువ వచ్చింది.

చెవులు రిక్కించాడు.

ఏకాగ్రతతో వింటుండిపోయాడు.

"టక్....టక్....టక్."

మెట్లమీదినుండి వినిపిస్తుందా శబ్దం.

ఎవరో నడిచివస్తున్నారు.

బహుశా పిన్నో, బాబాయో అయివుంటారు.

శబ్దం ఆగిపోయింది.

కొంచెంసేపు భయంకరమైన నిశ్శబ్దం.

"టక్....టక్....టక్."

తిరిగి క్రిందకు వెళుతున్న చప్పుడు.

"ఎవరు వచ్చింది" అనుకున్నాడు శరత్. ఎందుకని పైకి రాలేదు. వెనక్కి వెళ్ళిపోయారెందుకు? వచ్చింది బాబాయిగానీ పిన్నిగాని కాదా?

మరెవరు? దెయ్యమా?!

అకస్మాత్తుగా శరత్‌కు చెమటలు పట్టేశాయి. చాలాసేపు అలానే ఆలోచిస్తుండిపోయాడు. తిరిగి ఆ చప్పుడు వినపడుతుందేమోనని చూశాడు. ఆ తర్వాత ఎలాంటి శబ్దాలూ లేవు. చెట్టును చూసి దయ్యం అనుకొన్న వినయ్ గుర్తొచ్చి నవ్వుకున్నాడు. మనసు తేలికయింది. తిరిగి వెంటనే నిద్రపట్టేసింది.

ఉదయం వినయ్ కాన్వెంట్ కెళుతుంటే మెల్లగా అడిగాడు.

"రాత్రి నీకేమైనా శబ్దాలు వినిపించాయా."

"ఏం శబ్దాలు" భయంగా అన్నాడు వినయ్.

"ఎవరైనా నడిచివచ్చిన శబ్దం."

"లేదు. ఎందుకడుగుతున్నావు."

"ఊరికినే. సాయంకాలం త్వరగా వస్తావా ఆడుకుందాం."

"వస్తాను" అన్నాడు వినయ్.

వినయ్ వెళ్ళిపోయాక మెట్లుదిగుతూ లెక్కపెట్టాడు. మొత్తం పదిహేడు మెట్లున్నాయి. రాత్రి బహుశా ఇక్కడిదాకా వచ్చి తిరిగి వెళ్ళి వుండవచ్చుననుకున్నాడు ఓ మెట్టుమీద నిలబడి.

"ఈ విషయం గురించి అనవసరంగా ఆలోచిస్తున్నానా" అనుకున్నాడు.

అయినా ఆ రోజంతా ఆలోచనలు ఆ విషయంమీదే వుండిపోయాయి. సాయంకాలందాకా చాలా భారంగా గడిచింది. ఆ తర్వాత వినయ్ వచ్చినా మనసు ఆ సంఘటన గురించే ఆలోచిస్తుండి పోయింది.

అర్ధరాత్రి దాటింది.

గడియారం కొడుతున్న గంటల మ్రోత!

ఆలోచనలు పరుగుతీస్తున్నాయి.

## 6

నాలుగు రోజులు గడిచాయి.

శరత్ ఆ విషయం గురించి అప్పుడప్పుడూ ఆలోచిస్తూనే వున్నాడు. తిరిగి అలాంటి అనుభవం యెదురు కాలేదు. బహుశా ఆ సాయంకాలం జరిగిన చర్చ మూలంగా, ఎక్కువగా అదే విషయం గురించి ఆలోచించటంవలన అలా జరిగివుంటుందనుకున్నాడు. అయినా తనమీద తనకు నమ్మకం వుంది. ఆ రోజు యెవరో నడిచి

వచ్చింది మాత్రం వాస్తవం అనుకున్నాడు.

శరత్ ఆదమరిచి నిద్రపోతున్నాడు. ఒక్కసారి ఉలిక్కిపడి లేచాడు. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. వేగంగా గుండె కొట్టుకుంటున్న శబ్దం వినిపిస్తోంది.

ఆదే శబ్దం....!

టక్....టక్....టక్

ఎవరో నడిచివస్తున్న శబ్దం. మెట్లెక్కి వస్తున్నారు. శరత్ వింటున్నాడు ఆ శబ్దాన్ని. మనసులో లెక్కపెడుతున్నాడు. ఒకటి....రెండు..మూడు..మొత్తం మెట్లన్నీ అయిపోయాయి.

"ఎవరది" అని బిగ్గరగా అరవాలనుకున్నాడు.

నోరు పెగల్లేదు.

ఇప్పుడెలాంటి శబ్దంలేదు. కిటికీలోనుండి చల్లటి గాలి మేనును తాకుతూంది. వచ్చింది పిన్నయితే తలుపు తీసుకు రాదేం! బాబాయయినా లోపలకు రాదేం! ఆ చప్పుడు తన గది ముందుకే వచ్చి ఎందుకాగింది? అసలు ఇలా ఎందుకు జరుగుతోంది? అన్నీ ప్రశ్నలే!

తిరిగి చప్పుడు మొదలయింది.

"టక్....టక్....టక్."

తిరిగి క్రిందకు వెళుతున్నారెవరో. ఒక్కో మెట్టు దిగి హాల్లో మాయం అయింది. చప్పుడు వినపడటంలేదు. అప్పటిదాకా సీలింగ్ ఫ్యాన్ తిరుగుతున్నా వంటినిండా చెమటలు....వేడి. మంచంమీద లేచి కూర్చున్నాడు. చేతికందిన స్విచ్ నొక్కాడు. గదంతా ప్రకాశవంత మైంది. ఎవరో చెబితే విన్నాడు. దెయ్యాలకి వెలుతురంటే భయం అని. లైటువేశాక కొంచెం గుండె దడ తగ్గింది. తిరిగి పడుకున్నాడు. అయినా సరిగా నిద్రపట్ట

లేదు. అరగంటకోసారి ఉలిక్కిపడి లేచాడు. గడియారం మ్రోత తప్ప ప్రశాంతంగానే వుండిపోయాడు.

ఉదయం లేచాక డైనింగ్ టేబుల్ దగ్గర టిఫిన్ చేస్తున్నారంతా.

"రాత్రి మేడమీదకొచ్చావా పిన్నీ" అడిగాడు శరత్.

"రాలేదే. ఏం అలా అడిగావ్" అంది రూప.

"ఏం లేదు. ఎవరో నడిచివచ్చినట్లుంటేనూ."

"ఏమండి మీరుగానీ వెళ్ళారా?"

"లేదు. ఉదయందాకా మెలకువ రాలేదు" అన్నాడు కృష్ణ.

"మొన్న ఓసారి ఇలానే శబ్దం వినిపించింది."

"ఎప్పుడూ.... దెయ్యం కబుర్లు చెప్పిన రోజా" అంది రూప.

తలూపాడు శరత్.

"చూడు శరత్. ప్రతి విషయం గురించి అంత సీరియస్‌గా ఆలోచించకూడదు. ఆ రోజు వినయ్ చెట్టును చూసి దయ్యం అనుకున్నాడు. ఓ వేళ దయ్యమే అనుకో దానికేమిటి పని. మెట్లెక్కి నడిచి వచ్చి, తిరిగి వెళితే ఆ దయ్యానికి కలిగే ఆనందం ఏమిటి? పోనీ దయ్యం వుందని ఒప్పుకున్నా వాటికి లేని శక్తులు లేవుగా. తలుపులు మూసుకున్నా దూసుకొస్తాయి. నా చిన్నప్పటి నుండీ ఇలాంటి చెత్త వింటూనే వున్నాను. నువ్వు ఇంకేమైనా విషయం గురించి ఆలోచించు శరత్. నువ్వు చాలా తెలివిగలవాడివి. గుడ్డితనం వుంటే ఏం? కళ్ళుండి ఎందుకూ పనికిరాని అనేకమంది మీద నువ్వు ఎంతో నయం. నువ్వు పెద్దయితే ఎన్నో వండర్స్ చెయ్యొ

గలదన్న నమ్మకం నాకుంది" అంది రూప.

ఫ్యాక్టరీకి వెళుతుంటే కృష్ణతో అంది.

"చూశారా. ఆ రోజు చర్చ ఎంత ప్రభావం చూపించిందో."

"సారీ రూపా. కావాలని నేనా విషయం చర్చించలేదు. శరత్ తెలివితేటలకు ఆశ్చర్యం వేసి ఏదో అంటే ఆ మాటలనుండి ఆ టాపిక్ వచ్చింది. శరత్ యింత సీరియస్‌గా ఆలోచిస్తాడనుకోలేదు."

"ఇంతకూ శరత్‌కు కలుగుతున్న ఆ అనుభవం ఏమిటంటారు?"

"అంతా....ఇల్యూషన్. అంతే."

"నిజమే."

"ఈసారి అలాంటి టాపిక్ రాకుండా చూసుకుంటాను" నొచ్చుకొంటూ అన్నాడు కృష్ణ.

రాత్రి అయింది. శరత్ తన గదిలోకి వెళ్ళాడేకానీ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఇప్పటికి రెండుసార్లు ఆ చప్పుడు తాను విన్నాడు. అది మాత్రం యెవరుకాదన్నా తాను అంగీకరించలేదు. ఆ వచ్చింది పిన్ని, బాబాయి కాదంటున్నారు కాబట్టి, మరో వ్యక్తి అయివుండాలి! అయితే ఎవరు? అతను లేక ఆమె మేడమీదికొచ్చి ఎందుకు తిరిగి వెళ్ళిపోతున్నారు? వాళ్ళకేం కావాలి?

తన గదిలో అమూల్యమైన వస్తువులేం లేవు. మరి తన గదిదాకా వచ్చి వెళ్ళటం ఎందుకు? దయ్యాలు వస్తాయనుకుంటే వాటికి తానేం చేశాడు? అంతమందిని వదిలి తన దగ్గరకే ఎందుకొస్తాయ్? ఆ చప్పుడు తనకే వినిపించటం ఏమిటి? అన్నీ ప్రశ్నలూ? ప్రశ్నలు?

మొత్తంమీద పిన్ని ఈ విషయం తేలిగ్గా తీసి పార

వేసింది. కొంచెంసేపు బాధపడ్డాడు. ఎవరయినా అంతే కదా అనుకున్నాడు. తాను ఎక్కువగా ఈ విషయం గురించి మథనపడుతున్నాడేమో అని కూడా అను కున్నాడు. కొంచెంసేపు టేప్ అన్ చేసి అమ్మ మాటలు విన్నాడు. నిద్ర ముంచుకొస్తుంటే లైటార్పి పడు కున్నాడు.

శరత్ కి ఆ రాత్రికూడా ఆ చప్పుడు వినిపించింది.

వాళ్ళ ఉద్దేశ్యమేమిటో రెండు రోజులు స్టడీ చెయ్యాలి. ఆ తర్వాత....

శరత్ కు హాయిగా నిద్రపట్టింది.

## 7

ఉదయం లేచి స్నానం ముగించుకొని టిఫిన్ చేయ డానికి ఉపక్రమించారు.

"ఎవరో వచ్చారమ్మగారూ" అని పనిమనిషి చెబితే, రూప వెళ్ళింది.

"మీరా బాబాయి రండి" అంటూ ఆహ్వానించింది.

ఆయన కూడా కాళ్ళు కడుక్కొని డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చాడు.

"ఏం బాబూ బాగున్నావా" అన్నాడు.

శరత్ ఆ కంఠం గుర్తుపట్టి "తాతాగారూ" అన్నాడు అప్యాయంగా కుర్చీలో నుండి లేచి ఆయన దగ్గరకు రాబోయాడు.

"ఉండమ్మా, పడతావు" అంటూ ఆయన వచ్చి దగ్గరకు తీసుకున్నాడు. ప్రేమగా తల నిమిరాడు.

"ఏమిటి తాతగారూ, మరలా రాలేదు. నన్ను మరిచి పోయారా" అన్నాడు శరత్. ఆ మాటలకు ఆయన కదిలిపోయాడు.

"లేదు బాబూ. నిన్నిలా మరిచిపోతాను. పొలం పనులతో హడావుడిగా వుంది. ఇప్పటికయినా నిన్ను చూడాలని తీరిక చేసుకొని వచ్చాను" అన్నాడు.

"కూర్చుని టిఫిన్ చేస్తూ మాట్లాడండి బాబాయి" అంది రూప.

అందరూ కూర్చున్నారు.

"ఆయన ఏడమ్మాయ్" అన్నాడు ముసలాయన.

"రాత్రి కొంచెం లేట్‌గా వచ్చారు. నిద్రపోతున్నారు. లేపుతానుండండి" అంది రూప.

"ఫర్వాలేదు. పడుకోనీమ్మా" అన్నారాయన.

"ఈసారి ఓ వారం రోజులుండాలి బాబాయి. శరత్‌కు కూడా కాలక్షేపంగా ఉంటుంది."

"కొంచెం పనులున్నాయమ్మా" ఇబ్బందిగా అన్నాడు.

"లేదు తాతగారూ. మీరు వుండాలి" అన్నాడు శరత్.

ఆయన మొహమాటంగా "సరే. నాలుగు రోజులుంటాను. అంతకుమించి బలవంతం చెయ్యకండి" అన్నాడు.

"థాంక్స్ తాతగారూ" వినయ్, శరత్ అన్నారు.

"ఏం బాబూ, బాగా చదువుతున్నావా" వినయ్‌ని అడిగాడు.

"మా క్లాసులో నేనే ఫస్ట్" గర్వంగా చెప్పాడు వినయ్.

"మార్కుల్లో కాదు బాబాయి. గొడవ చెయ్యటంలో" అంది రూప నవ్వుతూ.

"ఊఁ వ్వె.... వ్వె.... వ్వె" వెక్కిరించాడు వినయ్.

"పిన్ని ఊరికే అంటుంది. వినయ్ బాగా చదువు

తాడు తాతగారూ" అన్నాడు శరత్.

వినయ్ అమ్మవంక గర్వంగా చూశాడు.

ఆ నాలుగు రోజులూ యెంతో సరదాగా గడిచిపోయాయి.

ఓ రోజు కృష్ణ తన ఫ్యాక్టరీకి అందరినీ తీసుకెళ్ళి చూపించాడు. ఆ యంత్రాల గురించి శరత్‌కు క్షుణ్ణంగా చెప్పాడు. శరత్ ఎన్ని ప్రశ్నలు వేస్తున్నా విసుక్కోకుండా చెప్పాడు కృష్ణ.

ముసలాయన కృష్ణ దంపతులు శరత్‌ను యెంత ప్రేమగా చూసుకుంటున్నారో ప్రత్యక్షంగా చూసి సంతోషపడ్డాడు. రోజూ భోజనాల దగ్గర ఆయనగోడవ, ఎందుకమ్మా ఇన్ని రకాలంటూ. రాత్రిపూట ఆయన శరత్ దగ్గర పడుకునేవాడు.

ఈ నాలుగు రోజులూ ఎలాంటి చప్పుడూ వినపడదని శరత్ ఊహించాడు. అతని ఊహ సరైనదే అని తేలింది. రాత్రిపూట ముసలాయన ఎన్నో కథలు చెప్పేవాడు. ఆయన చెప్పే వాటిల్లో శరత్‌కు కొన్ని బాగా నచ్చాయి.

"బాబూ, మానవజాతికి కళ్ళు ఎంతో విలువైనవి. లేకపోతే ఈ ప్రపంచమంతా చీకటిగా ఉంటుంది. అయితే కళ్ళున్న వారంతా అదృష్టవంతులు కారు. వారంతా ఎన్నెన్ని బాధాకర దృశ్యాలు చూడాల్సి ఉంటుందో. మనిషికి కావలసింది జాలి, దయ, ఇతరుల గురించి ఆలోచించటం, ఆ లక్షణాలు నీకున్నాయి. నీకేం దిగులొద్దు. అమ్మలాంటి పిన్ని, నాన్నలాంటి బాబాయి తమ్ముడు వినయ్ వున్నారు. వారి కళ్ళతో నువ్వీ ప్రపంచం చూడొచ్చు."

ఆయన వెళుతుంటే శరత్‌కు దిగులువేసింది. పెద్ద

వాన్ని వుంటే ఎంత నిండుగా వుంటుందో రూప వాళ్ళ కుటుంబానికి కూడా తెలిసొచ్చింది. వెళ్ళేముందు రూప ఆయనతో మాట్లాడుతూ....

"బాబాయి. శరత్‌కు నిజంగానే ఈ ప్రపంచాన్ని చూపించాలనే నేను ఆరాటపడుతున్నాను."

ముసలాయన ఆశ్చర్యంగా చూశాడు.

"అవును బాబాయి. అక్క ఈ విషయంలో భయపడింది. శరత్ వయస్సుకూడా తక్కువేకదా. శరత్‌కు కళ్ళు పెట్టించాలని నా ఆశ."

"అంటే ఈ కళ్ళు తీసెయ్యాలిగా."

"అవును. తీసి వేరే కళ్ళు ఏర్పాటు చేస్తారనుకుంటాను. మొత్తం వివరాలన్నీ సేకరించాక ఎంత ఖర్చయినా ఆ పని చేయాలి. శరత్‌కు కళ్లు వస్తే ఎంత ఎత్తులకు ఎదుగుతాడో."

"పిల్లవాడు భయపడతాడేమో. పెద్ద ఆపరేషన్ కదా!"

"అవన్నీ ఆలోచించాను బాబాయి. శరత్‌కు ఎలాంటి భయాలు లేకపోతేనే. అంతగా అయితే మరో రెండు సంవత్సరాలు ఆగుదాం" అంది రూప.

"నిజమేలే. ఆ బిడ్డకు కళ్ళువస్తే ఆ మొహంలో ఎంత కళ వస్తుందో. మరి నేను వెళ్ళి వస్తాను."

"మళ్ళీ ఎప్పుడొస్తారు."

"ఇలానే వస్తుంటానులేమ్మా" అన్నారాయన.

## 8

నాలుగు రోజులుగా అలవాటయిన వ్యక్తి ప్రక్కన లేకపోవటంతో, ఏదో పోగొట్టుకున్నట్లు శూన్యంగా వుంది. శరత్ తన అనుభవాల్ని తాతకు చెప్పాలను

కున్నాడు గానీ వెంటనే తన నిర్ణయం మార్చుకున్నాడు. ఆయనకూడా ఈ విషయం తేలికగా కొట్టేయవచ్చు. ఇంకా ఆ విషయం గురించి గొడవ జరగటం తన కిష్టం లేదు. ఎలా అయినా ఈ రహస్యం తానే ఛేధించాలి.

ఆ రాత్రి ఎందుకో తిరిగి ఆ చప్పుడు వినిపించగలదని మనసు హెచ్చరిస్తోంది. తన గదికి తాళంవేసుకొని పడు కుంటే అనిపించింది. తాళం అడిగితే పిన్ని అనుమా నిస్తుంది, తాను పిరికివాడినని....ప్రతి విషయం గురించి ఎక్కువగా ఆలోచిస్తున్నా ననుకుంటుంది. అయినా తనకేం భయంలేదు.

నిద్రపడుతున్నట్లనిపించినా చీమ చిటుక్కుమంటుంటే మెలకువ వస్తోంది. గడియారం రెండు గంటలు కొట్టడం కూడా శరత్ కు తెలిసింది.

సరిగ్గా అప్పుడే మొదలయింది.

తొలి అడుగు పడింది మొదటి మెట్టుమీద.

"టక్....టక్....టక్."

అదో రకమైన చప్పుడు.

వినయ్ తన గదిలో ఆదమరిచి నిద్రపోతున్నాడు.

రూప వాళ్ళా ఎవరూ ఈ ప్రపంచంలోలేరు.

"టక్....టక్....టక్."

మెట్లెక్కటం పూర్తయింది.

ఈసారి అడుగుల చప్పుడు సరాసరి గదిముందు ఆగింది. కీ హోల్ నుండి గుచ్చి గుచ్చి చూస్తున్నట్లు అను భూతి. శరత్ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

పది నిమిషాలు ఎలాంటి అలికిడిలేదు. ఏమయింది. ఎందుకని ఎలాంటి శబ్దంలేదు. ఈ రోజు మేడమీదనుండే మాయం అయిందా? అదెలా సాధ్యం?

భయంకరమైన ఆ నిశ్శబ్దంలో మెల్లగా..అతి మెల్లగా తలుపులమీద చేతులుపడటం శరత్ చెవులు రిసీవ్ చేసు కున్నాయి.

తలుపు తెరుచుకుంటోంది!

అరుపు....అరిచేయ్.

శరత్‌లో ఘోష. కాని ఎందుకో నోరు పెగలటం లేదు.

అంధకారపు సుడిగుండంలో పడినట్లుంది.

తిరిగి చప్పుడు వెనక్కి వెళుతూ.

"టక్....టక్....టక్."

ఒకటి .... రెండు .... మూడు లెక్క పెడుతున్నాడు. సరిగ్గా పదో మెట్టు దగ్గర ఆగిపోయిందా చప్పుడు. ఎందుకని? ఏమయింది? ఎలాంటి శబ్దం రావటంలేదు. తిరిగి పైకి రానుందా? చెవులు రిక్కించి వున్నాడు.

తెల్లవారగట్ల అయిదు గంటలు కొట్టింది.

ఎలాంటి చప్పుడూ లేదు. శరత్‌కు అప్పుడు నిద్ర పట్టింది. అలా నిద్రపోవటం రూప వచ్చి లేపేదాకా నిద్రపోతూనే వున్నాడు.

"ఏమిటి శరత్, ఇంత మొద్దునిద్రపోయావు."

"ఏమిటో పిన్నీ బాగా నిద్రపట్టింది."

"సరే రా. స్నానం చేద్దువుగాని."

"నువ్వు వెళ్ళు పిన్ని. నేను వస్తాను."

"త్వరగా రా."

రూప మెట్లు దిగి వెళుతోంది. ఆకస్మాత్తుగా శరత్ చెవులు రిక్కించాడు. ఒక్కో మెట్టుమీద ఆమె అడుగు పడుతోంది. మొత్తం మెట్లన్నీ దిగటం పూర్తయింది.

శరత్ మొహం వాడిపోయింది. సిగ్గుతో ఓసారి తల

వంచుకున్నాడు. తల్లిలాంటి పిన్నిని అనుమానించానే అనుకున్నాడు. అతని హృదయం ఏదో తెలియని బాధకు గురయింది. మౌనంగా మెట్లు దిగి వచ్చాడు. స్నానం చేస్తున్నా, టిఫిన్ చేస్తున్నా ఒకటే ఆలోచన.

ఆ రోజు ఆదివారం కావటంతో అందరూ ఇంట్లోనే వుండిపోయారు. భోజనాలయ్యాక వినయ్ క్యారమ్స్ ఆడుదామంటూ కూర్చున్నాడు.

"నేనూ ఆడనా" అన్నాడు శరత్.

రూప, కృష్ణ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

శరత్ బోర్డంతా ఓసారి తడిమాడు. హోల్స్ ఎక్కడున్నాయో గుర్తు పెట్టుకున్నాడు. అతని మనసులో మొత్తం బోర్డంతా ముద్రించబడింది. డబుల్స్, ఓ జట్టు కృష్ణ....వినయ్. మరో జట్టు శరత్, రూప.

ఆట మొదలయింది. రూప కాయిన్ యెక్కడుందో చెబుతోంది. ఆ డైరక్షన్‌బట్టి శరత్ కొడుతున్నాడు. అరగంటదాకా ముగ్గురికీ ఓ అద్భుతమైన దృశ్యం అది.

"కొంచెం పౌడర్ వెయ్యి" అన్నాడు శరత్.

అప్పుడు మెరిసిందో ఆలోచన, తళుక్కున అతని మదిలో!

రూపవాళ్ళే గెలిచారు.

"కంగ్రాట్యులేషన్స్ శరత్. నిజంగా నీలో సూపర్ పవర్సున్నాయి" అభినందనపూర్వకంగా అన్నాడు.

"వినయ్ నువ్వు అన్నయ్యనుండి నేర్చుకోవాల్సింది చాలా వుంది" అంది రూప.

"మీరు నన్ను ఊరికే పొగిడేస్తున్నారు" అన్నాడు శరత్.

రూప శరత్‌ను ప్రేమగానూ, అభినందనపూర్వకం

గానూ చూసింది.

"కొంచెంసేపు పడుకుందాం" అన్నాడు కృష్ణ.

"అవును పిన్నీ నాకూ నిద్రవస్తోంది" అన్నాడు శరత్.

కృష్ణ లేచి తన గదిలోకి వెళుతుంటే తనకు తెలియకుండానే ఆ శబ్దాన్ని నిశితంగా గమనించాడు శరత్. వెంటనే అతని పెదవులమీద చిరునవ్వు వెలిసింది. 'సిల్లీ' అనుకున్నాడు.

## 9

రాత్రి భోజనాలు పూర్తయ్యాయి.

శరత్ కెందుకో ఈ రోజుతో వ్యవహారం తేలిపో గలదనిపిస్తుంది. అతని హృదయం ఎలాంటి టెంక్షన్ లేకుండా వుండి ఇప్పుడు ఎలాంటి ప్రమాదమ్నయినా ఆహ్వానించే ధీశాలిలా వున్నాడు. అందరూ ఎవరి గదుల్లోకి వారు వెళ్ళారు.

ఆ భవనం అంతా ప్రశాంతంగా వుంది.

అంతా నిద్రపోయి వుంటారన్న నమ్మకం కలిగాక మంచం మీదినుండి లేచాడు శరత్. తలుపులు తీసుకుని మెల్లగా ముందుకు కదిలాడు. లైట్లన్నీ తీసి వున్నాయి. గాఢాంధకారంగా వుంది. ఆ ప్రదేశాలన్నీ అతనికి సుపరిచితాలే....

ముందుకు నడిచాడు. అతని అడుగుల చప్పుడే మెల్లగా వినిపిస్తూంది. ఒక్కో మెట్టు లెక్కేస్తూ దిగాడు. చివరి మెట్టు దిగాక, తిరిగి మొదటి మెట్టు ఎక్కి ఆ చివరి నుండి ఈ చివరిదాకా వంగుని పరిశీలించాడు. అలా మొత్తం మెట్లన్నీ పూర్తిచేశాడు. వరండా అంతా

అలానే పరిశీలించాడు. తలుపు దగ్గరకు వచ్చి గట్టిగా మూశాడు. తన మంచందాకా వంగుని పరిశీలిస్తుండి పోయాడు. బెడ్ లైట్ సైతం తీసివేశాడు. మంచంమీద పడుకున్నాడు. తన చేతికందేలా టేప్ రికార్డర్ వుంచాడు. అంతా సరిగ్గా వుందనుకున్నాక కళ్ళు మూసుకున్నాడు.

అప్పటికి పన్నెండు గంటలు కొట్టడం మొదలయింది. శరత్ పెదవులమీద చిరునవ్వు మెరిసింది ఆ చీకట్లో.

రెండు గంటలు గడిచిపోయాయి.

ఇంకా కొట్టలేదేమిటా అనుకున్నాడు శరత్.

సరిగ్గా అప్పుడే టంగున మ్రోగినది.

ఉలిక్కిపడ్డాడెందుకో. అంతలోనే మొదలయిందా చప్పుడు. తనకు సుపరిచితమైన బాణీలో....కానీ ఎందుకో ఈసారి ఆ అడుగులు కొంచెం బలంగా పడుతున్నట్లనిపించింది.

"టక్....టక్....టక్."

ఏ బూట్లు వాడితే అలాంటి శబ్దం వస్తుంది. మొత్తం మెట్లెక్కి వచ్చేసి .... కొంచెంసేపు నిశ్శబ్దం .... ఇంక ఇంతేనా? తిరిగి వెనక్కి వెళ్ళటమేనా? ఏమిటీ డ్రామా? ఎందుకు?

తిరిగి చప్పుడు మొదలయింది.

తలుపుల దగ్గరకొచ్చింది.

శరత్ లో టెంక్షన్.

మెల్లగా తలుపులు తెరుచుకుంటున్న సవ్వడి!

శరత్ గుండెల వేగం హెచ్చింది.

అతిప్రయత్నంమీద చేతిని టేప్ మీదకు పోనిచ్చాడు.

చాలా నెమ్మదిగా ప్రెస్ చేశాడు. టేప్ తిరగటం మొదలయింది.

తలుపులు మెల్లగా తెరుచుకున్నాయి. గాలి లోనికి ప్రవేశించి శరీరాన్ని తాకుతోంది.

గదికి అడ్డంగా ఎవరో నిలబడినట్లు.
వెర్రికేక వెయ్యాలనే కోర్కె.
ఎందుకో సాధ్యం కావటంలేదు?
గుమ్మంనుండి అడుగుల చప్పుడు.
మంచం దగ్గరకు వస్తూంది.
"టక్ ....టక్ ....టక్."
వచ్చి....వచ్చి....తనమీదకు వంగి.
కవ్వున అరవాలని.
తెరిచిన నోరును....
అలాగే అదిమేస్తూ.
గ్లవుస్ తొడుక్కున్న రాక్షస హస్తం!
దిండుతీసి మొహంమీద పెట్టి అదిమేస్తూంటే.
తిరగబడాలనే వెర్రి ప్రయత్నంలో.
అమ్మ....డాడీ అని ఏడుస్తూ.
తన చేతి గోళ్ళతో కసిగా ఆ హస్తాన్ని రక్కేస్తే.
అప్పుడు వినపడిందో శబ్దం....
ఆ చేతి గడియారపు గుండెల లయ.
దిగ్భ్రాంతితో గుండెలు ఆగిపోయాయి.
ఆ క్షణంలో శరత్ మదిలో.

సముద్రపు అలలు పెటిల్లున ఆకాశాన కెగిశాయి.
ఆశ్చర్యంతో...అసహ్యంతో...
శరీరం చల్లబడింది. కదలటం మానేసింది.

## 10

"యూ ఆర్ అండర్ అరెస్ట్" అన్నాడు యస్. ఐ.

"వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్."

"శరత్ ను నిర్దాక్షిణ్యంగా హత్య చేసినందుకు."

"ఏమిటి ఆధారం."

"నీ భార్య రూప సాక్ష్యం."

కుప్పలా కూలిపోయాడు కృష్ణ.

కోర్టులో రూప ప్రకటనతో అనేక విషయాలు వెలుగులోకి వచ్చాయి.

శరత్ తల్లితండ్రులు...అంటే నా అక్కా- బావలు. అమెరికాలో కొన్ని లక్షలు సంపాదించి ఇక్కడ స్థిర పడదామని వచ్చారు. వారికి పుట్టు గుడ్డియైన శరత్ ఒక్కడే సంతానం. వాడిని చూస్తుంటే వారి గుండెలు తరుక్కుపోయేవి. నిజంగా శరత్ ఎంతో తెలివిగల వాడు. అంత చిన్న వయస్సులో వాడి మేధస్సువు నేను అబ్బురపడుతుండేదాన్ని.

అక్క వాళ్ళు ఇక్కడే ఓ ఫ్యాక్టరీ పెడదామను కున్నారు. బావ తన ఫ్యాక్టరీలో షేర్ ఇస్తానని, నా భర్తను ఉద్యోగం మానేసి రమ్మని సలహా ఇచ్చాడు. ఫ్యాక్టరీ లైసెన్స్ తీసుకున్నారు. మరో నెలరోజుల్లో భవనాలు కట్టడం ప్రారంభం కావాల్సి వుంది. అయితే ఓ రోజు అక్కా, బావ కలిసి వస్తున్న ఓ కారును ఓ లారీ గుద్ది వెళ్ళిపోయింది.

అది ప్రమాదవశాత్తు జరిగిందని ఇన్నాళ్ళు భావించాను. అయితే అది ఖచ్చితంగా ప్లాన్డ్ మర్డర్ అని, అది చేయించింది నా భర్త కృష్ణ అని ఇప్పుడు ఎలాంటి అనుమానం లేకుండా విశ్వసిస్తున్నాను.

తల్లి తండ్రికి దూరమయిన శరత్‌కు నేను తప్ప దగ్గర వారెవరూ లేరు. అందుకే నా దగ్గరకు వచ్చాడు. అదే అతన్ని మృత్యువు కోరలకు బలివ్వగలదని నేనుగానీ, శరత్ గానీ ఊహించలేదు. శరత్‌లో కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. ఓసారి నా గడియారం ఆగిపోతే చెప్పాడు.

అంత నిశితమైన ప్రజ్ఞ గల శరత్‌లో 'సూపర్ పవర్స్' ఉన్నాయనే అభిప్రాయ ప్రకటనతో మేమంతా కూర్చున్నప్పుడు దయ్యాల ప్రసక్తి తెచ్చాడు కృష్ణ. అదంతా ప్రీ ప్లాన్‌డ్ ప్రోగ్రాం అని నేను ఊహించ లేదు. ఆ మరుసటి రోజు శరత్‌కు అడుగుల చప్పుడు వినిపించింది. శరత్ ఎలాంటి శబ్దాన్నయినా రిసీవ్ చేసు కోగలడని కృష్ణకు తెలుసు. అందుకే ప్రత్యేకంగా కొన్ని బూట్లద్వారా ఆ శబ్దాల్ని సృష్టించాడు. కృష్ణ పథకం ప్రకారం దెయ్యం ప్రభావం కలిగించి ఇలాంటి చేష్టలద్వారా గుండె ఆగేటట్లు చేయాలని, ఆ రకంగా ఇబ్బందిలేకుండా పని ముగించుకోవాలని. ఆ విషయం ఆయన డైరీ చదివాకే నాకు అర్థం అయింది.

శరత్‌కు తనమీద తనకు నమ్మకం వుంది. ఇదెవరో కావాలని చేస్తున్నారని నిర్ణయించుకున్నాడు. తనకు కలుగుతున్న అనుభవాల నన్నింటిని టేప్ చేశాడు. శరత్ హత్యచేయబడ్డ రోజు మేం క్యారమ్స్ ఆడాం. ఆ రోజు కూడా సూపర్ పవర్స్ గురించి కృష్ణ తడిమాడు. ఆ రోజు రాత్రే ఈ హత్య జరిగింది.

శరత్ ఇలాంటి ప్రమాదం ఎదురవుతుందని కలలో కూడా ఊహించలేదు. ఆ వ్యక్తి తనకే ప్రమాదం కలి గించడని భావించాడు. ఆ పాదాలెవరివో తెలుసుకుం

టానికి మెట్లనుండి పౌడర్ చల్లుకుంటూ వెళ్ళాడు. తన గది తలుపులు తెరుచుకుంటున్న క్షణం టేప్ ఆన్ చేశాడు. ఆ సంగతి కృష్ణకు తెలియదు. ఆ టేప్‌లో బలవంతంగా శరత్ నోటిని అదుముతూ కృష్ణ చేసిన శబ్దాలు...శరత్ మూలుగులు రికార్డయ్యాయి. అలాగే శరత్ గోళ్ళలో కృష్ణ తాలూకు చర్మం ఇరుక్కుపోయింది. అలా సాక్ష్యాలు కావాలనే రక్షించాడు. తాను చచ్చిపోయేటప్పుడు తనను చంపుతుంది కృష్ణ అని శరత్ గ్రహించి వుంటాడు. ఆ అంధకారపు కళ్ళలో కనిపించిన ఆశ్చర్యమే అందుకు కారణం.

ఉదయం లేచి పైకి వెళ్ళిన నాకు శరత్ పడుకున్న తీరు అనుమానంగా కనిపించింది. రికార్డు చేయటానికి ఆన్ చేసి వుంచిన టేప్‌ను వెనక్కు వైండ్ చేస్తే మూలుగులు వినిపించాయి.

ఎవరికి ఆ అవకాశం వుంది. ఇంట్లో తలుపులన్నీ మూసి వున్నప్పుడు నాకూ కృష్ణకూ...వినయ్‌కు మాత్రమే ఆ అవకాశం వుండాలి. వినయ్ వయసు దృష్ట్యా ఈ పనులన్నీ వాడివల్ల కావు. ఇంక మిగిలింది ఆయనా.... నేను. మాకు రెండువేల పైబడి జీతం వస్తుంది. మేం సంతృప్తికరంగా జీవితం గడుపుతున్నాం. అనుమానంతో కృష్ణ డైరీ తీసి చదివాను. కృష్ణలో ఇంత దాహం వుందని నాకు తెలియదు.

కృష్ణ నా భర్త కావచ్చు. అంతమాత్రాన అతన్ని క్షమించి వదిలిపెట్టకూడదు. ధన కాంక్షతో అతని కళ్ళు మూసుకుపోయాయి. రేపు కన్నబిడ్డనూ, నన్నూ హత్య చేసినా ఆశ్చర్యంలేదు.

నా బాధంతా శరత్ గురించే. అతనికి కళ్ళు తెప్పించి ఈ విశాల ప్రపంచం చూపించాలని ఎంతగానో ఆరాట పడ్డాను. అతనిలోని శక్తులు ఎంతగానో ఎదగగలవని ఆశించాను. ఆ అంధకారంనుండి వెలుగులోకి తీసుకు రావాలని, అతను ప్రపంచానికి వెలుగునిస్తాడని భావించాను. కానీ డబ్బు దాహం శరత్‌లోని సృజనాత్మకతను బలితీసుకుంది.

ఐ హేట్ కృష్ణ ...ఇలాంటి నరరూప రాక్షసులు సభ్య ప్రపంచంలో వుండకూడదు. ఇలాంటి వ్యక్తులు కఠినంగా శిక్షింపబడాలి. వాడు భర్తయినా....తండ్రయినా....అన్నయినా ఇలాంటి వ్యక్తుల్ని ఏ స్త్రీ ఏ బిడ్డ క్షమించకూడదు....క్షమించరు."

కృష్ణ నేరాన్ని బుజువుచేసే తిరుగులేని ఆధారాల మూలంగా అతనికి ఉరిశిక్ష విధించారు.

ఉరికంబంవైపుకు కృష్ణ నడిచి వెళుతుంటే—అతని వెంట నడిచివస్తున్నవారి అడుగుల చప్పుడు.

"టక్ ....టక్ ....టక్."

తన గుండెలమీద పడుతున్నట్లుంది.

అప్పుడే సన్నగా వెలుగు రేఖలు పడుతున్నాయి.

ఉరికంబంముందు నిలబెట్టి.... మొహంమీద నల్లటి గుడ్డ కప్పారు. అంతా అంధకారంగా వుంది. త్రాడు మెడకు తగిలించారు.

"టక్ ....టక్...టక్" తిరగి వెనక్కు నడిచి వెళుతున్న చప్పుడు.

వళ్ళంతా చెమటలు.

మనసులో సుడిగుండాలు.

## 40

చేతులు వెనక్కి కట్టేశారు.

'నాకు బతకాలని వుంది' అంటూ వెర్రికేక వెయ్యాలని నోరు తెరిచాడు.

సరిగ్గా ఆక్షణమే కృష్ణ శరీరం గాల్లోకి లేచింది.

శరత్ కూడా అలానే అరిచివుంటాడు చివరిక్షణంలో.

(ఒక ఆంగ్ల కథ ప్రేరణతో)

—: సమాప్తం :—

# తిరస్కారం!

బి. రాజేశ్వరి

వాణీనాథం తదేకంగా చూశాడామె వంక. ఆమె ముఖంలో దృఢ నిశ్చయం కదలాడుతోంది.

"మరొక్క-సారి ఆలోచించుకో నర్మదా!" అన్నాడతను వేడికోలుగా.

"నా నిర్ణయంలో యిక మార్పనేది రాదు!" అన్నది నర్మద.

"చెప్పేడు మాటలు విని నన్ననుమానించటం న్యాయం కాదు."

"నేను చెప్పుడు మాటలు వినను."

"విననుండా వుంటే, నన్ను వదులుకోవటానికి సిద్ధపడవు!"

"నేను మోసాన్ని భరించలేను. నువ్వు మోసగాడివి."

"ప్లీజ్, నేను చెప్పేది పూర్తిగా విను."

"వినాల్సిన అవసరం నాకు లేదు."

"నీ మూడ్ బావోలేదు. మనం మరోసారి కలుద్దాం."

"ఇక నన్ను కలవాలని వ్యర్థప్రయత్నం చెయ్యకు."

"ఇదే నీ చివరి నిర్ణయమా?"

"అవును."

"మరోసారి బాగా ఆలోచించుకో. నేను నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడొస్తాను."

"ఆ అవసరం రాదనుకుంటాను."

"ఇంత నిర్దయురాలవనుకోలేదు."

నర్మద మాట్లాడలేదు. మౌనంగా లేచినిల్చుంది.

"వెళ్ళిపోతున్నావా?" జాలిగా అడిగాడు.

"శాశ్వతంగా!" ఆమె వెళ్ళిపోయింది.

వాణీనాథం ఆమె వెళ్ళినవంకే చూస్తూ చాలా సేపు అలాగే కూచుండిపోయాడు.

"హల్లో, బాగా డిసప్పాయింటయినట్టున్నావే!" అన్న అపరిచిత గొంతు విని ఉలిక్కిపడి చూశాడు వాణీనాథం.

అతనికెదురుగా పచ్చికలో కూలబడుతూ, ఆ మాటలు పలికిన వ్యక్తివంక పరీక్షగా చూశాడు. అతన్నిదివరలో ఎక్కడా చూసిన గుర్తులేదు.

విస్మయంగా చూశాడతనివంక. అతను స్నేహపూర్వకంగా నవ్వుతున్నాడు.

"మీరు...మీరెవరో..."

"నీకు తెలియదు. కాని, నాకు నువ్వు తెలుసు. ఆమె నిన్ను తిరస్కరించిన విషయం కూడా తెలుసు...ఇంకా ఏమయినా వివరాలు కావాలా...?"

వాణీనాథం నిర్ఘాంతపోయినట్టు చూశాడు.

"ఇంతకీ...మీరెవరు?"

"అదంతా నీకవసరం లేదనుకుంటాను. నీవు నర్మదను మనసారా ప్రేమించావు. ఆమెను నీదాన్ని చేసుకోవా లనుకున్నావు. కాని ఎందుకో పరిస్థితులు ఎదురుతిరిగాయి. ఆమె నిన్ను కాదని వెళ్ళిపోయింది."

వాణీనాథం అతనివంక సంభ్రమంగా చూశాడు.

"ఆమెకు నీవంటే వల్లమాలిన ప్రేమ. కాని, ఎవరో రగిలించిన జ్వాల మీ యిద్దరిమధ్య మనస్పర్థలకు కారణ మయ్యింది...అవునా?"

మౌనంగా తలూపాడు వాణీనాథం.

"సో మీ యిద్దర్ని మళ్ళీ ఒకటిగా చేయగల టెక్నిక్ నాకు తెలుసు."

"ఏమిటది, చెప్పండి" క్యూరియాసిటీ తొంగిచూసింది వాణీనాథం గొంతులో.

"ప్రతిఫలం ఆశించటంలో తప్పులేదుగా!"

"ప్రతిఫలమా? ఏం కావాలి?"

"నేనడిగింది స్తావా?"

"నాకు సాధ్యమయితే...నాచేతనయితే!"

"చేతనయిందే, చెయ్యగలిగిందే!"

"ఏమిటది?"

"చెపుతాను. రేపు యిదే సమయానికే యిక్కడే కలుసుకో, అతడు లేచి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

విచిత్రంగా చూస్తూ వుండిపోయాడు వాణీనాథం. అతని ప్రవర్తన వింతగా వుంది. అతనెవరో తనకి తెలి యదు. తనకి నర్మదతో వున్న సాన్నిహిత్యం గురించి అతనికెలా తెలుసో అర్థంకాదు.

నర్మద...నర్మద గురించి తల్చుకుంటేనే అతని అణు

తనువూ అనిర్వచనీయమైన మధురానుభూతితో నిండిపో తోంది. తన ప్రాణానికి ప్రాణంగా, తనే ఆమెగా ఆమె తనుగా మసలిన తమమధ్య అనుకోకుండా అఘాతం ఏర్పడింది. చాలా చిన్న విషయం పెద్ద సమస్యని సృష్టించింది.

నాలుగు రోజుల క్రితం తన చిన్ననాటి స్నేహితురాలు వసంత బజార్లో కనిపించింది. తనేవో కాస్మెటిక్స్ కొనుక్కుని బయటకి వస్తుంటే, ఆమె లోనికి ప్రవేశిస్తూ తనని చూసి, ఒక్కసారిగా సంభ్రంగా అరిచింది. “నువ్వు....మీరు....వాణీనాథ మేనా?” అని.

తను ఆమెను పరిశీలించి చూశాడు. కాలం మగవాడిలోకన్న ఆడదానిలో చాలా మార్పు తీసుకొస్తుందనటానికి సాక్ష్యంగా వసంతని చెప్పుకోవచ్చుననిపించింది తనకి. పెళ్ళయినట్టుంది. బాగా ఒళ్ళు చేసింది. పెద్ద పెద్ద కళ్ళు చూపును కట్టిపడేసే ఆపిల్ పండులాంటి గుండ్రటి మొహంలో చంచలంగా కదిలే గండు మీనాల్లా వున్నాయి. శరీరంలో ఎక్కడ వుండాల్సిన ఎత్తుపల్లాలు అక్కడ వున్నాయి. హుందాగా, నాజూగ్గా చాలా అందంగా వుంది వసంత.

“ఏమిటలా చూస్తున్నావు? నన్ను గుర్తుపట్టలేదా?” అన్నది సమ్మోహనంగా నవ్వుతూ.

“గుర్తొచ్చావు. వసంత కదూ!”

“మర్చిపోలేదన్న మాట!”

“బాగా మారిపోయావు.”

“పదేళ్ళయింది. మారకుండా ఎలా వుంటాం?”

తామిద్దరూ ఎస్.ఎస్.ఎల్.సీ. వరకు కలిసి చదువుకున్నారు. ఆ రోజుల్లోనే స్కూల్లో బ్యూటీ క్వీన్‌గా

వసంతకు మంచి పేరుంది.

తను యిబ్బందిగా ఫీలవుతున్నాడు. డిపార్టుమెంటల్ స్టోర్సులోకి వచ్చేపోయే జనం తామిద్దర్నీ పట్టి పట్టి చూడటం తనకి చాలా యిబ్బందిగా, సిగ్గుగా అనిపించింది.

"పెళ్ళయిందా?"

"అయినట్టు లేదా?"

"అహ. పూరకే అడిగాను. పిల్లలా?"

"లేదు. నీకు పెళ్ళయిందా?"

"ఇంకా లేదు."

"ఇంకా కా లేదా? బ్రహ్మచారి ముదిరినా...."

"ఫరవాలేదు. ఈ సామెత చాలా పాతది."

"వి వ రం గా మాట్లాడుకుందాం, మా యింటికి రాకూడదూ?"

"అలాగే! వస్తాను" అన్నాడు.

వసంత అడ్రసు చెప్పి, "నీకెప్పుడు వీలవుతుంది?" అడిగింది.

"ఆదివారం."

"తప్పక వస్తావు కదూ!"

"ష్యూర్!"

## 2

"ఈ ఆదివారం పిక్చర్‌కి వెళ్దామన్నావు కదా! ఏ పిక్చర్ కెళ్దాం?" అన్నది, ఆదివారం ఉదయం సరాసరి వాణీనాథం యింటికొచ్చి—నర్మద.

అప్పుడే ప్యాంటు వేసుకొని, షర్టు తగిలించుకో బోతున్న వాణీనాథం ఉలిక్కిపడి వెనుతిరిగి చూశాడు. నర్మద తన గదికి రావటం కొత్తకాదు గాని, ఆ సమ

యంలో—అందునా వసంత యింటికి వెళ్ళటానికి సిద్ధ
మయిన సమయంలో—రావటం చాలా యిబ్బందిగా అని
పించింది.

గాడ్రెజ్ కుర్చీ వాల్చుకొని కూచుని, "ఏమిటి దొర
గారెక్కడికో బయల్దేరినట్టుందే!" అన్నది వసంత ఆశ్చ
ర్యంగా.

"అహా .... మరేంలేదు. అలా హోటల్ కి పోయి
టిఫిన్ చేసొద్దామని...." అబద్ధమాడేశాడు.

"అదేంవిటి? ఆదివారమే కదా అని ఆలస్యంగా
లేచావేమిటి? ఇంకా కాఫీ తాగలేదా? ఆరయ్యేసరికి
కాఫీ గొంతులో పడకపోతే అవయవాలు స్ట్రయిక్
చేస్తాయి నాకు!"

వాణీనాథం డైలమాలో పడ్డాడు. అవతల చిన్న
నాటి స్నేహితురాలు వసంతకు వస్తానని మాటిచ్చాడు.
వెళ్ళకపోతే బావుండదు.

అంతేకాదు, వసంత ఒకప్పుడు వాణీనాథంపట్ల
చాలా ప్రేమగా, అభిమానంగా వుండేది. అయితే ఆ
చిన్న వయసులో దాన్ని ప్రేమని అనుకోవటానికిగాని,
చొరవగా ధైర్యంగా ముందుకి అడుగెయ్యటానికి గాని
అతనికి గుండె ధైర్యం చాల్లేదు. అయినా అప్పట్లో తన
చదువేమిటో, తనేమిటో అన్నట్టుగా వుండేవాడే తప్ప,
అల్లరి చిల్లరి పనుల జోలికి అసలే పోయేవాడు కాదు!

అలాంటి వసంత యిన్నాళ్ళకు కనపడి ఆత్మీయంగా,
అభిమానంగా యింటికి ఆహ్వానిస్తే వెళ్ళకపోవటమా?
అందుకే సిద్ధమయ్యాడు.

కాని....కాని....తన మనసులో అణువణువునా
నర్మద రూపమే నిలిచివుంది. ఆమెకు తప్ప మరొకరికి

సానంలేదు. ఆమెని తనకు పరిచయమైన యీ ఏడాది లోను ఒక్కరోజైనా తామిద్దరు ఎడబాసి వున్నదిలేదు. ప్రతిరోజు ఒకరినొకరు కల్సుకుని మాట్లాడకపోతే వుండ లేదు. వసంత చిన్ననాటి స్నేహితురాలనే అభిమానంతో చూడాలని వెళ్ళటానికి సిద్ధపడ్డాదేగాని, ఆమెపట్ల ప్రత్యేక శ్రద్ధ ఏమీలేదు.

ఇప్పుడేం చెయ్యాలి తను?

"ఏమిటి, అలా గుడ్లప్పగించి చూస్తూండిపోయావేం? హోటల్ కి పోయొద్దాం, పద!" అన్నది దిక్కుతోచక నిల్చుండిపోయిన వాణీనాథంతో.

"పోనీ, నువ్వు రూంలో వుండకూడదూ? నేను వెళ్ళి పదినిమిషాల్లో వచ్చేస్తాను. నువ్వు నాకోసం శ్రమపడి రావటం....'

"మరేం ఫరవాలేదు. నా బిల్లు నీనే యిచ్చుకుం టాను భయపడకు!"

"అబ్బెబ్బె. బిల్లు గురించి కాదు. నీకు శ్రమ ఇవ్వటం యిష్టంలేక...."

"శ్రమేంలేదు, పద! నడుస్తూ మాట్లాడుకుందాం. నేను అట్నుంచి యింటికి వెళ్ళిపోతాను!"

"సరే, పద!" తాళం వెతుక్కుని బయటకొచ్చి నిల బడ్డాడు. నర్మద తనూ అతని వెనకనే గది బయట కొచ్చాక తలుపుకు తాళంపెట్టి హోటల్ వైపు నడక సాగించారు.

ఫేమిలీ రూంలో కాఫీలయ్యాక నర్మద మళ్ళీ గుర్తు చేసింది సినిమా ప్రోగ్రాం గురించి.

"ఇప్పుడు పదిగంటలేకదా అయింది. మ్యాట్నీ సినిమాకి యిప్పట్నుంచీ ఏం తొందర?" అన్నాడు.

"సినిమా దేనికో తెలుసే నేను మా యింటినుంచి సరాసరి థియేటర్ కొచ్చేస్తాను. ఆ మాట చెప్పటం కోసమే పనిగట్టుకొచ్చాను!"

"శ్రీవారికి ప్రేమలేఖ చూద్దామన్నావు కదా, సరాసరి థియేటర్ కొచ్చేస్తావా అయితే?"

"ఆల్ రైట్! నే వెళ్తాను!"

"అలాగే, అలాగే!" అన్నాడు వెంటనే.

ఆమె అదోలా చూసి వెళ్ళిపోయింది.

వాచ్ చూసుకున్నాడు. పదీ పదిహేను. తొమ్మిది గంటలకొస్తానని వసంతకు మాటిచ్చాడు. చకచక ఆమె డోర్ నంబరు వెతుక్కోటానికి బయల్దేరాడు. ఆమె కూడా సంజీవరెడ్డి నగర్లోనే వుంటున్నది. తనున్నది సంజీవరెడ్డి నగరే! కాని యిన్నాళ్ళుగా ఆమె తనకెదురు పడలేదు!

ఇల్లు త్వరగానే దొరికింది. 2 ఆర్.టి. యిల్లు పైన మళ్ళీ గదులు వేసినట్టున్నారు. హౌసింగ్ బోర్డువాళ్ళు కట్టిన యిల్లంటే నమ్మశక్యం కానట్టుగా చక్కగా కట్టుకున్నారు. స్వంత యిల్లు హైదరాబాదులో సంపాదించుకోవటం ఓ వరం. అయితే వసంత భర్త చాన్నాళ్ళుగా యిక్కడే ఉద్యోగం చేస్తూ మంచి పొజిషన్లో వుండివుండాలి—అనుకున్నాడు వాణీనాథం.

గుమ్మంలోనే ఎదురైంది వసంత.

"నీకోసమే చూస్తున్నాను. ఇంకా రాకపోతే, ఎగ్గొట్టేశావనుకున్నాను."

"లేదు, లేదు. చెప్పాక రాకుండా ఎలా వుంటాను?"

అతడిని కూర్చోబెట్టి కాఫీ తెచ్చి యిచ్చింది.

"మీవారు కనిపించరేం?"

"ఆయనకి ఆదివారంకూడా ఆఫీసు పనే. ఆఫీసు ఆయన మొదటి భార్య!"

"ఓహ్, చాలా సిన్సియరన్నమాట!"

"నా బొంద. సరే, అడిగావుకదా, ఫోటో ఆల్బం తెస్తాం, కూచో!" మేడవైపు అడుగులు వేస్తుంటే వారించి అన్నాడు.

"మరోసారి చూస్తాను. మీవారుండగా వస్తాను. ఇప్పుడు వెళ్ళాలి!"

"అదేం కుదరదు. ఈ రోజు భోజనం యిక్కడే!"

"చంపావు పో, అలాంటివేమీ పెట్టుకోవద్దు. నే నిప్పుడే వెళ్ళిపోతానంతే!"

"కూచో, కోచో. నీకు కాలక్షేపం కావటానికి మా పెళ్ళి ఫోటో ఆల్బం తెస్తాను చూస్తూండు!" మెట్లెక్క బోతూ తూలిపోబోయింది.

ప్రమాదం పసిగట్టిన వాణీనాధం చటుక్కున సోఫా మీదినుంచి లేచి, ఆమెను పట్టుకున్నాడు. ఆమె ఒక్క క్షణం అతను పట్టుకోవటం ఆలస్యమయితే అమాంతం మెట్లమీదపడి దొర్లి పోయుండేది.

ఆమె కొద్ది క్షణాలు అతని చేతుల్లో అలాగే ఉండి పోయింది.

ఆ దృశ్యాన్ని రెండు జతల కళ్ళు అసూయతోను, కోపంతోను, చూసిన విషయం వాళ్ళిద్దరిలో ఎవరికీ తెలియదు.

"చాలా థాంక్స్!" అన్నది వసంత అతని బంధనా ల్లోంచి విడిపించుకుంటూ.

వాణీనాధం ఏదో తప్పుచేసినవాడిలా ఆమెను వదిలి

పెట్టి, "మళ్ళీ కలుద్దాం" అనేసి, ఆమె పిలుస్తున్నా వినకుండా బయటికి వెళ్ళిపోయాడు.

మేట్నీ సమయానికి థియేటర్ దగ్గర పడిగాపులు కాసినా నర్మద రాలేదు. వాణీనాథం దాదాపు మూడు స్నరవరకు చూసి, యిక ఆమె రాదని నిర్ణయించుకుని రూంకొచ్చేశాడు. ఆమె ఎందుకు రాలేదో కారణం ఎంత ఆలోచించినా అతని కరం కాలేదు.

సాయంత్రం తామిద్దరు మామూలుగా కల్సుకునే పబ్లిక్ గార్డెన్స్‌లోని సంకేత స్థలంలో నర్మద కూచుని వుంది. చాలా కోపంగా, తోకతొక్కిన తాచులా దెబ్బ తిన్న ఆడపులిలా వుంది.

"మేట్నీకి రాలేదేం?" అనడిగాడు.

"ఇక నన్ను కల్సుకోవాలని ప్రయత్నించకు" అన్నది ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా.

తను నిర్ఘాంతపోయాడు.

"అదేమిటి నర్మదా, అంత పాపం ఏం చేశాను నేను?" అంటూ వాపోయాడు.

"వివరాలు అనవసరం!"

తనెంత బతిమాలినా ఆమె కోప కారణం తెలియ లేదు. ఆమె చెప్పలేదు. తన వూహ కందలేదు. ఎవరైనా తన గురించి ఆమెకు చెడ్డగా చెప్పి మనసు విరిచేశారా అనిపించింది. ఎవరో తమ ప్రేమను చూసి ఓర్వలేక తమ మధ్య శత్రుత్వాన్ని రగిలించారనుకున్నాడు. ఎవరు వాళ్ళు? తన కలాంటి శత్రువులు ఎవరున్నారు?

ఇలా బుర్రలు బద్దలు కొట్టుకుంటుండగానే ఆమె అతని అభ్యర్థనను తిరస్కరించి వెళ్ళిపోయింది. ఆ ఆ తర్వాత అకస్మాత్తుగా ఆ మనిషి అక్కడ ప్రత్యక్ష

మయ్యాడు. అతనికి తమ యిద్దరి అనుబంధం గురించి బాగానే తెలిసినట్లు అతని మాటల్ని బట్టి అర్థమయ్యింది. తనని మోసగాడని దూషించి వెళ్ళిపోయింది. అతను— ఆమెకు తనకు మధ్య యెవరో జ్వాలలు రగిలించారని, తమ మధ్య సయోధ్య నెలకొల్పుతాననీ అందుకు ప్రతిఫలం కావాలనీ అడిగాడు.

అయోమయావస్థలో తను అందు కంగీకరించాడు. తన క్కావలసింది నర్మద సాన్నిహిత్యం. ఆమె ప్రేమ! కలలో కూడా ఆమె ఎడబాటును సహించలేడు.

ఇంతకీ అతనేం కోరబోతున్నాడు?

అసలు అతనెవరు?

ఇవే ప్రశ్నలు జోరీగల్లా అతన్ని చుట్టుముట్టి వూపిరాడకుండా చేస్తున్నాయి.

## 3

"గుడ్, అన్నట్టుగానే వచ్చావన్నమాట!" అతను నవ్వుతూ వాణీనాథాన్ని సమీపించి, అతని కెదురుగా పచ్చికలో చతికిలబడ్డాడు.

వాణీనాథం అతనివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీ యిద్దర్ని కలపటానికి నాకో చిన్న సాయం చేయాలని కండిషన్ పెట్టానుకదూ! అది తెల్సికోవాలని నీకు చాలా ఏంగ్జయిటీగా వుంది కదూ....?"

"అవును!"

"నర్మద తండ్రి పెద్ద బిజినెస్ మాగ్నెట్. అవునా?"

"అవును. ఆయన కీ వూళ్ళో నాలుగు స్పిన్నింగ్ మిల్లులున్నాయి. మాలావీలో ఓ సైకిల్ స్పేర్స్ తయారు చేసే ఫ్యాక్టరీ వుంది!"

"ఆయనకు నర్మద తప్ప వారసులు....అయ్‌మీన్, సంతానం లేదు. అవునా?"

"అయితే...."

"కోటీశ్వరుడి ఏకైక పుత్రికారత్నమైన నర్మదకే ఆ సంతా దక్కుతుంది."

"అయితే....?"

"ఆమెను పెళ్ళి చేసుకోవటం ద్వారా నువ్వు కోటీశ్వరుడి అల్లుడివి, తద్వారా కోట్లకి అధిపతివి కాబోతావు."

"డబ్బుమీద ఆశతో కాదు నేను నర్మదను ప్రేమించింది!?"

"అంత కోపం దేనికి? మీ యిద్దరిది అలౌకికమైన ప్రేమంటావ్, అంతేనా?"

"మీరు చెప్పదల్చుకున్నదేదో సూటిగా చెపితే చాలా సంతోషిస్తాను."

"అదే చెప్పబోతున్నాను. నర్మద తండ్రి జనార్దనరావు ఓ కోటి రూపాయల కాంట్రాక్టుకి టెండరు వేశాడు. అతని టెండరు ముందు మరే కాంట్రాక్టరి టెండరు నిలబడలేదు. చాలా తక్కువ కమిషన్‌తో పని చేయిస్తానని ఆ టెండరు వేశాడు. అదే కాంట్రాక్టుకి మా కంపెనీ కూడా టెండరు వేసింది. అయితే మేము కనీసం అయిదారు లక్షలు ఎక్కువే లాభం వేసుకున్నాం. తక్కిన కంపెనీలయితే యింకా యెక్కువే తీసుకుంటారు. కాబట్టి జనార్దనరావు విత్‌డ్రా చేసుకుంటే ఆ కాంట్రాక్టు మాకే దక్కుతుంది!"

"నువ్వు చెప్పింది ఒక్క ముక్క కూడా అర్థంకాలేదు నాకు!"

"నేను తెలుగులోనే చెప్పాను. అర్థం కాకపోవ టానికి ఏముందిందులో?"

"ఒక్క విషయం అర్థమయింది. కాంట్రాక్టు మీ కొ స్తే కొన్ని లక్షలు మీకు లాభమొస్తుంది."

"హమ్మయ్య! కొంత నయమే! లారెల్ అండ్ లారెన్స్ కంపెనీవారు ప్రకటించిన టెండరది. చాలా ప్రతిష్ఠాకరమైన కాంట్రాక్టు. అది మా కంపెనీ చేపడితే మా కంపెనీకి మంచి పేరు ప్రతిష్టలతో బాటు లక్షల కొద్దీ లాభాలొస్తాయి. దాన్ని నువ్వు మా పరమయ్యేలా చెయ్యాలి. చెయ్యాలీ అంటే జనార్దనరావుగారి టెండరు లోని అంకె మా కంపెనీ అంకెకన్న ఎక్కువుండాలి. అది నువ్వు చెయ్యాలి."

"మీరు చెప్పేది డొంకతిరుగుడుగా వుంది. ఆయన టెండరులోని కాంట్రాక్టు మొత్తాన్ని నేనెలా మార్చ గలను?"

"వెరీ సింపుల్, ఆ కంపెనీలో పనిచేసే జాన్సన్ నీ క్లోజ్ ఫ్రండు, అవునా?"

"అయితే నీకు చాలా విషయాలు తెలుసునే!?"

"మీ ఫ్రెండుకి చెప్పి రాత్రికి రాత్రి ఆ టెండరు లోని అంకెల్ని తారుమారు చేయగల శక్తి నీకుంది."

"అందుకు నేనొప్పుకోను!"

"నర్మద నీకు శాశ్వతంగా దూరమైపోతుంది!"

"అదేం జరగదు. ఆమె కోపంలో తాత్కాలికంగా నామీద కోప మొచ్చింది. ఆ కోపం తీరిపోగానే మళ్ళీ మే మిద్దరం ఒకటవుతాం."

"ఆ కోపం అంత తేలిగ్గా పోయేది కాదు."

"ఎలా చెప్పగలరు?"

"ఆమె వసంతతో నీకు సంబంధమున్నదన్న సంగతి స్వయంగా కళ్ళారా చూసింది."

"అబద్ధం. వసంతతో నా కెలాంటి సంబంధము లేదు. ఆమె నా స్నేహితురాలు మాత్రమే!"

"అని నువ్వనుకుంటే సరిపోతుందా? ఆమె నీ గాఢ పరిష్వంగంలో వుండగా నర్మద చూసింది. నీ నిజ స్వరూపం తెల్సుకుని నిన్ను ద్వేషించింది. ఆమె మనసు విరిగిపోయింది. విరిగిపోయిన మనసు మళ్ళీ అతకదు."

"ఈ సంగతి నీకెలా తెలుసు?"

"ఆ సన్నివేశం నేను కూడా స్వయంగా చూశాను గనక! ఆ సందర్భంలో, మీ యిద్దరికీ శారీరక సంబంధం లేదని స్వయంగా భగవంతుడు దిగొచ్చి చెప్పినా నర్మద నమ్మదు. అంత విడదీయులేని విధంగా ఆ వసంతలో అతుక్కుపోయావు నువ్వు!"

"సరే....అలాగే అనుకుందాం. ఆమెలో తలెత్తిన అనుమాన బీజాన్ని నువ్వెలా పెకలించి వెయ్యగలవు?...."

"అది నా ఒక్కడికే సాధ్యం!"

"అదెలా సాధ్యమని అడుగుతున్నాను?"

"నేనే వసంత భర్తను కాబట్టి!"

పక్కలో బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు వాణీ నాథం.

"వాట్?....మీరు....మీరు....వసంత భర్తా?"

అతను సన్నగా నవ్వుతున్నాడు.

"ఎస్! నేనే. నా పేరు చక్రవర్తి."

"అయితే నిన్న ఉదయం నేను మీ యింటికొచ్చిన సమయానికి మీరు లేరే!"

"సరిగ్గా వసంత నీ చేతుల్లో పడిన సమయానికే యింటికి తిరిగొచ్చాను."

"మీరు....మమ్మల్ని....అపార్ధం చేసుకోలేదు కదా!?"

"నో, నో. వసంత యెలాంటిదో నాకు తెలుసు!"

"వెరీ గ్లాడ్ టు మీట్ యూ! నా పేరు వాణీనాధం. వసంత నా క్లాస్ మేటు. నిన్న మీ యింటికి ఆహ్వానించింది. మీరు ఆఫీసుకు వెళ్ళారని చెప్పింది. అందుకే మిమ్మల్ని కలుసుకోలేక పోయాను....ఆమె మెట్లెక్కబోతూ కాలుజారి పడిపోబోతే పట్టుకోబోయాను. అంతే....అంతకు మించి...."

"అలా కంగారు పడిపోతావేం? నేను యేమీ అనుకోవటంలేదు. అయితే, నీకు తెలియని మరో సత్యం నేను చూశాను. సరిగ్గా నే నింటికొచ్చిన సమయానికి కిటికీలోనించి లోపలికి చూస్తూన్న ఓ అమ్మాయి నాకు కనిపించింది. ఆమె యెవరో కాదు, నీ ప్రియురాలు నర్మద!"

వాణీనాధం నిర్ఘాంతపోయి చూశాడు.

"అయితే నర్మద అపార్ధం చేసుకొనటానికి నన్ను తిరస్కరించి వెళ్ళిపోవటానికి యిదన్న మాట కారణం?...."

"అర్ధమయింది కదా! అందుకే నా ఒక్కడివల్లనే ఆమెకు నచ్చచెప్పటం సాధ్యమయ్యేది! మీ ఇద్దర్ని ఒక్కటి చెయ్యగల సామర్ధ్యం నా ఒక్కడికే వుంది. అందుకే యీ టరెమ్స్."

"సీల్డు టెండర్లు కదా. ఓపెన్ చేయుటం సాధ్యపడక పోవచ్చు."

"అందుకు యింకో మార్గముంది."

"ఏమిటది?"

"అసలు జనార్దనరావు పెండరు లేకుండా చేసెయ్యడమే!"

వాణీనాథం విస్మయంగా చూశాడు.

"మనసుంటే మార్గం లేకపోతుందా?" నవ్వాడతను.

చక్రవర్తి వంక అయోమయంగా చూశాడు వాణీనాథం. తనకు అతనిమాట వినటం తప్ప మరో గత్యంతరం లేనట్టుగా వుంది. నర్మద తనని జన్మలో యిక ముఖం చూడదు! ఆమె నిర్ణయం మార్చటం తనచేతకాని పని! అందుకు సమర్థుడు చక్రవర్తే! అతనుకూడా ఆ సమయానికి అక్కడే వున్న నిజాన్ని, వసంతను తను పట్టుకోవటం కాకతాళీయంగా జరిగిన సత్యాన్ని చెప్పి నర్మదకు నమ్మకం కలిగిస్తాడు. అవసరమైతే వసంతను కూడా నర్మద దగ్గరకు తీసుకువెళ్ళి నిజం చెప్పిస్తాడు.

నర్మద వింటుంది. తన అపార్థాన్ని తెల్సుకుంటుంది. తన అభిప్రాయం తప్పని గ్రహిస్తుంది. తన పొరపాటుకు చింతించి, తన దగ్గరకు పరుగెత్తుకొస్తుంది. ఇదంతా సక్రమంగా జరగాలంటే అందుకు చక్రవర్తి సహకారం కావాలి!

ఇదంతా చక్రవర్తి తు.చ. తప్పకుండా చెయ్యాలంటే, అందుకు ప్రతిఫలంగా తను చెప్పినట్టు వినాలి! అతనడిగిన పని చేసిపెట్టాలి.

నర్మదను తను మనసారా ప్రేమించాడు. మనసా వాచా ఆమెనే కోరుకుంటున్నాడు. ఆమె ఆస్తిమీద తనకు ఆశ లేదు. తనకి కావలసింది నర్మద ప్రేమ. అంతే! ఆ

ప్రేమకోసం తనేమైనా చేయగలదు. ఆమె తిరస్కా రాన్ని భరించగల శక్తి తనకు లేదు. భరించి బతకటం దుర్లభం!

వాణీనాథం ఓ నిశ్చయానికొచ్చాడు.

"సరే, మీరు చెప్పిందాని కంగీకరిస్తున్నాను!" అన్నాడు సిరంగా.

చక్రవర్తి అతని భుజంతట్టి, "వెరీగుడ్! ఈ రాత్రికే పని పూర్తికావాలి. రేపుదయం టెండర్లు తెరుస్తారు!" అన్నాడు.

## 4

వాణీనాథం చెప్పింది విని జాన్సన్ కాసేపటివరకు మాట్లాడలేదు.

తర్వాత అతనివంక చూసి, "నువ్వు చెప్పేది చాలా రిస్కుతో కూడిన పని. వచ్చిన ప్రతి టెండరు యిన్ వార్డ్ టపాల్స్‌లో రికార్డయిపోతుంది. రిజిష్టరు డిస్పా చింగ్ క్లార్కు దగ్గరుంటుంది. దాన్ని మాయంచేయటం మనతరం కాదు!" అన్నాడు.

వాణీనాథం తన పట్టు వదల్లేదు.

"పోనీ, ఆ టెండర్లోని ఫిగర్ హెచ్చుగా వేస్తే సరిపోతుంది!"

"అది అసంభవం! సీలు విప్పే అధికారంగాని, దాన్ని వేయగల అవకాశంగాని నాకు లేవు! "అవన్నీ బిజినెస్ మేనేజర్ చూసుకుంటాడు. సేల్సు బోర్డు ఆఫ్ డైరక్టర్సు పార్టీల సమక్షంలోనే తెరుస్తారు. అంచేత ఫిగర్ మార్చే ప్రసక్తేలేదు!"

వాణీనాథానికి కోపం వచ్చింది.

"తప్పించుకోవటానికి యిన్ని రకాలుగా సాకులు చెపు

తున్నావు. నువ్వు నా మాట తీసేస్తావనుకోలేదు!" అన్నాడు.

జాన్సన్ "సారీ, బ్రదర్! ఏమనుకోకు. నీకో సలహా చెప్పగలను" అన్నాడు.

"ఏమిటది?"

"జనార్దనరావుగార్ని యీ టెండరు విత్ డ్రా చేసుకోమని కోరితే సరిపోతుందిగా!"

"అయినే వుంటే మంగలెందుకని, యీ పని చేయగలిగితే నీ దగ్గరెందుకొస్తాను? చిన్ననాటి స్నేహితుడివి కదా సాయం చేస్తావని వస్తే, చేయకపోగా పనికిమాలిన సలహాలిస్తావనుకోలేదు!"

కోపంగా వచ్చేశాడు వాణీనాథం.

అతని మనస్సు స్థిరంగా లేదు. అటు నర్మద తిరస్కారం గుండెను కోసేస్తూంటే, యిటు స్నేహితుడని నమ్మిన జాన్సన్ మొండిచెయ్యి చూపించాడు.

సాయంత్రం నుంచి కాలుగాలిన పిల్లిలా తిరగటంవల్ల బాగా నీరసం వచ్చేసింది. హోటల్లో భోంచేసి రూంకొచ్చి నడుం వాల్చాడు. గుడ్డలైనా మార్చుకోకుండా మంచాని కడ్డంపడి ఆలోచిస్తూన్నాడు.

రాత్రి పదిగంటలయింది.

వాణీనాథం సీరియస్‌గా ఆలోచిస్తూనే వున్నాడు. అతనికి ప్రమాదకరమైన ఆలోచన వచ్చింది. అది జాన్సన్ ఆఫీసులోకి దొంగతనంగా దూరి, ఆ టెండరు మాయం చేయటం! కాని అది అంత తేలికా?

వాచ్‌మన్ వుంటాడు. టెండర్లు లోపలెక్కడో స్టీలు అల్మయిరాలో భద్రపరచి వుంటారు. వాటి తాళాలు బిజినెస్ మేనేజర్ దగ్గరుండవచ్చు. అవెలా వస్తాయి?

అల్మయిరా బద్దలు కొట్టడం కష్టం. అలికిడికి చుట్టుపట్ల వాళ్ళు లేస్తే తను శాశ్వతంగా పోలీసులకి అతిథిగా పడి వుండాల్సిందే!

అయినా, నర్మదకోసం ఈ రిస్కు తీసుకోక తప్పదు. జాన్సన్ ఆఫీసు వూరికి దూరంగా విసిరేసినట్టుంటుంది. దగ్గర్లో అలాంటివే రెండు ఆఫీసులున్నాయి. వాటికి వంద గజాల సమీప రేడియస్‌లో నివాసగృహాలేవీ లేవు— కొంత నయమే!

రిస్కు తీసుకోవటానికే నిర్ణయించుకున్నాడు వాణీనాథం.

## 5

రాత్రి పదకొండున్నర అయింది. లేచి తలుపు తాళం పెట్టాడు. చలికాలం కావటం కొంత నయమయింది. అందరు యిళ్ళల్లో వెచ్చగా పడుకున్నారు.

మఫ్లర్ చెవులచుట్టూ ముఖాన్ని చాలావరకు కప్పేసేలా చుట్టుకున్నాడు. పరీక్షగా చూస్తే తప్ప పరిచయకులే గుర్తుపట్టడం కష్టం!

ఆఫీసు సమీపిస్తున్నకొద్దీ వాణీనాథానికి టెన్షన్ పెరిగిపోసాగింది. భయం పోయి, దాని స్థానే తెగింపు మొండి ధైర్యం చోటుచేసుకున్నాయి. వచ్చేటప్పుడు యింట్లో పళ్ళు కోసుకునే చాకు జేబులో వేసుకున్నాడు.

ఆఫీసుముందు వాచ్‌మన్ కునికిపాట్లు పడుతున్నాడు. ఆఫీసు చుట్టూ కాంపౌండ్ వాల్ వుంది. వెనకవైపుకి వెళ్ళాడు. చుట్టూ ప్రశాంతంగా, నివాసగృహాల దగ్గర్నుంచి వుండివుండి కుక్కల అరుపులు వినిపిస్తున్నాయి.

అటు యిటు చూసి కాంపౌండ్ వాల్ మీదినుంచి లోపలికి గెంతేశాడు. గుండె వేగంగా కొట్టుకుంటోంది.

ఎప్పుడూ యిలాంటి పనులు చేసివున్నవాడు కాకపోవటం వల్ల బెరుగ్గా, భయంగా వుంది. దాన్ని తెగింపు జయిం చేసింది.

దూకిన చప్పుడుకి వాచ్‌మన్ చటుక్కున లేచాడు. టార్చిలైటు ఫోకస్ చేశాడు. తప్పించుకోవాలన్నా వీలు కాలేదు వాణీనాథానికి.

"ఏయ్, ఎవరు నువ్వు?" అన్నాడు వాచ్‌మన్ బిగ్గరగా.

ఒక్క అంగలో వాచ్‌మన్‌ని సమీపించి బాకుతీసి వాచ్‌మన్ ముందు గాల్లో ఆడించాడు. టార్చి వెలుర్లో అది తళతళ మెరిసింది.

"జాగ్రత్త, అరిచావంటే చస్తావు" అన్నాడు వాణీ నాథం కర్కశంగా.

వాచ్‌మన్ వణికిపోతున్నాడు. అయినా ధైర్యం తెచ్చుకొని, "ఎవరు నువ్వు? ఇది ఆఫీసు. నీకేం దొరకదు" అన్నాడు.

"నాకు తెలుసు. ఆఫీసు తాళాలు ఓసారి యిచ్చా వంటే ఏ సమస్య వుండదు. ఓ పది నిమిషాల్లో నా పని పూర్తిచేసుకొని వెళ్ళిపోతాను!"

"తాళాలు నా దగ్గరలేవు!"

"అబద్ధం. గదుల తాళాలు వాచ్‌మన్ దగ్గరే వుంటాయి. ఆ సంగతి నాకు తెలుసు. ప్రాణాలమీద ఆశుంటే అవి నాకిచ్చి పదినిమిషాలు నోర్మూసుకొని పడుండు. అరుద్దామని ప్రయత్నిస్తే నిర్దాక్షిణ్యంగా చస్తావు!"

వాచ్‌మన్ అతన్నుంచి తప్పించుకుని తన పక్క దగ్గర్లో వున్న కర్ర అందుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

వాణీనాథం కనిపెట్టాడు.

"నన్నేమైనా చెయ్యాలని పిచ్చి ప్రయత్నం చెయ్య బోతే నిర్దాక్షిణ్యంగా పొడిచేస్తాను. నాకు జాలి, దయ లేవు."

వాచ్ మన్ నిస్సహాయంగా చూశాడు. వాణీనాథం అతని గొంతుమీద బాకు ఆన్చి, "ఊఁ ఆలస్యం చెయ్యొద్దు. తాళాలు యిచ్చెయ్యి" అన్నాడు.

వాచ్ మన్ ప్రాణభయంతో తాళాలగుత్తి ఇచ్చేశాడు.

వాచ్ మన్ దుప్పటి చించేసి, ఆ పీలికలతో అతని చేతులు వెనక్కి విరిచి కట్టేశాడు వాణీనాథం. కొన్ని గుడ్డలు నోటిలో కుక్కాడు అరవటానికి అవకాశం లేకుండా.

వాచ్ మన్ ని ఓ పక్కగా లాగిపడేసి, చకచక తాళాలు తెరిచి ఆఫీసులోనికి ప్రవేశించాడు. ఆ తాళాల గుత్తిలో స్టీలు అల్మయిరా తాళాలు యేవీ లేవని గ్రహించాడు. కేవలం గదుల తాళాలు మాత్రమే వున్నాయి ఆ గుత్తిలో.

బిజినెస్ మానేజర్ అని రాసివున్న గదిలోకి ప్రవే శించాడు. లోపల రెండు స్టీలు అల్మయిరాలున్నాయి. బహుశా ఆ రెండింటిలో ఏదొక దానిలో టెండర్లు తాలూకు ఫైలు వుండివుంటుంది. సీల్డు టెండర్లన్నీ అందు లోనే భద్రపరచి వుంటారు. రెండు బీరువాలు పగల గొట్టాలంటే మాటలు కాదు. చాలా శ్రమతో కూడిన పని, పైగా తనకిలాంటి వాటిలో అనుభవం లేదు.

దిక్కు తోచక నిలబడిపోయిన వాణీనాథం తన వెనకపక్క ఏదో అలికిడి అయినట్టు వినిపించి చివ్వున వెనుతిరిగి చూసి నిర్ఘాంతపోయాడు.

వాచ్‌మన్‌తో బాటు నిల్చుని వున్న మనిషిని చూసి మతిపోయిందతనికి.

అతను జాన్సన్!

"నువ్విలాంటి సాహసమేదో చేస్తావని అనుమానించాను. అలాగే జరిగింది!" అన్నాడు జాన్సన్. అతని ముఖం చాలా గంభీరంగా వుంది.

వాణీనాథానికి తల కొట్టేసినట్టయింది.

వాచ్‌మాన్ తినేసేలా చూస్తున్నాడు వాణీనాథం వైపు.

"నీ రూంకి వెళ్లాను. నువ్వు లేవు. ఎందుకో ఆ సమయంలో నువ్వు లేకపోగానే నా అనుమానం నువ్విక్కడికొచ్చావేమో ననిపించింది. ఏదయినా సెకండ్‌షోకి వెళ్ళావేమో ననుకున్నాను కాని, నీ మనోగత పరిస్థితి తెల్సు కాబట్టి వెళ్ళివుండవనుకున్నాను. వెంటనే యిక్కడికే బయల్దేరి వచ్చేశాను. నా అనుమానం నిజమయింది. వాచ్‌మన్ పలకలేదు. గేటులోపల మూలుగుతున్న శబ్దం వినిపించింది.

"గేటు తెరుచుకొని లోనికొచ్చాను. వాచ్‌మన్ కట్లు విప్పగానే ఎవరో వ్యక్తి తాళాలు తీసుకుని లోపలికి చొరబడ్డాడని చెప్పగానే, అనుమానం బలపడిపోయింది. లోనికొచ్చేసరికి నువ్వే! ఒక ఆడదానికోసం సామ్రాజ్యాలే నాశనమయిపోయాయి. నిండు ప్రాణాలు మట్టిలో కలిసిపోయాయి. నువ్వు వాళ్ళ దారిలోనే నడిచావు. నీ జీవితం నాశనమయిపోతుందనే భయంకూడా లేకుండా యింత రిస్కు తీసుకున్నావంటే నీది చాలా ఘాటైన ప్రేమలా వుంది...." అని జాన్సన్ ఏదో అంటుండగానే బయట ఏదో జీపు ఆగిన శబ్దం వినిపించింది.

ముగ్గురు ఉలిక్కిపడి చూశారు.

పోలీసులు! జీపు దిగుతున్నారు.

వాణీనాథం ప్రాణాలు పైనే పోయాయి.

జాన్సన్ వంక అనుమానంగా చూశాడు.

జాన్సన్ తల అడ్డంగా తిప్పి, "వెంటనే వెనకవైపు నించి పారిపో వాణీ!.... వెంకన్నా, నువ్వు జరిగిన సంగతులేవీ ఎవరితోనూ చెప్పకు, తెల్సిందా?" అన్నాడు.

"అట్టాగే బాబూ" అన్నాడు వెంకన్న-వాచ్‌మన్.

జాన్సన్ తప్పించుకునే దారి చూపించాడు. వాణీనాథం పరుగున తప్పించుకొని బయట పడిపోయాడు. అవలి ద్వారంనించి రోడ్ ఎక్కేశాడు.

పోలీసులు లోపలికొచ్చేసరికి, ఏదో అర్జంటుగా ఫైలు తీసి నోట్ రాస్తున్నాడు జాన్సన్.

"ఎవరు మీరు?" అన్నాడు అధికారపూర్వకంగా పోలీసు ఇన్‌స్పెక్టరు.

వాచ్‌మన్ కల్పించుకొని "ఈన మా ఆఫీసులో హెడ్డు గుమాస్తాగారు బాబయ్యా" అన్నాడు.

జాన్సన్ పోలీసుల వంక ఆశ్చర్యంగా చూసి ఇన్‌స్పెక్టర్‌తో "ఓ అర్జంటు ఫైలు పుటప్ చేయాల్సి వుండి ఇంటికిపోయి మళ్ళీ వచ్చాను సార్! రేపు ఉదయం డిస్పాచ్‌కి వెళ్ళాలి ఇది....ఇంతకూ మీరెందుకొచ్చారో అర్థంకావటంలేదు!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ బుర్ర గోక్కుని, "ఎవడో దొంగ వాచ్‌మన్‌ని కట్టిపడేసి, ఆఫీసులో దొంగతనానికి దూరాడని మాకు ఫోన్ వచ్చింది. వెంటనే బయల్దేరి వచ్చాం. వాచ్‌మన్ ఎవరు?" అన్నాడు.

"నేనే బాబూ, నా పేరు వెంకన్న" అన్నాడు

వెంకన్న.

ఇన్స్పెక్టరు "సారీ, ఆ ఫోన్ కాల్ చేసిన రాస్కెల్ ఎవడో ప్రాక్టికల్ జోకరయి వుంటాడు. వస్తాం సార్, సారీ ఫర్ ది డిస్టర్బన్స్" అంటూ పోలీసు కాన్స్టేబుల్స్ వంక సైగ చేసి బయటకి బూట్లు చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయాడు. మరు నిమిషంలో జీపు స్టార్టయి వెళ్ళిపోయింది.

జాన్సన్ గబగబ బయటికొచ్చి చూశాడు. దుప్పటి పీలికలు అలాగే పడున్నాయి. ఇన్స్పెక్టర్ దృష్టిలో అవి పడకపోవటం అదృష్టం! ఆ ప్రదేశం చీకటిగా వుండటంవల్ల ఇన్స్పెక్టర్ చూడలేదు. థాంక్ గాడ్! అనుకున్నాడు.

వెనక్కి వచ్చి వెనక ద్వారం దగ్గర ఆగి చూశాడు. వాణీనాథం యెక్కడా కనుచూపు మేరలో లేడు. బాగానే తప్పించుకున్నాడు. లేకపోతే వాణీనాథం యెవరని ఆరాతీసేవాడు ఇన్స్పెక్టరు. తను సమాధానం చెప్పుకోవటం కష్టమయి వుండేది! తను కూడా యీ కేసులో యిరుక్కుపోయి వుండేవాడు!

# 6

రూంకెలా వచ్చిపడ్డాడో వాణీనాథానికే తెలియదు. చాలా పెద్ద ప్రమాదం తప్పింది. జాన్సన్ తెలివిగా తనని తప్పించాడు. లేకుంటే యీపాటికి కటకటాలు, లెక్కపెట్టుతూ వుండవలసింది తను.

అయితే, పోలీసులకెవరు చెప్పారు? జాన్సన్ ఫోన్ చేసి పిలిచే అవకాశంలేదు. వాచ్మన్కి అసలే సావకాశంలేదు.

ఎవరు? ఎవరు?

తెల్లవార్లు నిద్రలేమితో బాధపడ్డాడు. తెల్లవారగానే చక్రవర్తిని కల్సుకొని తన అసమర్ధతని తెలియజేసి, తనను మన్నించమని అడగాలి. తను పోలీసుల బారినుంచి తప్పించుకున్న వైనం కూడా చెప్పాలి. అతని గురించి ఎంత సాహసానికి సిద్ధపడ్డాడో వివరించి చెప్పి అతన్ని కన్విన్స్ చెయ్యాలి! ఎలాగైనా నర్మదను నచ్చచెప్పి, తనదారికి తిప్పేలాగా బతిమాలుకోవాలి. అవసరమైతే వసంతను కూడా సాయం చేయమని అడగాలి!

ఆ ఆలోచన వచ్చాక ఎప్పుడో తెల తెలవారుతుండగా నిద్రపట్టింది వాణీనాథానికి. కలలో కూడా పోలీసులు, జైలు కనిపించింది. అతని మనసుకి శాంతి లేకుండా పోయింది.

తెల్లవారగానే వసంత వాళ్ళింటికి వెళ్ళాడు.

"చక్రవర్తిగారూ!" అంటూ తలుపుతట్టి పిలిచాడు.

చాలా సేపటికి యెవరో తలుపు తెరిచారు.

మగతను. నైట్ డ్రస్సులో వున్నాడు. ఆజాను బాహువు. నిద్ర కళ్ళతో తలుపులు తెరిచి, "ఎవరు కావాలి? ఎవరు మీరు?" అన్నాడు.

"చక్రవర్తిగారు కావాలి. కాస్త పిలుస్తారా?" అన్నాడు వాణీనాథం.

ఆయన రవంత ఆశ్చర్యంతో "అయామ్ చక్రవర్తీ! మీ రెవరో నాకు తెలీదు" అన్నాడు.

నిశ్చేష్టుడై ఆయన వంకే చూస్తూ వుండిపోయాడు వాణీనాథం.

ఆయన విసుగు స్పష్టంగా తెలియచేస్తూ, "ఎందుకొచ్చారని అడుగుతే సమాధానం చెప్పరేమిటి? పొద్దుటే

డిస్టర్బ్ చేయటంకాక....” అనబోతుంటే వాణీనాథం అందుకొని, “సారీ సార్! మీరు వసంత భర్త చక్రవర్తి గారేనా?” అన్నాడు:

ఆయనకి కోపం వచ్చింది. “నేను వసంత భర్తను కాదు. వసంత నా భార్య” అన్నాడు.

ఆయన కెందుకొక్కోపం వచ్చిందో, తనడిగిన ప్రశ్న లోని అనౌచిత్యమేమిటో వాణీనాథానికి అర్థమయింది.

“సారీ, నా ఉద్దేశ్యం అది కాదు. నాకు పరిచయమైన వ్యక్తి మీరు కాదు....” అంటూ అయోమయంతో ఏమనాలో అర్థంకాక అర్థోక్తిలోనే ఆగిపోయాడు.

ఆయన విసుగ్గా తలుపు వేసెయ్యబోతుండగా అప్పుడే అక్కడికొచ్చిన వసంత, “అయ్యో! అది నేనండి వాణీనాథం. మా క్లాసుమేటు!” అన్నది.

ఆయన ఆశ్చర్యంగాను, అపాలజిటిక్ గాను వాణీనాథం వంక చూసి, “సారీ, మీరెవరో తెలియక విసుక్కున్నాను” అన్నాడు.

“వాణీనాథం, వీరే మావారు. మొన్న నువ్వొచ్చి వెళ్ళాక వచ్చారు. నువ్వొచ్చి వెళ్ళినట్టు చెప్పాను. సమయానికి ఇంట్లో తను లేకపోయినందుకు నొచ్చుకున్నారు” అన్నది వసంత.

“సారీ, మిమ్మల్ని ఇంతసేపూ నిలబెట్టే మాట్లాడాను. లోపలకు రండి!” అన్నాడు చక్రవర్తి.

వాణీనాథం అయోమయంగానే లోపలికి వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. వసంత లోనికి వెళ్ళి ముగ్గురికీ కాఫీ తెచ్చింది.

“ఏమిటి, యింత పొద్దుటే వచ్చారు? పైగా ఏదో అనిమిత్తంగా వున్నట్టున్నారు!” అన్నాడు చక్రవర్తి

స్నేహపూర్వకంగా నవ్వుతూ.

వాణీనాథం భార్యాభర్తలిరువురి వంక చూసి, "నేను ఓ పెద్ద చిక్కులో పడ్డాను. చక్రవర్తి అని పేరు చెప్పుకొని ఓ వ్యక్తి నాకు పరిచయమయ్యాడు. మిమ్మల్ని గతంలో నేను చూసి వుండకపోవటంవల్ల అతనే చక్రవర్తి అని చెబితే నమ్మేశాను" అంటూ ముందు రోజు జరిగిన సంగతంతా అరమరికల్లేకుండా చెప్పేశాడు.

అయితే వసంత జారి పడబోతుంటే తను పట్టుకున్న సంగతి మాత్రం చెప్పకుండా జాగ్రత్తపడ్డాడు. అకారణంగా తనమీద నర్మద అలిగిందని మాత్రం చెప్పాడు.

అంతా విని చక్రవర్తి, "వాడెవడో ఛీట్‌లా వున్నాడు. నా పేరు వాడుకొని మిమ్మల్ని బోల్తా కొట్టించాడు. ఈసారి వాడు కనపడితే సరాసరి నాకు ఫోన్ చెయ్యండి. వాడ్ని పోలీసుల కప్పగిద్దాం. నాకు డి. ఎస్పీ. తెలుసు. బొమికలు విరగ్గొట్టిద్దాం" అన్నాడు.

వసంత జాలిగా చూసింది వాణీనాథం వంక.

వాళ్ళిద్దరి దగ్గర సెలవుతీసుకొని రూంకి తిరిగొచ్చాడు వాణీనాథం. అతని మనసంతా అల్లకల్లోలమయిపోయింది.

ఈ నకిలీ చక్రవర్తి ఎవరు? ఏం కోరి తనను ఇలాంటి అప్రాచ్యపు పనికి నియోగించాడు? తననెంత మోసం చేశాడు? తను వసంత వాళ్ళింటికి వెళ్ళటంవల్లనే నిజం తెలిసింది. లేకుంటే చక్రవర్తి అతనే అనుకుని, వసంత భర్త అతనే అనుకొని తను ఇంకా మోసపోయి వుండేవాడు. ఇంకా నయం గాత్రి పోలీసులకి దొరికిపోకుండా జాన్సన్ రక్షించాడుగాని, లేకుంటే తిన గతేమయి వుండేది?

జాన్సన్‌ని తల్చుకోగానే అతని మనసంతా కృతజ్ఞతతో నిండిపోయింది.

సరిగ్గా అప్పుడే జాన్సన్ వాణీనాథం గదిలోకి అడుగు పెట్టాడు. అతన్ని చూడగానే సిగ్గుతోను, అవమానంతోను కుంచించుకుపోయాడు వాణీనాథం. అతన్ని కూచోమని, చెప్పడానిక్కూడా మాటలు రానట్టు అలాగే కళ్ళప్పగించి చూస్తూండిపోయాడు.

జాన్సన్ తనే గాడ్రెజ్ కుర్చీ వాల్చుకొని కూచుని, "ఇంతకీ యింత సాహసమూ నీ నర్మద గురించేనా....?" అన్నాడు.

"నన్ను క్షమించు జాన్. నేనేదో మైకంలో పడి పిచ్చి పిచ్చిగా ప్రవర్తించాను. నా కళ్ళు తెరుచుకున్నాయి" అన్నాడు వాణీనాథం స్నేహితుడి చేతులు పట్టుకొని.

"నయం, పోలీసులకి చిక్కకుండా తప్పించుకోగలగటం చాలా అదృష్టం. వెంకన్న నమ్మకస్తుడు. నేనంటే గురి. మాట బయటకి పొక్కదు!" అన్నాడు జాన్సన్.

"నీకు ఋణపడి వున్నాను!"

"ఛ....మనలో మనకి ఋణాలేమిటి? ఇంతకీ నిన్న రాత్రి నీ రూం కెందుకొచ్చానో తెలుసా?"

"ఎందుకు?"

"నువ్వు చెప్పిన కంపెనీ పేరు మాకొచ్చిన టెండర్సులో లేదు. నువ్వు మా ఇంటికొచ్చి జనార్దనరావుగారి టెండరు తీసెయ్యమని చెపుతూ, శాంసన్ అండ్ కంపెనీ లిమిటెడ్ వారు వేసిన టెండరు గురించి చెప్పావు చూడు...."

"అవును. అది చక్రవర్తినని చెప్పుకొన్న ఆ మోస గాడు చెప్పిన కంపెనీయే."

"ఆ పేరుగల కంపెనీ నుంచి అసలు టెండరు రాలేదు. టెండరు లేనిది, జనార్దనంగారి టెండరు లేక పోతే, కాంట్రాక్టు తమ కంపెనీకే వస్తుందని అతనెందుకు చెప్పాడో, నీ కెందుకు జనార్దనంగారి టెండరు తీయిం చేయమని చెప్పాడో అర్థంకాలేదు. నా పర్సనల్ డైరీలో నా సీట్‌కొచ్చిన టెండర్లు యితర వివరాలు నోట్ చేసుకోవటం నా కలవాటు. నువ్వెళ్ళాక నా డైరీ చూస్తే ఆ కంపెనీ పేరే కనపడలేదు. ఆ మాటే నీకు చెప్పుదామని నీ రూంకొచ్చి చూస్తే నువు లేవు. అను మానం వచ్చి మా ఆఫీసుకి పరుగెత్తుకొచ్చాను."

"నువ్వొచ్చి నా ప్రాణం కాపాడావు. ఇంతకీ ఆ డూప్లికేట్ చక్రవర్తి జనార్దనంగారి టెండర్ని ఎందుకు తీసెయ్యమన్నట్లో తమ కంపెనీ పేరు తప్పు యెందుకు చెప్పాడో అర్థంకావటంలేదు."

"నాకో విషయం స్ఫురిస్తోంది."

"ఏమిటది?"

"వాడెవడో జనార్దనంగారి శత్రువయి వుండాలి. అందుకే ఆయనకి కాంట్రాక్టు రాకూడదనే ఉద్దేశంతో నిన్నుపయోగించుకున్నాడు."

"వాడికి నన్నే ఉపయోగించుకోవాలని యెందుకు బుద్ధి పుట్టింది?"

"నీ అవసరం కనిపెట్టాడు. వాడికి నర్మదతో నువు తిరగటంకూడా యిష్టముండి వుండదు. నర్మదకి, నీకు చెడటం వాడికానందం కలగజేసింది. నిన్ను యిరికిం చాలనే ఈ పన్నాగం పన్నాడు. అటు జనార్దనం

ఉండదు పోతుంది, నువ్వూ పోలీసులకి చిక్కి నర్మదకి దూరమైపోతావు. నా ఊహే కరెక్టయితే నువ్వు మా ఆఫీసులో ప్రవేశించిన సంగతి వాడే పోలీసులకి ఫోన్ చేసి వుంటాడు!"

"దానివల్ల వాడికేం లాభం?"

"నువ్వు నర్మదకు దూరమవుతావు."

"కాని నన్ను పోలీసులు పట్టుకుంటే జహార్ నరావు ఉండదు అల్మాయిరాలోనే వుండిపోతుంది కదా!?"

జాన్సన్ తల పంకించాడు. హేతుబద్ధంగా ఆలోచిస్తే వాణీనాథం చెప్పింది కరెక్టే!

ఆ డూప్లికేట్ చక్రవర్తి ఏ మాశించి వాణీనాథాన్ని పోలీసుల కప్పగించాలనుకున్నాడు?

"వాడు మళ్ళీ నిన్ను కలుస్తానన్నాడా?"

"ఆ మాటనలేదు గాని, యీ సాయంత్రం నాకోసం పబ్లిక్ గార్డెన్సుకి ఖచ్చితంగా వస్తాడు—ఆ ఉండదు గురించి తెల్సుకోటానికి!"

"ఆల్ రైట్. సాయంత్రం నేను ఆఫీసునించి సరాసరి గార్డెన్స్‌కొచ్చేస్తాను. నువ్వు నాకోసం మెయిన్ గేటు దగ్గర చూస్తూండు. వాడి సంగతి తేల్చేదాం."

"సరే. నువ్వొచ్చేలోపలే వాడొచ్చేస్తే?"

"వాడ్ని మాటల్లో పెట్టు. సాధారణంగా వాడు నిన్ను యెక్కడ కల్సి మాట్లాడుతాడు, గార్డెన్స్‌లో?"

"ఆర్కియాలజీ మ్యూజియం పక్కనున్న గుబురు మొక్కల దగ్గర—నర్మద, నేను ఎప్పుడూ అక్కడే కూచుంటాం."

"ఆల్ రైట్ అక్కడే వుండు!"

వాణీనాథం ఉలిక్కిపడ్డాడు.

నర్మద గార్డెన్స్‌లోకొస్తోంది. మెయిన్ గేటు పక్కనున్న గోడపక్క ముఖం తిప్పేసుకొని క్రీగంట ఆమెనే గమనించసాగాడు.

నర్మద సరాసరి తమ సంకేత స్థలంలో పోయి కూచుంది. ఆమె ఎవరికోసం ఎదురుచూస్తోంది? తనకోసం కాదుగదా!

వాణీనాథంలో జిజ్ఞాస తలెత్తింది. ఆశ పుట్టింది. నర్మద తనని క్షమించేసి వుంటుంది. తనకోసమే అక్కడ యెదురుచూస్తోంది. అనుమానంలేదు!

వాణీనాథం ఆనందంగా అడుగులు వేశాడు. ఇంతలో వూహించని సంఘటన జరిగిపోయింది.

నర్మద పక్కనే చతికిలబడ్డాడో యువకుడు. వాడు ....వాడు....వాడెవడో కాదు నకిలీ చక్రవర్తి!

వాణీనాథం గుండె వేగంగా కొట్టుకోసాగింది. రక్తం సలసల మరిగిపోయింది. వాడ్ని పీక పిసికెయ్యాలన్నంత ఆగ్రహం వచ్చింది.

చురుగ్గా అడుగులు వేశాడు. గుబురు దగ్గరవ చేరువన్నాడు. ఇంతలో వాళ్ళ మాటలు ఆసక్తికరంగా వుండటంతో చటుక్కున ఆగిపోయి వినసాగాడు. సరిగ్గా అప్పుడే జాన్సన్ అక్కడికి చేరువన్నాడు. మాట్లాడ వద్దని సైగచేసి, యిద్దరు గొంతు క్కుచున్నారు గుబురు వెనుక.

డూప్లికేట్ చక్రవర్తి అంటున్నాడు.

"నా మాట విను నర్మదా, ఆ లోఫర్ గాడు నిన్నేం సుఖపెడతాడు. వాడు మీ నాన్న ఆస్తికోసమేగాని

నీ కోసం కాదు నీ వెంట పడుతున్నది?"

"నువ్వు నాకేం చెప్పకు. ఆ రోజు నీ మాటలు నమ్మి అతన్ని అనుమానించాను. అతని కేరక్టర్ గురించి బాగా తెలిసి తెలిసి అతన్ని అనుమానించాను. అందుకు కుమిలి పోతున్నాను."

"నువ్వే నీ కళ్ళతో చూశావుకదా! ఆ వసంత గాఢ పరిష్వంగంలో నీ ప్రియుడు."

"స్టాపిట్! అసలు ఆ అనుమానం కలగజేసింది నువ్వు. ఆ ఆదివారం వాణీ దగ్గర్నుంచి మా యింటికొస్తూంటే హోటల్ సమీపంలో కనిపించావు. వాణీ యెవరో అమ్మాయిని మరిగాడని కావాలంటే యిప్పుడతను ఆమె దగ్గరకే వెళుతున్నాడనీ నాకు నూరిపోశావు. స్త్రీ సహజమైన అనుమానంతో నమ్మాను.

నన్ను తీసుకుని వసంత వాళ్ళింటికి వెళ్ళావు. అయితే మనం వెళ్ళిన సమయానికి వసంత మెట్లమీదినుంచి తూలి పడబోతే వాణీ ఆమెను పడకుండా ఆపి రక్షించాడు. ఆ దృశ్యం నేను, నువ్వుకూడా చూశాం. దానికి రక రకాలుగా రంగు పూసి, నా మనసులో విషం ఎక్కిం చావు. నేను ఆ వేడిలో వాణీని దూషించాను. అతను అభిమానపడి వెళ్ళిపోయాడు. అతని మనసు గాయ పడింది."

"అదేమిటి, ఆ రోజు నిజంగానే అతను వసంతతో రాసక్రీడలు...."

"ఇంకొక్క మాట అదనంగా వాగితే నీ నాలుక తెగి పోతుంది. ఈ రోజు ఉదయం వసంత వచ్చి నాతో అన్ని విషయాలు చెప్పింది. వాణీ ఉత్త అమాయకుడని నిర్దోషని చెప్పింది. అతన్నెవరో తమ చెప్పు చేతల్లో

యిరికించుకుని పోలీసు కేసులో ఇరికించబోయారని కూడా చెప్పింది. వెంటనే వాణీ రూంకెళ్ళి క్షమాపణ చెప్పుకుందామని వెళ్ళాను. కాని అతను అప్పటికే ఆఫీసుకి వెళ్ళిపోయాడు. నా అదృష్టం బావుండి యిక్కడికొస్తాడేమోనని వచ్చాను. ఇక్కడికి రాకపోతే మళ్ళీ రూంకెళ్తాను."

డూప్లికేట్ చక్రవర్తి పకపక నవ్వి, "ఇంకా నీ వాణీ నీకు దక్కుతాడనే పిచ్చి ఆశలో వున్నట్టున్నావు. నేనే అతన్ని నా వశంలోకి తెచ్చుకొని నిన్ను అడ్డుపెట్టుకొని చిన్న నాటకమాడాను. నీమీది పిచ్చి ప్రేమతో నేను చెప్పినట్లే చేశాడు. ప్రస్తుతం పోలీస్టేషన్లో రెస్టు తీసుకుంటున్నాడు...." అన్నాడు.

నర్మద అదిరిపడింది. "ఏమిటి నువ్వు చెప్పేది? పోలీసు లేమిటి? అతన్ని అరెస్టు చెయ్యటమేమిటి? ఇది మరో నాటకమా?" అరిచింది.

"కాదు డియర్! నిజమే. నేనే స్వయంగా పోలీసులకి ఫోన్ చేశాను. పోలీసులు వచ్చేవరకు నేను అక్కడే వున్నాను.... నాకు దక్కని నువ్వు వాడికీ దక్కకూడదు. మరెవడికీ చిక్కకూడదు. వేలువిడిచిన మేనబావను నన్ను కాదని ఎవరో కోన్కిస్కాగాడిని ప్రేమించి పెళ్ళాడతావా? పొట్టకూటికోసం ఎక్కడ్నుంచో ఈ వూరొచ్చి గుమస్తా ఉద్యోగం చేసుకునే వాడిముందు నేను తీసిపోయానా? నా కసి తీరింది...." అని డూప్లికేట్ చక్రవర్తి ఏదో అంటుండగా వాణీనాథం ముందు కురికి, "నీ కసి తీరిందేమోగాని, నా కసి తీరలేదురా!" అంటూ అతని పీకపట్టుకున్నాడు.

అతని వెనకే జాన్సన్ ముందుకొచ్చి డూప్లికేట్

చక్రవర్తి చెంపలు శుద్ధి చేశాడు. ఇద్దరు కలిసి అతని ఒళ్ళు హూనం చేశారు.

వాణీనాధం కనిపించిన ఆనందంలో మైమరచిపోయిన నర్మద, "ఇక వదిలెయ్యండి, చచ్చిపోతాడు!" అనేవరకు యిద్దరు డూప్లికేట్ కి దేహశుద్ధి చేస్తూనే వున్నారు.

పిక్కబలం చూపించి పడుతూ లేస్తూ పారిపోయాడు డూప్లికేట్ చక్రవర్తి.

"మా మేనబావ వెంటూరావు" అని పోతున్న డూప్లికేట్ ని పరిచయం చేసి, "నన్ను క్షమించు వాణీ, నిన్నను మానించి అవమానించాను!" అన్నది నర్మద వాణీనాధం రెండు చేతులూ పట్టుకొని.

వాణీనాధం గట్టిగా ఆమె చేతులు పట్టుకొని ప్రేమగా, ఆర్తిగా ఆమె కళ్ళలోకి చూస్తూ తినకి ఎంతో మేలు చేసిన వసంతకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

—:అయిపోయింది:—

# ఎర్ర ఫైలు

## ప్రతాప రవిశంకర్

కల్పన వాకిట్లో నిలబడదు. వాకిట్లో నిలబడి బజారు మనుషుల్లా కష్టమర్ల కోసం ఎదురుచూడాల్సిన అవసరం ఆమెకు లేదు. అలా నిలబడటం కూడా ఆమెకు నచ్చదు.

ఆమెకు కొంతమంది రెగ్యులర్ కష్టమర్స్ వున్నారు. వాళ్ళు రాదల్చుకున్నప్పుడల్లా కల్పన దగ్గరకే వస్తూ వుంటారు.

వాళ్ళలో శివరావు కూడా ఒకడు.

శివరావు ఎక్కడో ఓ ప్రయివేటు ఫర్మ్‌లో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. అతను ఎర్రగా వుంటాడు— సన్నగా వుంటాడు. అతని చూపులు అమాయకంగా వుంటాయి—అయినా మనిషి చురుకయినవాడు.

ఎప్పుడూ తెల్లబట్టలే వేసుకుంటాడు. ఎప్పుడూ ఒకే రకం సిగరెట్లు మాత్రం కాల్చడు—ఒక్కోసారి ఒక్కో రకం సిగరెట్లను కాలుస్తాడు. అప్పుడప్పుడు కిళ్లీ వేసు కుంటాడు. వీలున్నప్పుడల్లా మందుకొడుతూ వుంటాడు.

శివరావు గురించిన మిగిలిన అన్ని విషయాలూ కల్పనకు తెలుసును. కానీ అతడికున్న చివరి అలవాటు గురించి ఆమెకు ఇంతవరకూ తెలీదు.

ఎందుకంటే ఇప్పటివరకూ అతను ఒక్కసారికూడా కల్పన దగ్గరకు మందుకొట్టి తూలుకుంటూ రాలేదు. అర్థంలేని వాగుడు వాగలేదు.

కల్పనకు శివరావు నచ్చాడు.

ఎందుకంటే—శివరావులో సు o ద ర o పోలికలు వున్నాయి. అందువల్లనే ఆమెకు అతను నచ్చాడు.

సుందరం ఎవరో చెప్పాలి—

అతన్ని ఆమె కాలేజీలో చదువుతున్న రోజుల్లో అజ్ఞాతంగా ప్రేమించింది. అతనికి చెప్పి ప్రేమించలేదు. చెబితే అతను ఏమనేవాడో మనకు తెలీదు. కల్పనక్కూడా తెలీదు.

కాని, కల్పన తన ప్రేమ గురించి అతడితో చెప్పలేదు. ఎందుకు చెప్పలేదంటే అందుక్కారణం విజయలక్ష్మి.

విజయలక్ష్మి కూడా కల్పన చదువుతున్న కాలేజిలోనే చదివింది. ఆమె కల్పనకంటే కొన్ని గంటలు ముందునించే సుందరాన్ని ప్రేమించటం మొదలుపెట్టిందనే నిజం కల్పనకు కొంచెం ఆలస్యంగా తెలిసింది.

ఆ నిజం తెలిసిన తర్వాత కల్పన తన ప్రేమ గురించి సుందరానికి చెప్పలేకపోయింది.

ఆ రోజునే విజయలక్ష్మికంటే కల్పన కొంచెం ముందుగా సుందరాన్ని ప్రేమించి వున్నట్లయితే ఈ రోజు కల్పన కథ ఇలా కష్టమర్లతో ముడిపడివుండేది కాదు.

ఇంకో రకంగా వుండేది.

ఆమె ఆలోచనలను చెదరగొడుతూ తలుపుమీద చిన్నగా టక్....టక్‌మని చప్పుడయ్యింది.

కల్పన ఒక్క వుదుటన్న బెడ్ మీదనించి లేచింది. అలా టక్....టక్....మని తలుపుమీద చప్పుడుచేసే ఆ మనిషి ఎవరో ఆమెకు తెలుసు.

ఆ మనిషి—

## 2

శివరావు!

"నువ్వే అనుకున్నాను" అన్నది కల్పన తలుపులు తెరిచి....

"ఎలా అనుకున్నావు? ఎంతోమంది వస్తూ వుంటారు కదా?" అన్నాడు శివరావు లోపలకు వచ్చి.

తలుపులను మూసి బోల్టు వేస్తూ "తలుపుమీద రెండే రెండుసార్లు టక్....టక్" అన్నది చిరునవ్వుతో—

"ఇంకెవరూ ఇలా కొట్టరా" కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

తలను అడ్డంగా ఊపింది కల్పన.

అతడి చేతిలో ఎర్రగా వెలుగుతున్న సిగరెట్టు వుంది. ఇంతకుముందెప్పుడు అతడి చేతిలో అలాంటి సిగరెట్టును చూడలేదు. అది చుట్టరంగులో వుంది.

గుప్పుమన్నది అతడి నోట్లోనించి బ్రాందీ వాసన.

ఆమె ఉలిక్కిపడింది.

"నువ్వు తాగుతావా?" ఆశ్చర్యంగా అడిగింది.

శివరావు నవ్వాడు. వెంటనే జవాబు చెప్పలేదు.

ఆమె అదే ప్రశ్న మళ్ళీ అడిగింది.

అప్పుడు "తెలియటంలేదా?" అన్నాడు.

"ఎన్నాళ్ళనించి?"

"గుర్తులేదు."

"ఇంతకు ముందెప్పుడూ తాగి రాలేదేం?"

"ఎప్పుడూ తాగిరాటానికి నేను మా బాస్‌నుకాదు. ఆయన దగ్గర పనిచేసే చిన్న ఉద్యోగిని. అందువల్ల ఆయన యెప్పుడూ తాగుతూ వుంటే నేను అప్పుడప్పుడు తాగుతూ వుంటాను. అప్పుడప్పుడు తాగినా అలా తాగినప్పుడు నీ దగ్గరకు రాలేదు. ఇప్పుడు వచ్చాను."

కల్పనకు ఏం మాట్లాడాలో తోచలేదు.

సుందరం తాగివుంటే తను సహించగలిగేదా? అని ఆలోచిస్తోంది ఆమె.

ఏమో! తెలీదు.

ఐనా శివరావు గురించి తను బాధపడవలసిన అవసరం యేమిటి? అతనికీ తనకీ యేమిటి సంబంధం?

ఆమె ఆ ఆలోచనల్లో మునిగిపోయినప్పుడు శివరావు అడిగాడు వున్నట్టుండి ఇలా!

"ఎన్నాళ్ళీ చిన్న చిన్న మొత్తాల సంపాదన? ఒకే సారి పెద్ద మొత్తంలో డబ్బు సంపాదించాలని నీకు లేదా?"

కల్పన ఉలిక్కిపడింది.

"ఏమిటి నువ్వనేది శివరావ్?" అన్నది.

అంతకుముందు అతనేమన్నాడో అదే ప్రశ్నను మళ్ళీ అడిగాడు.

"ఎందుకు? ఎంత పెద్ద మొత్తం?" అన్నది.

"ఐదు వేలు."

"ఐదు వేలా!"

"అవును. నువ్వు ఒప్పుకుంటే ఇంకో వెయ్యి యూపా

యలు ఎక్కువే. మొత్తం ఆరువేలు."

మళ్ళీ ఆశ్చర్యపడింది కల్పన.

"నేను ఒప్పుకోవటం అంటే యేమిటి? నేనేం చెయ్యాలి? ఆరువేల రూపాయలు సంపాదించిపెట్టే ఆ పని యెలాంటిది?" అనడిగింది కల్పన—కుతూహలంగా.

"ఇప్పుడు నేను నీ దగ్గరకు ఎందుకోసం వచ్చానను కున్నావ్? కల్పనా—ఈ పని నీ వల్లనే అవుతుందని నాకు నమ్మకం వుంది. అందుకే మరో మనిషికి ఈ పనిని అప్పగించదల్చుకోలేదు. ఇందుకు నమ్మకమైన మనిషి కావాలి. నీకంటే నాకు నమ్మకం వున్న మనిషి ఎవరు? చెప్పు....నువ్వు ఒప్పుకున్నట్లేనా?" అనడిగాడు.

కల్పన నవ్వింది—

"నేనేం చేయాలో చెప్పకుండా ఒప్పుకున్నట్లేనా? అనడిగితే నేనేం చెప్పగలను?" అన్నది.

"చెబుతాను. నువ్వు ఒప్పుకున్నానంటే చెబుతాను."

"కాదు. నువ్వు ముందు చెప్పు. ఏమిటా పని?"

"నామీద నమ్మకంలేదా?" శివరావు కొంచెం సీరియస్‌గా అడిగాడు.

"ఇందులో నమ్మకం గురించి ఏముంది శివరావ్? నాకు ఆ పని ఇష్టమయితే తప్పకుండా ఒప్పుకుంటాను. డబ్బు గురించీ కాదు. నువ్వు చెబుతున్నావని" అన్నది.

"వీల్లేదు. నువ్వు ఇబ్బందిలో ఇరుక్కునే పని ఐతే నేను నీకు చెప్పనుకదా. ముందుగా నువ్వు ఒప్పుకోవటం లేదంటే నీకు నామీద నమ్మకం లేదని అనుకుంటాను. నీకు ఇష్టమేనా?"

అతను నొచ్చుకున్నాడని కల్పనకు అర్థమయ్యింది. ఆమె మవునం వహించి ఆలోచనలో పడింది.

శివరావు గత కొన్ని నెలలుగా తనకు తెలుసు. అతని ప్రవర్తన తనని ఏ రోజూ ఇబ్బంది పెట్టలేదు. పైగా సుందరం పోలికలు కలిగివుండి తనని ఆకర్షించాడు. తను ఇష్టపడేలా చేసుకున్నాడు. అందుకని ఇప్పుడు తనేం చెయ్యాలి?

ఒప్పుకుంటే బావుంటుందా?

ఇంతకీ తను చెయ్యవలసిన ఆ పని యేమిటో?

సులభమైనది—రిస్కు లేనిదీ ఐ వుండదు.

ఎందుకంటే అంత సులభమైన పనికి ఆరువేలు ఇవ్వటానికి ఎవ్వరూ ఒప్పుకోరు.

ఐనా—శివరావు ఎందుకింత పట్టుదలగా వున్నాడు. తీరా ఆ పని గురించి చెప్పిన తర్వాత తను ఒప్పుకోదని భయమా?

భయమెందుకు?

తను ఒప్పుకోకపోతే మరొకరు. కేవలం ఈ అవకాశం మరో మనిషికి ఇవ్వకూడదనే శివరావు తనకు చెప్పానని అన్నాడు.

అంటే—మరొకరివల్ల కూడా ఆ పనేదో జరిగే అవకాశం కూడా వుందన్నమాట—కాబట్టి అంతగా రిస్కు లేని పనే ఐవుండాలి.

మళ్ళీ ఓ సిగరెట్టు వెలిగించి "నువ్వు అంతగా ఆలోచించాల్సింది ఏమీ లేదు కల్పనా. ఒప్పుకో" అన్నాడు శివరావు.

ఇక ఆలోచించలేదు కల్పన.

"సరే .... ఒప్పుకుంటున్నాను. చెప్పు....ఆరు వేల రూపాయలు సంపాదించటంకోసం నేనేం చెయ్యాలి?" అనడిగింది.

"థాంక్ యూ కల్పనా. థాంక్ యూ వెరీమచ్" అన్నాడు శివరావు సంతోషంగా.

"థాంక్స్ తర్వాత చెబుదువుగాని....ముందు నేను చెయ్యవలసిన పనేమిటో చెప్పు."

"చెబుతాను. కాని యిప్పుడు కాదు. రేపు రాత్రి ఇదే టైముకు వస్తాను. నేను వచ్చేసరికి నువ్వొక్కదానివే వుండు. అర్థమయిందనుకుంటాను" అంటూ నవ్వాడు శివరావు.

అతడ్ని ఆశ్చర్యంగా చూసింది కల్పన.

## 3

బల్లమీది టెలిఫోన్ మోగింది.

రిసీవర్ ఎత్తాడు దామోదరం—కుర్చీలో ముందుకు వంగి—

రిసీవర్ తీసుకుంటూనే మళ్ళీ ఛెయిర్‌లో వెనక్కు వాలుతూ "హలో..దామోదరాన్ని మాట్లాడుతున్నాను" అన్నాడు.

"నమస్తే.... నేను కనకారావును మాట్లాడుతున్నాను."

కనకారావు గొంతు వినటంతోనే దామోదరం మొహంలో రంగులు మారిపోయాయి.

"నువ్వా! యెందుకు ఫోన్ చేశావ్?" సీరియస్‌గా అడిగాడు.

"మీకు తెగియనిది ఏముంది? మిమ్మల్ని మళ్ళీ ఓసారి కలుసుకోవాలని అనుకుంటున్నాను. ఎక్కడ కలుసుకోమంటారో తెలుసుకోటానికి ఫోన్ చేశాను."

దామోదరం సీరియస్‌గానే నవ్వి "నీకింకా ఆశ చావలేదనుకుంటాను. నా సంగతి నీకు తెలీదు. ఐతే నేను

ఎంత సిన్సియర్ ఆఫీసర్లో ఇంతకుముందు నేను వర్కు చేసిన వూళ్ళకు వెళ్ళి ఎంక్వయిరీ చేసుకో" అన్నాడు

"క్షమించండి. మీరు ఎంత సిన్సియర్ ఆఫీసర్ ఐనా ఊబిలో దిగబడినప్పుడు బయటపడే మార్గాన్ని వెతుక్కోక తప్పదుకదా? చెప్పండి. మిమ్మల్ని యెప్పుడు ఎక్కడ కలుసుకోమంటారో..మీరు కాదన్నా మిమ్మల్ని కలుసుకోక తప్పదు" అన్నాడు కనకారావు మొండిగా.

అతని మొండితనం దామోదరానికి అంతగా ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఎందుకంటే కనకారావు గొంతు వరకు దిగివున్నాడు కాబట్టి ఎంత మొండితనాన్నయినా చూపుతాడని ఆయనకు తెలుసు.

అందుకే, "సారీ కనకారావ్...నువ్వు నన్ను కలుసుకోలేవు. నన్ను కలుసుకున్నా నీతో నేను మాట్లాడను. నిన్ను అంత సులభంగా నేను వదలదల్చుకోలేదు" అంటూ రిసీవర్‌ను హుక్ మీద వుంచాడు.

వుంచేసి సిగరెట్ టిన్ అందుకుని ఓ సిగరెట్టును వెలిగించి పొగ వదిలాడు.

పొగ వదులుతూ కుర్చీలో వెనక్కు వాలి కనకారావు గురించి ఆలోచించాడు.

కనకారావ్ పెద్ద కంట్రాక్టరు. కాని గొప్ప మోసగాడు. ఒక వంతెన కంట్రాక్టును ఎనిమిది లక్షలకు తీసుకున్నాడు. అది పూర్తయ్యింది. డబ్బు పూర్తిగా చెల్లించకుండా వర్షాలుకూడా రాకముందే వంతెన కూలిపోయింది. ఎవరో కనకారావు ఆ వంతెనకు కనీసం లక్ష రూపాయలుకూడా ఖర్చు పెట్టలేదనీ మోసం చేశాడనీ పిటిషన్ పెట్టారు. ప్రభుత్వం దామోదరాన్ని ఎంక్వయిరీ ఆఫీసర్ గా వేసింది.

దామోదరం ఎంక్వయిరీ చేశాడు. కనకారావు చేసిన మోసాన్ని తెలుసుకొని రిపోర్టు తయారుచేశాడు. ఇంకా ఆ రిపోర్టును ప్రభుత్వానికి పంపించలేదు. ఆ రిపోర్టు ప్రభుత్వానికి చేరితే కనకారావ్ పని అవుటయిపోతుంది. అతను ఎన్నో యేళ్ళు జైలు జీవితాన్ని గడపవలసి వుంటుంది.

అందుకే కనకారావ్ డబ్బుతో దామోదరాన్ని కొనాలని ప్రయత్నం చేశాడు. కాని దామోదరం అతడికి లొంగలేదు. అతన్ని జైలుకు పంపించటమే తన ధ్యేయం అన్నాడు.

ఇందుకు కొంత పాత కథ వుంది.

ఆ కథ తర్వాత.

కర్టెన్ తొలగించి ఆఫీసు విమల లోపలకు వచ్చింది. ఆమె చేతిలో ఓ కాయితం వుంది.

ఏమిటన్నట్టు చూశాడు.

"ఒక్క రోజుకు లీవు కావాలి సర్" చిరునవ్వుతో ముందుకు ఒంగుతూ కాయితాన్ని దామోదరానికి అందించింది.

అప్పుడామె పమిట జారింది.

దాన్ని ఆమె కొంచెం ఆలస్యంగా సర్దుకుంది.

దామోదరం దగ్గర లీవు గ్రాంట్ కావాలంటే అలా పమిట జారక తప్పదు.

అతడు నవ్వుతూ "ఇక నువ్వు వెళ్ళు....నువ్వు లీవును ఎక్స్‌టెండ్ చెయ్యకూడదు" అన్నాడు.

తలూపి ఆయనకు థాంక్స్ చెప్పి వెళ్ళిపోయింది విమల.

ఎలాంటి మనిషికయినా ఏదో ఒక బలహీనత వుం

టుంది. ఐతే ఆ బలహీనత కొంతమందికి వాళ్ళ కంట్రోల్ లోనే వుంటుంది. దామోదరానికి అందమైన ఆడదాన్ని చూస్తే వళ్ళు మరచిపోయే బలహీనత వుంది. అలాగని కన్నుగీటేసి ప్రతి ఆడదాని మీదకు ఎగబడేంత బలహీనత లేదు. ఆ యువతి అతడి హృదయాన్ని కదిలించాలి.

అతడి హృదయాన్ని కదిలించే ఆడదానికోసం దామోదరం ఎంత దూరమైనా పరుగులు తీస్తాడు.

అలాంటి ఆడది ఎవరు?

కల్పన కావచ్చునా??

## 4

సరిగ్గా చెప్పిన టైముకు రాలేదుకాని ఓ పదినిమిషాలు ఆలస్యంగానే వచ్చాడు శివరావు.

వస్తూనే లోపల యెవ్వరూ లేనందుకు సంతోషపడ్డాడు.

"నీకోసమే ఎదురుచూస్తున్నాను" అన్నదామె అతడు లోపలకు రాగానే.

"ఎందుకు యెదురుచూడటం? నేను తప్పకుండా వస్తానని చెప్పానుకదా?" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"అందుకే.... సరే .... చెప్పు .... నేను చెయ్యవలసిన పనేమిటో ఈ రోజున చెబుతానని అన్నావు కదా?" అన్నది కల్పన కుతూహలాన్ని అదిమిపట్టలేక.

రాత్రి శివరావు వెళ్ళిన దగ్గర్నించీ ఆమె ఆ విషయం గురించే ఆలోచిస్తూ వుండిపోయింది.

"అంత తొందరెందుకు? నేనొచ్చింది నీకు ఆ పనేమిటో చెప్పటానికే.... ఇదిగో ముందు ఈ ఫోటో చూడు" అన్నాడు షర్టు జేబులోనించి కాయితంలో చుట్టిన ఓ మనిషి ఫోటో తీసి ఇస్తూ.

కల్పన ఆ ఫోటోని ఆశ్చర్యంగా చూసి "ఎవరిదీ ఫోటో?" అనడిగింది.

"ఓ స్ట్రిక్ట్ ఆఫీసర్ ది. పేరు దామోదరం. వయసు యాభై ఒకటి" అన్నాడు సిగరెట్టు ముట్టిస్తూ.

"ఈ ఫోటో నాకెందుకు?"

"నీ ఆల్బంలో పెట్టుకోమని ఇవ్వలేదు. ఈ ఫోటోలో వున్న మనిషిని బాగా గుర్తుపెట్టుకో.... నువ్వు చెయ్యబోయే పని ఈ మనిషితోనే ముడిపడి వుంది" అన్నాడు.

"ఈయనతోనా?" శివరావును చూస్తూ అడిగింది.

"అవును. దామోదరాన్ని నువ్వు ప్రేమించాలి."

"ఈయన్నా....ఆయనకు నా తండ్రి వయసు వుంది."

"నిజమే....ఇలాంటి సెంటిమెంట్లు పెట్టుకుంటే నీకు ఆరువేలు కాదు, ఆరు రూపాయలు కూడా రావు.... నేను చెప్పినట్టు విను. ప్రేమించటం అంటే నిజంగా ప్రేమించటం కాదు. ప్రేమించినట్టు ఆయన మీద నీకు ఇష్టం వున్నట్టు నటించాలి."

"నటించటం నాకు చేతకాదు" అన్నది కల్పన.

"అలా అంటే కుదరదు. నువ్వు నటించాలి. ఇంత మంది మనుషుల ఇష్టానికి అనుగుణంగా నడుచుకుంటున్న నీకు నటించటం అంత కష్టమని నేను అనుకోను. సరే. తర్వాత నువ్వేం చెయ్యవలసిందీ చెబుతాను. నువ్వు రేపే దామోదరాన్ని ఆయన ఆఫీసులో కలుసుకో. ఆయన ఆఫీసు యెక్కడో ఎలా వెళ్ళాలో తర్వాత చెబుతాను.

ఆఫీసులో కలుసుకొని కొంచెం దీనంగా మొహం పెట్టి నీ భర్త క్రూరుడనీ, దుర్మార్గుడనీ అతను పెట్టే నరకాన్ని భరించలేక అతన్ని వదిలి వచ్చేశాననీ చెప్పు. అందువల్ల బతకటానికి నీకో ఉద్యోగం అవసరమనీ అడుగు. నీ

అందం చూసి దామోదరం తప్పకుండా చలించిపోతాడు. అలాగేనని తప్పకుండా నీకు సహాయపడతాననీ చెప్పి నిన్ను మళ్ళీ యెక్కడ కలుసుకోవలసిందీ చెబుతాడు. అలా చెప్పిన తర్వాత నువ్వు వచ్చెయ్యి. జరిగిందంతా రేపు రాత్రి నాతో చెప్పు. ఆ తర్వాత మళ్ళీ నువ్వు ఏం చెయ్యవలసిందీ చెబుతాను" అన్నాడు శివరావు.

అతను చెప్పినదంతా విన్న తర్వాత అదంతా ఏదో రిస్కీ వ్యవహారమనిపించింది కల్పనకు.

అందుకే "ఇదంతా గొడవగా వుంది. ఈ పని నేను చెయ్యను. నాకు ఆరువేలు అవసరంలేదు. ఈ వృత్తి మీదనే నేను ఆ డబ్బును సంపాదించుకుంటాను" అన్నది.

శివరావు అదిరిపడి "కల్పనా....నీకు పిచ్చి పట్టలేదు కదా" అన్నాడు కంగారుగా.

"లేదు. ఇలాంటి నటనలు నాకు నచ్చవు."

"ప్లీజ్ ....నా మాట విని ఒప్పుకో....నువ్వు నేను చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకుంటానని మాటిచ్చావు."

"సారీ....శివరావ్....అన్న మాటమీద నిలబడటానికి నేను పతివ్రతనుకాను. పదిమందికి శీలాన్ని అమ్ముకునే దాన్ని. నేను మాట తప్పినా తప్పులేదు."

మరీ అంత మొండిగా కల్పన మాట్లాడుతుందని శివరావు వూహించలేదు. అతనికి కల్పనను ఎలా ఒప్పించాలో అరంకాలేదు.

"సరే. ఐతే నేను వెళతాను" అని లేచి నిలబడ్డాడు.

"ఎక్కడికి? అప్పుడే వెళుతున్నావా?"

"అవును. ఈ పని చాలా ముఖ్యమైనది. నువ్వు ఒప్పుకోనప్పుడు మరో మనిషిని వెతుక్కోవాలి. ఐతే ఒక్క విషయం. ఇక నువ్వు ఈ శివరావును మరచిపోవచ్చు. నీ

దృష్టిలో శివరావు చచ్చిపోయాడు" నిలబడే అన్నాడు.

"అంత మాటలనకు శివరావ్" అన్నది కల్పన కంగారుగా.

"అవును. అంటాను కల్పనా....నువ్వు ఎలాంటిదానివైనా నీకు మనసుందని ఆ మనసులో నేనంటే ప్రేమ వుందనీ ఇన్ని రోజులనించీ అనుకునే నీ దగ్గరకు వస్తున్నాను. నా అంచనా తప్పని ఇప్పుడే తెలిసింది నామీద నీకు లక్ష్యంలేదు. నన్ను మరచిపో" అన్నాడు ముందుకు కదిలి.

కల్పనకూడా నిలబడి "ఆగు....ఈ పని గురించి నువ్వింత పట్టుదలగా ఎందుకు వున్నావో నాకు అర్థం కావటంలేదు శివరావ్? అసలు ఇదంతా యెందుకు? ఇందువల్ల నీకు కలిగే ప్రయోజనం ఏమిటి?" అన్నది.

శివరావ్ ప్రేమగా చూసి కల్పన కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "కల్పనా....నువ్వు ఆడే నాటకంమీదనే నా భవిష్యత్తు ఆధారపడి వుంది. నీ నాటకం ఫలిస్తే నాకు ఉద్యోగంలో మేనేజర్ గా ప్రమోషన్ వస్తుంది. జీతం-హోదా అన్నీ పెరుగుతాయి. అందుకోసమే నేనింతగా బాధపడటం....అందుకే నా మాట కాదనకు కల్పనా" అన్నాడు.

అతను ఇంతకుముందు యెప్పుడయినా నాటకాల్లో నటించాడేమో అనే సందేహం కల్పనకు కలగలేదు. అందుకే అతడి కళ్ళలో తనపట్ల కనపడుతున్న ఆరాధనను చూసి మవునంగా తలవూపి "సరే....చెప్పూ....ఆ తర్వాత ఏం చెయ్యాలి?" అన్నది చిన్నగా.

అప్పుడిక శివరావు మొహం దారుణంగా వెలిగిపోయింది.

అతను వెంటనే మాట్లాడకుండా ఆమెను దగ్గరగా తీసుకుని ఆమె పెదిమలమీద సున్నితంగా ముద్దు పెట్టుకుని మళ్ళీ మొదలు దగ్గర్నించి కల్పన ఏం చెయ్యవలసిందీ, ఎలా చెయ్యవలసిందీ చాలా క్లియర్‌గా చెప్పాడు కార్య దీక్ష ధ్యేయంగా పెట్టుకున్న శివరావ్.

తనకు ఆ మాటలన్నీ చెబుతున్నది సుందరమనే భావించుకుంది కల్పన.

ఆమె ఆడే ఆ నాటకం పర్యవసానం ఎలా వుంటుంది? అందులో శివరావు పాత్ర యేమిటి??

## 5

"మీకోసం ఎవరో వచ్చారు?"

అటెండర్ లోపలకు వచ్చి చెప్పాడు దామోదరంతో.

ఏవో కాయితాలమీద సంతకాలు పెడుతున్న దామోదరం తలెత్తి "ఎవరు?" అనడిగాడు.

"ఎవరో యువతి."

"యువతా?!" అన్నాడు దామోదరం కొంచెం ఆశ్చర్యంగా. అతనికి గుర్తుండి అతనితో పని వుండి యువతులెవ్వరూ ఆఫీసుకు రాలేదు.

అందుకే "ఎలా వుంది?" అనడిగాడు.

మొదట కొంచెం సందేహించినా అటెండర్ తర్వాత ఆ యువతిని వర్ణించి చెప్పాడు.

అందంగా వుంటుందని విన్న తర్వాత "లోపలకు రమ్మను" అన్నాడు.

ఇక అతను సంతకాలు చెయ్యటం ఆపి డోర్ కేసి చూస్తూ కూర్చునాడు.

ఒకే ఒక్క నిమిషం దాటిన తర్వాత కర్టెన్ తొల

గించుకొని లోపలకు వచ్చిన ఆ యువతి దామోదరానికి నమస్కారం పెడుతూ "నా పేరు కల్పన" అన్నది.

ఆమె అందం మొదటి చూపులోనే దామోదరాన్ని కదిలించివేసింది. ముఖ్యంగా విశాలంగా వున్న ఆమె కళ్ళు, ఎర్రగా వున్న ఆమె పెదవులు అతడిని అమితంగా ఆకర్షించాయి.

"కూర్చో" అన్నాడు.

ఆమె అతడి యెదురుగా వున్న కుర్చీలో కూర్చుని నెమ్మదిగా తన మొహాన్ని విచారంగా మార్చుకున్నది.

"నువ్వెవరో నాకు తెలీదు. ఇంతకుముందెప్పుడూ నిన్ను చూసిన గుర్తు కూడా లేదు. వినా నువ్వు నన్ను వెతుక్కుంటూ ఎందుకు వచ్చావు? నాతో నీకేమిటి పని?" అని అడిగాడు దామోదరం సిగరెట్టును వెలిగించబోతూ.

"నా పేరు కల్పన అని చెప్పానుకదా! నాకు పెళ్ళయ్యింది. కాని నా భర్త దుర్మార్గుడు, క్రూరుడు. తాగి వచ్చి రోజూ నన్ను హింసించేవాడు. ఆయన దగ్గరే వుంటే నేను చచ్చిపోతాననే భయంతో ఆయన్ని వదిలి ఈ ఊరు వచ్చేశాను. ఒంటరిదాన్ని. ఏదో ఒక ఉద్యోగం చెయ్యకుండా ఎలా బతగ్గలను? అందుకే మీ దగ్గరకు వచ్చాను. నాకు మీరే ఓ దారి చూపాలి...." అన్నది కల్పన పీలైనంత ఎక్కువ విచారంగా.

ఆమెకు సమయానికి కన్నీళ్ళు రాలేదు. కాని కన్నీళ్ళు తప్పకుండా వచ్చితీరాలని శివరావు చెప్పిన మాటలు గుర్తుకువచ్చి విషాదంతో దామోదరాన్ని చూడలేక పోతున్నట్టుగా తలవంచుకుంటూ వేలితో చిన్నగా కంట్లో పొడుచుకున్నది.

తిరిగి తలెత్తింది.

ఆమె కళ్ళనించి కారుతున్న నీళ్ళను చూసిన తర్వాత దామోదరానికి — కల్పన నటిస్తున్నదనే అనుమానం రాకపోగా ఆమెమీద జాలి కలిగింది. ఆమె తననే నమ్ముకుందనే ఆలోచన కలిగింది.

అంతేకాని—

దేశంలో ఇంకెవ్వరూ ఆఫీసర్లు లేరా?

ఎవ్వరూ లేనట్టుగా ఈ కల్పన అనే అందమైన ఆడది తన దగ్గరకే యెందుకు వచ్చింది?

అసలు తన దగ్గరకు వెళ్ళమని ఈమెకు చెప్పిన మనుషులు ఎవరు??

—అనే అనుమానాలేవీ రాలేదు.

కల్పన చూపులు—నటన—ఆమె అందం అతనికి అనుమానాలను రానివ్వలేదు.

అందువల్లనే దామోదరం "ప్లీజ్ .... కల్పనా.... ఏడ్వకు. నీలాంటి అందమైన యువతి మొహంలో కన్నీటిని నేను యెక్కువసేపు చూడలేను. అందువల్ల నువ్వు ఏడ్వటం ఆపి మామూలుగ వుండు. నీ కథ నన్ను కదిలించివేసింది. విచారపడకు. ధైర్యంగా వుండు.... నేను వున్నాను. ఐయామ్ హియర్" అన్నాడు దామోదరం చివరగా ఇంగ్లీషులో....

అతనంతగా చెప్పిన తర్వాత ఇక కన్నీళ్ళను అదే పనిగా తెప్పించటం బావుండదని కర్చీఫ్‌నుతీసి తుడుచుకుంది. కాని అవి వేలితో పొడవటంవల్ల వస్తున్న కన్నీళ్ళు కాబట్టి వెంటనే ఆగిపోలేదు.

"థాంక్సండీ .... మీరు ధైర్యంగా చెబుతున్నారు కాబట్టి నేను ధైర్యంగా వుంటాను" అన్నది యెలాగో కన్నీళ్ళను ఆపి.

"అలా వుండాలి.... ఇంతకీ నీ క్వాలిఫికేషన్లు ఏమిటి?" అనడిగాడు.

చెప్పింది కల్పన.

"గుడ్. డిగ్రీ పూర్తి చేశావంటే తప్పకుండా నీకు ఏదో ఒక ఉద్యోగం ఇప్పించగలను. ఈ విషయం గురించి నా మిత్రులతో మాట్లాడాలి. అందువల్ల ఇప్పుడే నీకు నేనేమీ చెప్పలేను. నువ్వు ఈ రోజు సాయంత్రం ఆరు గంటలకు గార్డెన్ రెస్టారెంట్ దగ్గర నన్ను కలుసుకో. అప్పుడు నీకు అన్ని విషయాలూ చెబుతాను."

నిల్చుని అప్పుడు ఎంతో వినయంగా కల్పన ఆయనకు నమస్కరించి థాంక్స్ చెప్పి నొప్పి పెడుతున్న కన్నుతో ఆ గదిలోనించి బయటకు వచ్చింది—తను బాగా నటించానన్న తృప్తితో.

దామోదరం చెప్పినట్లుగానే ఆ సాయంత్రం కల్పన అతన్ని గార్డెన్ రెస్టారెంట్ దగ్గర సరిగ్గా ఆరుగంటలకే కలుసుకుంది.

అప్పుడు దామోదరం "హసీనా గ్లాస్ ఫాక్టరీ మేనేజర్‌తో మాట్లాడాను నీ గురించి. అతను తప్పకుండా నీకు ఉద్యోగం ఇస్తానని అన్నాడు" చెప్పాడు.

సంతోషంగా "మీకు యెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీటంలేదు" అన్నది కల్పన.

"నీకు తెలీకపోతే నేను చెబుతాను. సరిగ్గా మూడు రోజుల తర్వాత నాలుగో రోజు ఉదయం మా ఇంట్లో అంతా మా బంధువుల ఇంట్లో ఫంక్షన్‌కు వేరే వూరు వెళతారు. ఇంట్లో నేనొక్కడినే వుంటాను. ఆ రాత్రి తొమ్మిదిగంటలకు నువ్వు మా యింటికి వస్తే నాకెలా కృతజ్ఞతలు చెప్పాలో నీకే తెలుస్తుంది" అన్నాడు.

వెంటనే కల్పన ఆశ్చర్యపడినట్టుగా నటించి తను అలాంటి మనిషి కాదన్నట్టుగా కొంచెం బెట్టు చేసింది. దామోదరం మరోసారి చెప్పేసరికి "సర్లెండి.... నాకింత సహాయం చేస్తున్నప్పుడు, మీకోసం మీ కోరికను తీర్చకుండా యెలా వుంటాను? ఈ ఒక్కసారికీ మీ కోరిక తీరుస్తాను" అన్నది ఆమె.

దామోదరం అంతులేకుండా సంతోషపడిపోయి కొంచెం అటూ ఇటూ వూగి మరోసారి కల్పనతో ప్రమాణం చేయించుకొని వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి శివరావు కలియగానే జరిగిందంతా చెప్పేసింది. అతనామెను గొప్పగా పొగిడి ఆ తర్వాత ఏం చెయ్యాలసిందీ చెప్పి వెళ్ళిపోయాడు.

శివరావు ఆ ఇంట్లోనించి బయటకు వెళ్ళిన ఐదు నిమిషాలకే?

## 6

ఎవరో తలుపులను నెట్టిన శబ్దమయ్యింది.

టక్....టక్....మని కాదు. అందువల్ల తప్పకుండా ఆ మనిషి ఎవరో శివరావు అయివుండడనే అనుకుంది.

ఇంకెవరో పాత కష్టమర్ ఐవుంటాడు.

తలుపు తెరిచింది కల్పన. వాకిట్లోనే నిలబడివున్నాడో మనిషి. ఆ మనిషి మొహంమీద అక్కడికి దగ్గరిలోనే వున్న వీధి దీపం వెలుతురు పడుతోన్నది.

ఆ వెలుతురులో ఆ మనిషిని క్షణాలమీద గుర్తించి "సుందరం....నువ్వా!?" అన్నది కల్పన ఆశ్చర్యంగా, సంతోషంగా.

అతను మవునంగా తల వూపాడు అక్కడే నిల్చుని. కల్పన షాక్ నించి తేరుకొని "లోపలకురా" అన్నది.

సుందరం లోపలకు వచ్చాడు.

మొదట్లో హఠాత్తుగా అతన్ని చూస్తూనే శివరా వేమోననుకుంది. కాని శివరావు కొంచెం సన్నగా వుంటాడు. కాని సుందరం అతనికంటె లావుగా వున్నాడు.

"కూర్చో.... నేనిక్కడ వున్నట్టు నీకెవరు చెప్పారు?" అని అడిగింది తను అతని యెదురుగా కూర్చుంటూ.

"ఎవరూ చెప్పలేదు. నేనే నిన్ను వెంటాడి తెలుసుకుని వచ్చాను" అన్నాడు సుందరం.

"నన్ను వెంటాడావా!"

"అవును. నువ్వు ఉదయం మా ఆఫీసులోనించి వెళ్ళి పోతున్నప్పుడు చూశాను. ఆ తర్వాత నువ్వు మా ఆఫీసర్ దామోదరం గార్డెన్ రెస్టారెంట్ దగ్గర మాట్లాడుకోవటం చూశాను. ఆ తర్వాత మీ యిద్దరూ విడిపోగానే నిన్ను అనుసరించి ఇక్కడికి వచ్చాను."

కల్పన అంతా విని "మరి లోపలకు రాలేదేం?" అని అడిగింది.

"వచ్చేవాడినే .... కాని ఇంతలోనే శివరావు ఈ ఇంట్లోకి రావటం చూశాను. అతను బయటకు వెళ్ళే వరకు కాచుకుని ఇప్పుడు వచ్చాను."

"శివరావు నీకు తెలుసా?!"

"తెలుసు. కాని పరిచయంలేదు."

"నువ్వు ఈ వూళ్ళోనే దామోదరం ఆఫీసులో పని చేస్తున్నావని నాకు తెలీదు. మనం కలుసుకొని చాలా రోజులయ్యింది. కాలేజీనించి విడిపోయిన తర్వాత మనం కలుసుకోలేదు" అన్నదామె.

"అవును. ఇప్పుడు కూడా నువ్వు మా ఆఫీసుకు

రాకుండా వున్నట్లయితే ఈ వూళ్ళోనే నువ్వుంటున్నట్టు నాకు తెలిసే అవకాశంలేదు. ఇంతకీ నువ్వు మా ఆఫీసర్ దామోదరాన్ని యెందుకు కలుసుకున్నావ్? ఆయనతో నీకు ఇంతకుముందు పరిచయం వుందా?" అవడిగాడు సుందరం.

"పరిచయంలేదు. నేను పరిచయం చేసుకుని నాకు యేదయినా ఉద్యోగం యిప్పించమని అడగటానికి వచ్చాను."

"నీకు ఉద్యోగమా! అంత అవసరం యేమొచ్చింది?"

"అవసరం వచ్చింది" అంటూ కాలేజీనించి పోయిన తర్వాత తన జీవితం ఎటువంటి మలుపులను తిరిగి చివరికి తను యెటువంటి జీవితాన్ని గడుపుతున్నదో అతనికి చెప్పేసింది.

అంతా వినగానే సుందరం షాకై పోయాడు.

"ఐయామ్ సారీ .... నువ్విలాంటి చీకటి బతుకును గడుపుతున్నావని నాకు తెలీదు. ఆ రోజుల్లో నువ్వు నన్ను ప్రేమించావనికూడా నాకు తెలీదు. తెలిసినట్లయితే ఏంచేసి వుండేవాడినో నాకు తెలీదు. యెందుకంటే నువ్వనుకుంటున్నట్టుగా అప్పట్లో నేను ప్రేమించిన విజయలక్ష్మిని చేసుకోలేదు."

"నిజమా!"

"అవును."

"కొన్ని రోజుల తర్వాత విజయలక్ష్మికి మరో యువకుడితో పరిచయం జరిగింది. అతను నాకంటే అందమైనవాడు. యెక్కువ ధనవంతుడు. అతడితో తిరగటం మొదలు పెట్టింది. తర్వాత నన్ను వదిలేసింది. అందుకే నేను కస్తూరిని చేసుకున్నాను."

అప్పుడు కల్పనకు చెప్పలేనంత ఏడుపుముంచుకువచ్చింది. తన ప్రేమను తనలోనే అణుచుకుని యెంత పొరపాటు చేసిందో అప్పుడామెకు బాగా అర్థమయ్యింది.

"సరే కల్పనా....జరిగిందేదో జరిగింది. నీ కథ విన్న యే మనిషైనా నీకు సహాయం చెయ్యకుండా వుండ లేడు. దామోదరం నీకు తప్పకుండా సహాయపడతాడు. నీకోసం ఆయనతో నేను కూడా మాట్లాడతాను" అన్నాడు సుందరం.

అతడ్ని చూడటంతోనే కల్పన మనసంతా అదోలా అయిపోయింది. ఒకప్పుడు తను అజ్ఞాతంగా ప్రేమించిన మనిషి. ఇష్టపడిన మనిషి.

అతనికి తను అబద్ధం చెబుతోంది....

కల్పనకు అలా చెప్పటం ఇష్టంలేక "సుందరం.... నేను ఉద్యోగంకోసం దామోదరాన్ని కలుసుకోలేదు. అదంతా నాటకం" అన్నది.

"నాటకమా?!" ఆశ్చర్యంగా అడిగాడు సుందరం.

"అవును. ఈ నాటకాన్ని శివరావు ఆడమన్నాడు. అందుకోసం ఆరువేల రూపాయలుకూడా ఇస్తానన్నాడు."

"నాకేమీ అర్థం కావటం లేదు. దేనికోసం నాటకం?"

శివరావు ప్లానంతా సుందరంతో చెప్పేసింది కల్పన.

అంతా విని సుందరం "మై గాడ్. యెంత పెద్ద ప్లాను. ఆ ఎర్ర ఫైలును దామోదరం ఇంట్లో నించి మాయం చెయ్యటానికి కంట్రాక్టర్ కనకారావు— శివరావుచేత ఇంత నాటకం ఆడిస్తున్నాడా?" అన్నాడు.

"అవును. నేను ఒప్పుకోలేదు. కాని శివరావు బల వంత పెట్టాడు. ఆ నాటకం ఫలిస్తే తనకు మేనేజర్ గా

ప్రమోషన్ వస్తుందని అన్నాడు. అందుకే ఒప్పు కున్నాను."

"కల్పనా .... నువ్వు నాకు ఈ నాటకం గురించి చెప్పటం మంచిదే అయ్యింది. శివరావు తన స్వార్థానికి నిన్ను ఉపయోగించుకుంటున్నాడు. నువ్వు నీ నాటకాన్ని ఇంతటితో ముగించు. దామోదరం ఇంట్లోనించి నువ్వు ఆ ఎర్ర ఫైలును తీసుకురావటానికి వీల్లేదు."

"ఎందుకు? ఆ ఎర్ర ఫైలులో ఏముంది?"

"శివరావ్ బాస్ కంట్రాక్టర్ కనకారావ్ చేసిన పాపాలన్నీ వున్నాయి. ప్రభుత్వాన్ని అతనెంత దారుణంగా మోసంచేసి యెన్ని లక్షలు దోచుకున్నాడో అన్నీ వివరంగా దామోదరం రిపోర్టు రాశాడు. ఆ రిపోర్టు ఎర్ర ఫైలులో వుంది. అందుకోసమే కనకారావ్ ఈ పనిని గురించి శివరావుకు అప్పగించాడు. అతను దాన్ని నీద్వారా సాధించాలని చూశాడు....ప్లీజ్, నువ్వు ఆ పని చెయ్యకు కల్పనా" అన్నాడు సుందరం.

కల్పన సందిగ్ధంలో పడిపోయింది.

"నువ్వింకేమీ ఆలోచించవద్దు. దామోదరం గురించి మరిచిపో....కల్పనా.... దామోదరం దగ్గర్నించి నువ్వు ఎర్ర ఫైలును తీసుకురావటమంటే ఒక రకంగా నువ్వు నా పగ తీరకుండా చెయ్యటమే అవుతుంది" అన్నాడతను మళ్ళీ.

"నీ పగా! ఆ ఎర్ర ఫైలుకు నీకు ఏమిటి సంబంధం?"

"ఉంది. మొదట్లో నేను కొన్ని రోజులు కంట్రాక్టర్ కనకారావ్ దగ్గర ఇప్పుడు శివరావ్ చేస్తున్న ఉద్యోగాన్నే చేశాను. అప్పుడు ఒకటి రెండుసార్లు కనకారావ్ మా యింటికి వచ్చాడు. వాడి చూపు నా భార్య కస్తూరి

మీద పడింది. కొన్ని నెలల తర్వాత నా జీతం పెంచ మనడిగాను. అందుకు వాడు నా భార్యను ఓ రాత్రి వాడి దగ్గరకు పంపిస్తే రెండొందలు ఒకేసారి పెంచు తానని అన్నాడు. అంతే. వాడిని యెగిరి తన్నాను. ఆ తర్వాత వాడు నన్ను నలుగురు మనుషులచేత కొట్టించాడు. వాడి దగ్గర ఉద్యోగం మానేశాను. ఇదీ కథ. అప్పుడే వాడిని అంతం చెయ్యాలని పగబట్టాను. ఇప్పుడు నాకు ఆ అవకాశం వచ్చింది.

ఆ ఎర్ర ఫైలును నేనే దగ్గరుండి మా ఆఫీసర్ దామోదరంతో తయారుచేయించాను. కనకారావ్ చేసే మోసాలను దామోదరంతో నేనే చాలా చెప్పాను. వాట న్నింటి ఫలితమే ఆ ఎర్ర ఫైలు. అందులో ఇంకొక్క రిపోర్టు రాయవలసి వుంది. ఆ తర్వాత దామోదరం ఆ ఎర్ర ఫైలును ప్రభుత్వానికి అందజేస్తాడు. ఆ తర్వాత కనకారావ్ జైలుకు వెళ్ళటంలో సందేహంలేదు. అప్పుడు నా పగ చల్లారుతుంది. అందుకే కల్పనా నువ్వు నీ నాటకాన్ని ముగించు. అలా కాని పక్షంలో నీ నాటకం గురించి దామోదరంతో నేను ఈ రాత్రికే చెబుతాను. దామోదరం ఈ సంగతి తెలిసిందంటే వూరుకోడు. నిన్ను కూడా ఏమైనా చెయ్యొచ్చు."

ఆ కథంతా విన్న తర్వాత కల్పన ఆ ఎర్ర ఫైలును తీసుకువచ్చే ఆలోచనను వదులుకుంది.

సుందరానికి కనకారావ్ ఇంత ద్రోహం చెయ్యాలని చూశాడా? అలాంటి ద్రోహికి తను ఆరువేల రూపాయల కోసం సహాయపడుతుందా?

ఊహుఁ. తను ఇక ఆ పని చెయ్యదు.

అందుకే—"సుందరం....ఆ ఎర్ర ఫైలు వెనుక ఇంత కథ వుందని నాకు తెలీదు. నాకు నీ పగ తీరటమే ముఖ్యం. అందుకోసం ఆరువేలకే కాదు. యెంత డబ్బైనా వదులుకుంటాను. ఆ ఎర్ర ఫైలు తీసుకురాను" అన్నది.

ఆమెకి థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు సుందరం.

## 7

రెండో రోజు రాత్రి శివరావు వచ్చాడు కల్పన దగ్గరికి.

"ఎల్లుండి రాత్రితో నీ నాటకం ముగుస్తుంది. నీకు ఆరువేలు అందజెయ్యబడతాయి. యేమైనా నువ్వు బాగా నటిస్తున్నందుకు అభినందిస్తున్నాను" అన్నాడు మెచ్చుకుంటూ.

"నీ అభినందనలు అవసరంలేదు. నా నాటకం ఎప్పుడో ముగిసిపోయింది. ఇంక ఏమీ లేదు" అన్నది కల్పన.

"జోక్ చేస్తున్నావా?" నవ్వుతూ అడిగాడు.

"జోక్ కాదు. నిజమే చెబుతున్నాను. ఆ ఎర్ర ఫైలును నేను తీసుకు రాదల్చుకోలేదు. నన్ను బలవంత పెట్టకు శివరావ్" అన్నది.

శివరావు ఖిన్నుడై — "మళ్ళీ యేమయ్యింది నీకు? రేటు పెంచటానికి ఇలా యెదురు నాటకం కాదు కదా" అని అడిగాడు.

"రేటు గురించి కాదు. నువ్వు లక్ష రూపాయలు ఇచ్చినా ఆ పని చెయ్యను అంతే. నా మనసు మార్చుకున్నాను."

"ఎందుకు? హఠాత్తుగా ఏమయ్యింది?"

"ఏమయ్యిందో నీకు చెప్పను. ఆ పనికి ఇంకెవర్నయినా

చూసుకో.... నావల్ల కాదు."

"సగంలో నువ్వు నా వల్ల కాదంటే ఎలా? ఇలాగని ముందే చెప్పకపోయావా?"

"ముందే చెప్పాను. కాని నువ్వు వూరుకోలేదు."

"నాకు అదంతా అనవసరం కల్పనా.... నువ్వు ఈ పని చేసితీరాలి. నువ్వు ఇంత హటాత్తుగా యెందుకు ఇలా నిర్ణయించుకున్నావో నాకు తెలీదు" అన్నాడు మొండిగా.

"సారీ.... అది జరిగే పనికాదు" అన్నది కల్పన ఇంకా మొండిగా.

అప్పుడు శివరావు మళ్ళీ నటించాడు.

"కల్పనా.... ఇన్ని రోజులనించీ నా మనసులో వున్న మాటను నీకు చెప్పలేదు. సమయం వచ్చినప్పుడు చెబుదామనుకున్నాను. ఇప్పుడు సమయం వచ్చింది. నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నువ్వు వేశ్యవైనా నీలో వున్న గొప్ప హృదయాన్ని చూసి నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకున్నాను" అన్నాడు ప్రేమగా ఆమె కళ్ళలోకి చూసి.

"నిజంగానా!" అన్నది కల్పన.

"అవును కల్పనా. నిన్ను మొదటిసారి చూసినప్పుడే నాలో ప్రేమ కలిగింది. నీ గతంతో నాకు పనిలేదు. నాకు నువ్వు కావాలి" అన్నాడు.

"అయితే చేసుకో శివరావ్.... నేనూ ఈ బురదలో నించి బయటపడాలనే అనుకుంటున్నాను."

"తప్పకుండా చేసుకుంటాను. కాని అందుకు ఓ షరతు వుంది. నువ్వు ఆ ఎర్ర ఫైలును తీసుకురావాలి. అప్పుడు నిన్ను పెళ్ళి చేసుకుంటాను."

నవ్వింది కల్పన.

"సరే....నీ షరతుకు నేను ఒప్పుకుంటాను. కాని ఇందులో చిన్న సవరణ వుంది. ముందు నువ్వు నన్ను పెళ్ళిచేసుకో. ఆ తర్వాత వెళ్ళి ఆ ఫైలును తీసుకొస్తాను."

ఉలిక్కిపడ్డాడు శివరావు.

కల్పన తనకంటే తెలివైనదని గ్రహించాడు.

ఇక ఆమెతో యెంత మాట్లాడినా ప్రయోజనం వుండదని తెలుసుకున్నాడు. యెందువల్లనో ఆమె మనసు మార్చుకుంది.

ఆమె మనసు యెందుకు మార్చుకుంది?

ఎవరు మార్చారు?

తెలుసుకోవాలి. కల్పన ఆ ఎర్ర ఫైలును యెలాగైనా తీసుకొచ్చేలా చెయ్యాలి.

శివరావు యేదో నిర్ణయించుకున్నవాడిలా కల్పనతో మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు.

# 8

"నేను—కనకారావ్‌ని మాట్లాడుతున్నాను" అవతలివైపునించి వినిపించింది.

"నువ్వా....నువ్వింకా ఆ వ్యవహారం గురించి ఆశలు వదులుకోలేదా?" అన్నాడు దామోదరం.

"లేదు. కనకారావ్ అంత సులభంగా ఆశలు వదులుకోడు.... నాకు పట్టుదల యెక్కువ.... ఆ విషయం మీకు బాగా తెలుసనుకుంటాను. నేను అనుకున్నది యేదయినా సాధించి తీరతాను."

నవ్వేడు దామోదరం....

"నీ సంగతి నాకు బాగా తెలుసు. నువ్వు విష జంతువని నాకు తెలుసు. ఐతే నీ కోరలు ఎలా పీకాలో కూడా నాకు తెలుసు. అందుకే ప్రభుత్వం నీ వర్కు

గురించిన ఎంక్వయిరీ నాకే ఇచ్చేట్టుగా చూసుకున్నాను. యెంక్వయిరీ చేసి నిన్ను జైల్లోకి నెట్టించే ఫైలును తయారు చేశాను. కాబట్టి నువ్వు ఇక నీ ప్రయత్నాలు మానుకో. జైలుకు వెళ్ళటానికి సిద్ధంగా వుండు" అన్నాడు.

"సరే....జరిగిందేదో జరిగింది. గతాన్ని ఇద్దరం మరచి పోదాం....ఆఖరి బేరం పెడుతున్నాను. లక్ష రూపాయ లిస్తాను. ఆ ఫైలును నాశనం చెయ్యండి .... మనిద్దరం స్నేహితులుగా మారిపోదాం" అన్నాడు కనకారావ్.

"నీ ఆఖరి బేరం అరవై లక్షలయినా నేను నీకు లొంగను. నాక్కావలసింది డబ్బు కాదు. నీ మీద పగ సాధించటం....నువ్వు యెన్నో యేళ్ళ క్రితం నాకు చేసిన ద్రోహాన్ని నువ్విచ్చే డబ్బుతో నేను మరచిపోతానని యెలా అనుకున్నావ్? ఈ దామోదరం అంటే ఏమిటో నీకు తెలిసేలా చేస్తాను. ఇక నువ్వు నాకు ఫోన్ చెయ్యకు" అని పెట్టేశాడు.

దామోదరం కసిగా నవ్వుకున్నాడు.

ఇంకో వారం రోజులు. వారం రోజుల్లో ఆ ఎర్ర ఫైలును ప్రభుత్వానికి అందజేస్తాడు. ప్రభుత్వం ఇలాంటి దోపిడీదారులను ఉరివెయ్యటానికి యెదురుచూస్తోంది—

ఒకప్పుడు—

కొన్నేళ్ళ క్రితం కనకారావ్ తన చెల్లెలికి చెయ్య బోయిన దారుణం అతనికి గుర్తొచ్చింది.

ఇద్దరిదీ ఒకే వూరు. కనకారావ్ ఆ వూళ్ళో తిరుగు లేని మనిషి. అతడి చూపు దామోదరం చివరి చెల్లెలు జయంతి మీదపడింది. ఒకరోజు ఆమె స్నేహితురాలింటికి వెళ్ళి తిరిగొస్తుంటే కనకారావ్ ఆమెను బలవంతంగా నోరునొక్కి ఓ చీకటి సందులోకి లాక్కుపోయాడు.

ఆమెను బలాత్కరిస్తుండగా ఆ వైపునించి వస్తున్న దామోదరం చూసి కనకారావ్‌ను తన్ని చెల్లెల్ని రక్షించుకున్నాడు. కనకారావ్ శారీరకంగా బలహీనుడు కావటంతో దామోదరాన్ని ఏం చెయ్యలేకపోయాడు. ఆ తర్వాత దామోదరాన్ని దెబ్బతీయాలని ప్రయత్నించాడు. వీలుకాలేదు. కొన్నాళ్ళకు ఓ రేప్ కేసులో ఇరుక్కుని జైలుకు వెళ్ళివచ్చాడు.

జైలునించి వచ్చిన తర్వాత మంచి మనిషిగా మారినట్టు నటిస్తూ కంట్రాక్టులు చేస్తూ కొన్ని రోజుల్లోనే పెద్ద కంట్రాక్టరుగా ఎదిగిపోయాడు.

'కనకారావ్ ... నువ్వెంత యెదిగిపోయినా నిన్ను పాతాళానికి తొక్కేస్తాను' అనుకున్నాడు దామోదరం చిన్నగా.

# 9

“నేనెవరో నీకు తెలీదు. నన్ను శివరావు పంపించాడు” అన్నాడతను.

అతను నల్లగా, పొట్టిగా వున్నాడు. వైట్ ప్యాంటు, గీతల షర్టు వేసుకున్నాడు. పలుచగా వున్న జుట్టు. మొహం జిడ్డుగా వుంది.

“శివరావా! యెక్కడున్నాడు? నిన్నెందుకు పంపించాడు?” అడిగింది కల్పన.

“ఎక్కడో ఒకచోట వున్నాడు. యెక్కడున్నాడో నీకు చెప్పను. కాని నిన్ను అక్కడకు తీసుకురమ్మన్నాడు.”

“ఎందుకు? నేను రానని చెప్పు” అన్నది.

అతను నవ్వి “నువ్విలా అంటావనికూడా చెప్పాడు. అయితే యే విషయం చెబితే వెంటపడి వస్తావో కూడా

చెప్పాడు. ఆ విషయం చెబుతాను విను. అతను ఒక అమ్మాయిని తీసుకు వచ్చాడు యెక్కడినించో. ఆ అమ్మాయికి పదేళ్ళుంటాయి. పేరు చంద్రిక. నీ చెల్లెలని అన్నాడు. ఆ అమ్మాయిని శివరావు ఒక యింట్లో బంధించాడు. ఇప్పుడు నువ్వు ఆ యింటికే రావలసి వుంది" అన్నాడు తాపీగా.

షాకై పోయింది కల్పన.

శివరావు యింత దుర్మార్గుడో ఆమెకు తెలిసింది— అతడ్ని తెలివితక్కువగా నమ్మి అతడిలో సుందరం పోలికలున్నాయని అభిమానించినందుకు బాధపడింది.

నీచుడు!

తన వూరికెళ్ళి తన చెల్లెలు చంద్రికను మోసగించి తీసుకొచ్చాడన్నమాట—తనని లొంగదీసుకోటానికి....

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?! నువ్వు శివరావు గురించి పోలీసులకుగానీ ఇంకెవరికైనా చెబితే నిర్దాక్షిణ్యంగా నీ చెల్లెలి ప్రాణాలు తీస్తాననికూడా చెప్పమన్నాడు. వెంటనే బయల్దేరు. యెక్కువ టైములేదు. నాకు యింకా చాలా పనులున్నాయి" అన్నాడతను.

తలుపులు మూసి లాక్ చేసి అతడితో బయల్దేరింది కల్పన.

·ఆటోలో ఊరికి దూరంగా వున్న ఓ ఇంటికి వెళ్ళారు.

పాడుబడిన ఇల్లులా వుంది. చిన్న పెంకుటిల్లు. ఆ దగ్గర్లో యెక్కువగా ఇళ్ళు లేవు.

లోపలకు వచ్చిన కల్పనను చూసి "నువ్వు వస్తావని నాకు తెలుసు" అన్నాడు శివరావు నవ్వుతూ.

అప్పుడు శివరావు పులిలా కనిపించాడు.

"నువ్వింత నీచుడివని నాకు తెలీదు. నీతో స్నేహాన్ని

పెంచుకొని అభిమానించటం నేను చేసిన ఘోరమైన తప్పు. యెక్కడ నా చెల్లెలు" అన్నది.

అతడామెను పక్కనే ఉన్న ఓ గదిలోకి తీసుకెళ్ళాడు.

ఆ గదిలో చేతులు కట్టివేయబడిన ఓ పదేళ్ళ అమ్మాయి ఓ మూలగా నేలమీద పడివుంది. అరవకుండా వుండేందుకు ఆ అమ్మాయి నోటికి టేప్ అంటించబడి వుంది.

చెల్లెల్ని చూస్తూనే దగ్గరకు పరిగెత్తింది కల్పన—ఆమె చెయ్యిపట్టుకొని ఆపాడు శివరావు.

"ఆగు....నీ చెల్లెల్ని ఇంత కష్టపడి మోసంతో ఇక్కడిదాకా యెందుకు తీసుకువచ్చానో నీకు అర్థమై వుంటుంది. అందుకని నువ్వు దామోదరం కోరినట్టుగా రేపు రాత్రికి అతనింటికి వెళ్ళి నేను చెప్పినట్టుగా ఆ ఎర్ర ఫైలును తీసుకొస్తానంటే నీ చెల్లెల్ని వదిలిపెడతాను. లేదంటే యిప్పుడే నీ యెదురుగా గొంతునొక్కి చంపుతాను. తేల్చుకో" అన్నాడు.

చెల్లెల్ని చూస్తోంది కల్పన.

ఆ అమ్మాయి కళ్ళనుండి నీళ్ళు కారుతున్నాయి. భయంగా చూస్తోంది.

చెల్లెల్ని ఆ స్థితిలో చూస్తే కల్పనకు గుండె తరుక్కుపోయింది.

శివరావు క్రూరుడు. అన్నంతపనీ చేస్తాడు. ఇక తన మొండితనం పనికిరాదు.

అందుకే—"ముందు నువ్వు నా చెల్లెల్ని వదిలిపెడతానంటే రేపు ఆ రాత్రికి ఆ ఫైలును తీసుకొస్తాను" అన్నది.

"నీ మాటలు నమ్మమంటావా?" అనడిగాడు శివ

ణంగా చూసి.

"నమ్మ....నువ్వెలాంటి వాడివో ఇప్పుడు తెలిసింది. తెలిసిన తర్వాత నిన్ను తక్కువగా అంచనా వెయ్యలేను కదా."

"సరే .... వదిలిపెడతాను. నీ చెల్లెలు నీ దగ్గరకు వచ్చింది కదాని నువ్వు మాట తప్పితే మీ ఇద్దరి అంతం చూస్తాను. ఆ ఎర్ర ఫైలుమీదే నా భవిష్యత్తు అంతా ఆధారపడి వుంది. అటువంటి భవిష్యత్తు నీవల్ల నాశన మయిందంటే నేను యెంతటి ఘోరానికైనా వెను కాడను. నా జీవితం యేమయిపోయినా లెక్క చెయ్యను. వెళ్ళు....నీ చెల్లెల్ని విడిపించుకొని తీసుకెళ్ళు. రేపు రాత్రి సరిగ్గా ఒంటిగంటకు దామోదరం ఇంటికి వస్తాను. అక్కడ నువ్వు నాకు ఆ ఎర్ర ఫైలును అందజెయ్యాలి" అని కల్పన చేతిని వదిలాడు.

రివ్వున వెళ్ళి చెల్లెలి కట్లు వూడదీసింది. ఒక్కసారి పెద్దగా యేడ్చింది చంద్రిక.

అరగంట తర్వాత కల్పన — చెల్లెలితో ఇంటికి వచ్చే సింది. రాబోయే ముందు మరోసారి హెచ్చరించాడు శివరావు.

ఆ రాత్రి కల్పన నిద్రపోలేదు. ముక్కలైపోయిన తన జీవితం గుర్తుకు వచ్చింది.

ఒక నీచుడ్ని నమ్మి వాడి ప్రేమ మైకంలోపడి వాడితో లేచి వెళ్ళిపోయింది. వాడు కల్పన తీసు కొచ్చిన నగలు, డబ్బు అయిపోయేవరకు పెళ్ళిచేసుకుంటా నంటూనే ఆమెను వాడుకుంటూ కాలం గడుపుతూ వచ్చాడు. అన్నీ అయిపోయిన తర్వాత ఒక రాత్రి చెప్ప కుండానే వెళ్ళిపోయాడు. తిరిగి ఇల్లు చేరటానికి కల్పనకు

మనసొప్పలేదు. ఇంట్లో తల్లిదండ్రులు రానివ్వరని కూడా తెలుసు. అందుకే ఆత్మహత్య చేసుకునే ధైర్యంలేక ఒళ్ళమ్ముకొని జీవించటం మొదలు పెట్టింది.

అక్కడికి వంద కిలోమీటర్ల దూరంలోనే ఆమె తల్లిదండ్రులు ఉంటున్నారు.

ఆ రోజు ఉదయం శివరావు—చంద్రిక చదువుతున్న స్కూలుకు వెళ్ళి కల్పన తీసుకురమ్మందని చెప్పి ఆ అమ్మాయిని తీసుకొచ్చాడుట.

సుందరం ఇచ్చిన మాటను కాదని రేపు రాత్రి ఆ ఎర్రఫైలును తీసుకు రావాలని అనుకుంటే కల్పనకు ఏడుపొచ్చింది.

క్షమించు సుందరం—అనుకుంది.

# 10

"నా పేరు దామోదరం" పరిచయం చేసుకున్నాడు.

"కూర్చోండి" అన్నాడు డిటెక్టివ్ రణధీర్.

దామోదరం కుర్చీలో సర్దుకొని కూర్చున్నాడు.

"చెప్పండి. ఏం పనిమీద వచ్చారు?" అనడిగాడు రణధీర్ సిగరెట్టు వెలిగించుకొని—

"ఎంతో ముఖ్యమైన ఓ ఎర్రఫైలు రాత్రి నా ఇంట్లోనించి మాయమైంది" అని మొదలుపెట్టి కల్పన తనని కలుసుకున్న దగ్గర్నించీ ఉదయం చూడగానే ఆ ఫైలు లేకపోవటంవరకు రణధీర్‌తో చెప్పాడు దామోదరం.

"చాలా సింపుల్ కేసు. ఆ ఎర్రఫైలు మీరు ఎవరి గురించి తయారుచేశారో వాళ్ళే దాన్ని మాయంచేసి వుండొచ్చు" అన్నాడు రణధీర్.

"అవును. ఆ విషయం నాకు తెలుసు. ఆ ఫైలును నేను కంట్రాక్టర్ కనకారావ్ ప్రభుత్వాన్ని యెలా

మోసం చేసిందీ తెలియజేస్తూ తయారు చేసింది. అందులో అతను స్వయంగా రాసిన ఉత్తరాలు ఇంకొన్ని ముఖ్యమైన సాక్ష్యాలు వున్నాయి. ఆ ఫైలును మళ్ళీ తయారు చెయ్యటం సాధ్యం కాదు. అందులో అన్నీ ఒరిజనల్స్ ఉన్నాయి. నా దగ్గరకు వచ్చిన ఆ యువతిని కనకారావే పంపించి ఉంటాడు. అందులో యెలాంటి సందేహం లేదు. కేవలం ఆ విషయం తెలిసినందువల్ల ప్రయోజనం యేమీ లేదు. ఆ ఫైలు కనకారావుకు చేరకుండా వుంటే మీరు దాన్ని యెలాగైనా తిరిగి సాధించాలి. అదే మీరు నాకు చెయ్యవలసిన సహాయం" అన్నాడు దామోదరం సిగరెట్టు టిన్ బయటకుతీస్తూ.

"మీరిలా అడగటం ఆశ్చర్యంగా వుంది. ఇంకా ఆ ఎర్ర ఫైలు కనకారావ్‌ను చేరకుండా వుంటుందని ఎలా అనుకుంటున్నారు?" అనడిగాడు.

"ఇందుకు కారణం వుంది. కనకారావ్ తత్వం నాకు తెలుసు. అతను యే విషయాన్నీ స్వయంగా డీల్ చెయ్యడు. మరో మనిషిని అడ్డు పెట్టుకొని తన పనులను సాధించుకుంటూ వుంటాడు. అలాగే ఈ పనికూడా యెవరో ఓ మధ్య వ్యక్తిని నియమించి వుంటాడు. అలాంటప్పుడు కల్పన ఆ ఎర్ర ఫైలును నేరుగా కనకారావ్‌కు అందించదు. మధ్యవర్తికి అందించి వుంటుంది. ఇప్పటి వరకు మధ్యవర్తి కల్పనను కలుసుకున్నాడో లేదో తెలీదు. ఒకవేళ కలుసుకొని ఆ ఎర్ర ఫైలును తీసుకున్నా దాన్ని కనకారావ్‌కు అందించాడో లేదో తెలీదు. ఒకవేళ ఇప్పటివరకూ ఆ ఫైలు కనకారావ్‌కు చేరకుండా వుంటే మీరు దాన్ని పట్టుకోగలిగే అవకాశం వుంటుంది."

"మీ ఆర్గ్యుమెంటు బాగానే వుంది. ఆల్‌రైట్ నేను

మీ కేసు టేకప్ చేస్తున్నాను. నాకు కావలసిన వివరాలు యివ్వండి. మిమ్మల్ని మోసగించిన కల్పన యెలా వుంటుంది? ఆమె యెక్కడ వుంటుందో మీకు తెలుసా? తెలిస్తే చెప్పండి."

దామోదరం—కల్పన గురించి వర్ణించి చెప్పాడు. "ఆమె ఎక్కడ ఉంటున్నదీ నాకు చెప్పలేదు. ఆమె ఎడ్రసు తెలీదు" అన్నాడు.

"సరే....కనకారావ్ ఎడ్రసు చెప్పండి."

అతడి ఎడ్రసు చెప్పాడు దామోదరం. తర్వాత తన ఆఫీసు ఎడ్రసు—ఇంటి ఎడ్రసు—ఫోన్ నెంబర్ ఇచ్చి యెడ్వాన్స్‌గా వెయ్యి రూపాయలు రణధీర్‌కు ఫీజు చెల్లించి అక్కడినించి బయటకు వెళ్ళిపోయాడు.

# 11

చీకటి పడింది.

తలుపు నెట్టుకొని లోపలకు వచ్చిన మనిషిని చూసి ఉలిక్కి పడింది కల్పన.

"నువ్వా!" అన్నది సిగ్గుతో తలవంచుకుంటూ.

"అవును. నే నే....నువ్వింత ద్రోహం చేస్తావని అనుకోలేదు" అన్నాడు సుందరం కోపంగా కల్పనను చూస్తూ....

ఆమె ఏడ్చింది.

"ఇంకెందుకీ యేడుపు....నువ్విలా చేస్తావనుకుంటే నీ గురించి దామోదరంతో అప్పుడే చెప్పేవాడిని" అన్నాడు.

"నేను యెలాంటి పరిస్థితుల్లో ఇలా చేశానో నీకు తెలీదు సుందరం. విధిలేక ఇలా చెయ్యవలసి వచ్చింది" అని జరిగింది అతనితో చెప్పింది.

అంతా విని సుందరం షాకైనాడు.

"సారీ కల్పనా....ఇలా జరిగిందని నేను ఊహించ లేకపోయాను. ఐనా నువ్వు శివరావులాంటి దుర్మార్గుడ్ని ఎలా నమ్మావో నాకు తెలీటంలేదు. వాడు పరమ నీచుడు. యిప్పుడే వాడి గురించి దామోదరంతో చెబుతాను. ఆ ఫైలు విలువ నీకు పూర్తిగా తెలీదు. నా పగతీరటం విషయం ఎలావున్నా ఇప్పుడు దామోదరం ఉద్యోగానికే ప్రమాదం వుంది. ముందు శివరావును వెతికి పట్టుకోవాలి. వస్తాను" అని వెళ్ళిపోయాడు సుందరం.

వాకిట్లో నిలబడి వుంది కల్పన. అతను రోడ్డుమీదకు వచ్చాడు. వెంటనే రివ్వున ఎక్కడినించో ఓ టాక్సీ వచ్చి సుందరం పక్కనే ఆగిపోయింది. డోర్ తెరుచుకుంది. ఎవరో అతడ్ని కన్నుమూసి తెరిచేంతలో లోపలకు లాగారు.

టాక్సీ దూసుకు వెళ్ళిపోయింది.

ఉలిక్కిపడింది కల్పన.

సుందరాన్ని యెవరో ఎత్తుకుపోయారు? యెవరు? వాళ్ళకు సుందరంతో పనేమిటి?

తను ఆలోచనలతో టైము వేస్టు చెయ్యకూడదు. సుందరాన్ని ప్రమాదంనించి కాపాడాలి?

ఇందుకు తగిన మనిషి ఎవరు?

• • •

దామోదరానికి ఫోన్ చేసి మాట్లాడి రిసీవర్ ను హుక్ మీద వుంచాడు డిటెక్టివ్ రణధీర్.

సరిగ్గా అప్పుడే డోర్ నెట్టుకొని లోపలకు వచ్చిన యువతిని ఆశ్చర్యంగా చూశాడు.

ఆమె వస్తూనే నమస్కారంచేసి "నా పేరు...."

అంటూ చెప్పబోయింది.

రణధీర్ నవ్వుతూ "వద్దు....నీ పేరు నాకు తెలుసు. కల్పన. "కూర్చో" అన్నాడు.

ఆమె ఆశ్చర్యపడి "నా పేరు మీకెలా తెలుసు?!" అన్నది.

"నీ పేరు కాదు. నువ్వు దామోదరాన్ని మోసగించి ఆ ఎర్ర ఫైలును తీసుకెళ్ళిన సంగతి కూడా తెలుసు. ఇంతకీ ఆ ఫైలును నువ్వు యెవరికిచ్చావ్? కంట్రాక్టర్ కనకారావ్‌ను కలిశాను. అతను ఆ ఎర్ర ఫైలుకోసం తను ఎవర్నీ నియమించలేదని అన్నాడు. అతను అబద్ధం చెబుతున్నాడని నాకు తెలుసు. అతడి మాటలనుబట్టి ఆ ఎర్ర ఫైలు అతడి దగ్గరకు చేరలేదని అర్థమైంది. చెప్పు నువ్వు ఫైలును ఎవరికిచ్చావ్?" అనడిగాడు.

ఆమె మొదలు దగ్గర్నించి చివరివరకూ జరిగిందంతా చెప్పి చివరగా సుందరాన్ని యెవరో తన యింటిముందే టాక్సీలో తీసుకువెళ్ళిన విషయాన్ని కూడా చెప్పింది.

"ఆ టాక్సీ నెంబర్ చూశావా?" అడిగాడు.

"లేదు. ఆదుర్దాలో నెంబర్ చూడాలనే ఆలోచన నాకు రాలేదు" అన్నది.

"ఈ గొడవతో సుందరానికేమిటి సంబంధం?"

"తెలీదు. ఆ ఫైలును నేను శివరావుకు అందించాను ఆ రాత్రి. అతను కనకారావ్‌కు ఇస్తానని అన్నాడు. ఉదయమే ఆరు వేల రూపాయలు తెచ్చి ఇస్తానని చెప్పాడు. కాని ఇంతవరకు నన్ను కలుసుకోలేదు" అన్నది.

"శివరావు ఎడ్రసు తెలుసా?"

"కరెక్టుగా తెలీదు....అతనింటికి నేనెప్పుడూ వెళ్ళ

లేదు. అతను ఏ ప్రాంతంలో ఉండేదీ ఒక సారి చెప్పాడు" అని అతడి అడ్రసు చెప్పింది.

తన ఎడ్రసు కూడా చెప్పింది.

"ఎలాగైనా మీరు సుందరాన్ని కాపాడాలి. అతను మంచి మనిషి. శివరావే-సుందరాన్ని టాక్సీలో తీసుకెళ్ళి ఉంటాడని నా అనుమానం. ప్లీజ్ ఎలాగైనా అతన్ని రక్షించండి" అన్నది కల్పన కన్నీళ్ళతో.

"నేను యిప్పుడే బయల్దేరుతున్నాను. శివరావ్‌ని కలుసుకుంటాను. సుందరం ఆచూకీ తెలుసుకుంటాను. నువ్వు నీ యింటి దగ్గర ఉండు. తిరిగివెళుతూ నీ దగ్గరకు వచ్చి కలుస్తాను" అన్నాడు.

అతనికి నమస్కారం చేసి బయటకు వచ్చింది కల్పన. ఇప్పుడామెకు కొంచెం ధైర్యంగా అనిపించింది.

ఆ రాత్రి తొమ్మిది గంటల సమయంలో డిటెక్టివ్ రణధీర్—కల్పనను కలుసుకున్నాడు.

శివరావు ఇంట్లో లేడని—సుందరం ఆచూకీ తెలియ లేదని చెప్పి వెళ్ళిపోయాడు.

## 12

సుందరం భార్య దారుణంగా విలపిస్తోంది. అప్పటికే పోలీసులు వచ్చారు.

ఉదయం ఏడు గంటలు — డిటెక్టివ్ రణధీర్ కూడా వచ్చాడు.

సుందరం శవం వెల్లకిలా పడివుంది. ఎవరో పొడుగాటి కత్తితో అతని గుండెల్లో నాలుగైదుసార్లు పొడిచారు. అక్కడ రక్తం కారిలేదు. అంటే ఎక్కడో హత్యచేసి శవాన్ని సుందరం యింటిముందు పడేసి వెళ్ళిపోయారు.

"హంతకుడు ఎవరో తెలుస్తూనే వుంది. కాని

సుందరాన్ని హత్య చెయ్యవలసిన అవసరం యేమిటో నాకు అర్థం కావటంలేదు" అన్నాడు డిటెక్టివ్ రణధీర్ పోలీసు ఇన్స్పెక్టర్ భూషణ్ తో.

"ఈజిట్! హంతకు డెవరో నీకు తెలుసా?" అడిగాడు భూషణ్.

"నా వూహ మాత్రమే. ఈ కేసుకు చాలా కథ వుంది" అంటూ ఎర్ర ఫైలు హిస్టరీ అంతా అతనితో చెప్పి "ఈ కేసులో మనం కంట్రాక్టర్ కనకారావ్ను అనుమానించాలి. కాని అతను ఈ ఎర్ర ఫైలుకోసం శివరావు అని తన దగ్గరే పనిచేసే ఓ మధ్యవర్తిని నియమించాడు. ఆ శివరావు ఆ ఎర్ర ఫైలు తీసుకొని మాయమైనాడు. దాన్ని యెందువల్లనో కనకారావ్కు అందజెయ్యలేదు. బహుశ ఆ ఫైలు దగ్గరుంచుకొని కనకారావ్ను బ్లాక్ మెయిల్ చేసి బాగా డబ్బు లాగాలనే ఉద్దేశంతో కావచ్చు. కాని మధ్యలో సుందరాన్ని ఎందుకు హత్యచేసినట్టు? తెలీదు. శివరావును కలుసుకుంటేనే మనకు అన్ని విషయాలు తెలిసేది. నువ్విక్కడి పనులు పూర్తి చెయ్యి. నేను శివరావు ఇంటికి వెళ్ళొస్తాను" అని అక్కడినించి స్కూటరుమీద వెళ్ళిపోయాడు డిటెక్టివ్ రణధీర్.

శివరావు ఇంటి తలుపులు దగ్గరకు వేసివున్నాయి. తలుపులను నెట్టుకొని లోపలకు వెళ్ళాడు రణధీర్. అంతే_

అక్కడే నిలబడిపోయాడు బొమ్మలా ఆశ్చర్యంతో ఎదురుగా నేలమీద శివరావు బోర్లా పడివున్నాడు. అతడి వీపులో పొడుగాటి కత్తి దిగబడి వుంది. నెత్తు

రులో అతడి బట్టలు నేలంతా తుడిసి ఉన్నాయి.

ఊహించని దృశ్యం.

ఒకసారి ఆ గదినంతటినీ కలియజూశాడు.

ఆ గదిలో వస్తువులన్నింటినీ యెవరో ఎందుకోసమో ప్రతి అంగుళాన్నీ వదలకుండా వెతికినట్టు డిటెక్టివ్ రణధీర్‌కు అర్థమయింది.

ఎందుకోసం?

ఎర్ర ఫైలుకోసం—

ఇంతకీ ఆ ఫైలు శివరావును హత్యచేసిన మనిషికి దొరికిందా?

తెలీదు.

వెంటనే ఆ ఇంట్లోనించి బయటకు వచ్చి తలుపులను దగ్గరగా మూసి స్కూటరుమీద రివ్వున సుందరం ఇంటికి వచ్చి ఇన్‌స్పెక్టర్‌ని కలుసుకొని "సారీ బ్రదర్ ....మళ్ళీ నీకు శ్రమ ఇస్తున్నందుకు క్షమించు. మళ్ళీ ఓ హత్య జరిగింది. హతుడు యెవరో కాదు. మనం హంతకుడిగా అనుకున్న శివరావు" అని చెప్పాడు.

ఇన్‌స్పెక్టర్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి.

* * *

రాత్రి—ఎనిమిది గంటలయ్యింది.

ఆ రోజు మధ్యాహ్నమే ఇన్‌స్పెక్టర్ భూషణ్— రణధీర్ చెప్పినట్టుగా కనకారావ్‌ను అనుమానంమీద అరెస్టుచేసి కస్టడీలో వుంచాడు.

శివరావు హత్య వార్త విని అంతగా బాధపడకపోయినా సుందరం హత్య వార్త విని కుమిలిపోయింది కల్పన. అతడ్ని హత్యచేసినవాడ్ని పట్టుకొని ఉరికంబం

యెక్కించమని కోరింది రణధీర్ ని. దామోదరంకూడా అదేమాట అన్నాడు. యెంత డబ్బయినా ఖర్చుచేస్తా నన్నాడు.

సిగరెట్టును విసిరి స్కూటరు దిగి శివరావు ఉంటున్న వీధి చివర ఉన్న కిల్లీ బంకు దగ్గరకు వచ్చాడు.

బంకులో పాతికేళ్ళ కుర్రాడు కూర్చుని ఉన్నాడు. జనం యెవ్వరూ లేరు.

ఓ సిగరెట్టు ప్యాకెట్టు కొని సిగరెట్టు వెలిగించు కుంటూ "ఈ రోజు ఉదయం హత్య చెయ్యబడిన శివరావు నీకు తెలుసా?" అని అడిగాడు అతన్ని.

"తెలుసు .... యెప్పుడూ నా దగ్గరే సిగరెట్లు కొంటాడు. అతను చిత్రమైన మనిషి. ఒక బ్రాండు అంటూ లేదు. అన్ని రకాల సిగరెట్లూ కాలుస్తాడు" అన్నాడు అతను.

అతను ఒక్క మాట అడిగితే అంతా చెప్పేలా ఉన్నాడని గ్రహించిన రణధీర్ "శివరావు కోసం యెక్కువగా యెవరెవరు వస్తూ ఉంటారో నీకేమైనా తెలుసా?" అనడిగాడు.

"ఎక్కువగా ఒకతను మోటార్ సైకిలుమీద వస్తూ ఉండేవాడు."

"ఎవరతను?"

"కంట్రాక్టర్ ఈశ్వరరావ్."

"కంట్రాక్టరా!" ఆశ్చర్యంగా అడిగాడు రణధీర్.

"అవును. ఇప్పుడు మన కిల్లీ బంకుముందు ఉన్న రోడ్డును కంట్రాక్టు తీసుకొని వేయించింది అతనే. చూడండి. ఆరు నెల్లుకూడా అవకముందే గుంటలు పడి పోయింది" అన్నాడు సీరియస్ గా.

రణధీర్‌కు నవ్వొచ్చింది.

"సరే. అతను యెలా ఉంటాడు?"

ఈశ్వరరావ్‌ను వర్ణించి చెప్పాడు అతను.

అతన్ని యింకొన్ని ప్రశ్నలు అడిగి థాంక్స్ చెప్పి స్కూటర్ మీద పోలీస్ స్టేషన్‌కు బయల్దేరాడు రణధీర్.

## 13

ఇన్‌స్పెక్టర్ భూషణ్ — డిటెక్టివ్ రణధీర్ చప్పుడు చెయ్యకుండా కంట్రాక్టర్ ఈశ్వరరావ్ ఇంటి గోడ దూకి లోపలికి వెళ్ళారు.

ఆఫీసుగదిలో ట్యూబ్‌లైటు వెలుగుతోంది.

తలుపులు తెరిచే వున్నాయి. కర్టెన్ వేసి వుంది. కొంచెంగా ఉన్న సందులోనించి గాడ్రెజ్ టేబుల్ ముందు రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని యెవరితోనో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు ఈశ్వరరావ్.

"నేనెవరో నీకు అనవసరం దామోదరం. నీకు అత్యంత విలువైన, ప్రాణప్రదమైన ఆ ఎర్ర ఫైలు ప్రస్తుతం నా దగ్గర ఉంది. యెన్ని లక్షలు ఇచ్చి ఆ ఫైలును నువ్వు కొనుక్కుంటావో ఆలోచించు. యెందు కంటే ఆ ఫైలును నువ్వు కనకారావ్ దగ్గర ఐదులక్షలు తీసుకొని మాయంచేసి యెవరో యెత్తుకుపోయారని పుకారుదీశావని అందరికీ చెబుతాను. అప్పుడు నీ గతి యేమిటో ఆలోచించు. అంతేకాదు. ఆ ఫైలును కంట్రాక్టర్ కనకారావుకే అమ్మెయ్యవచ్చు. కాని కనకారావ్ మీద నాకూ పగ వుంది. అందువల్ల అతడ్ని దెబ్బతీయాలంటే దాన్ని నీకే అమ్మాలి. అందుకే నీకు ఫోన్ చేశాను. మరి యెంత డబ్బు యిస్తావో ఆలోచించు" అన్నాడు.

ఒక్క నిముషం మవునం వహించాడు.

తర్వాత పెద్దగా నవ్వి—"ఏమిటీ! ఇంత పెద్ద ప్లాను వేసి యిద్దరు మనుషులను హత్యచేసి సంపాదించిన ఆ ఎర్ర ఫైలుకు పాతికవేలు ఇస్తానంటావా? కనకారావ్ ఎంతి పాడో తెలుసా? కనీసం రెండు లక్షలకు తక్కువ యివ్వడు. నువ్వు లక్షా యాభై వేలయినా ఇస్తే నేను ఒప్పుకుంటాను. లేకపోతే—" ఇంకేదో అంటూ ఉన్నప్పుడే—

"లేకపోతే నువ్వేమీ చెయ్యలేవు .... ముందు ఆ రిసీవర్ని వదిలి చేతులెత్తి నిల్చో ఈశ్వరరావ్.... రావలసిన టైముకే వచ్చాం....నీ ఫోన్ సంభాషణంతా రికార్డుకూడా చేశాం" అన్నాడు రణధీర్ రివాల్వర్ బయటకుతీసి.

కొయ్యబారి పోయాడు ఈశ్వరరావ్.

"మీరెలా వచ్చారు?" అన్నాడు తేరుకొని.

"మరి డిటెక్టివ్‌లు అంటే యేమనుకున్నావ్? అంతే కాదు. జరిగిన కథంతా చెబుతాను విను. దామోదరాన్ని మోసంచేసి ఆ ఎర్ర ఫైలును కల్పన శివరావుకు ఇచ్చింది. అప్పటికే ఆ ఎర్రఫైలుకోసం నువ్వు శివరావుతో చేతులు కలిపావు. శివరావు ఆ ఫైలును కనకారావుకు కాకుండా నీకే ఇస్తానన్నాడు. కాని యివ్వలేదు. తన దగ్గరే ఉంచుకున్నాడు. చివరకు తనే కనకారావ్‌ను బ్లాక్ మెయిల్ చేసి డబ్బు సంపాదించాలని, ఆ ఫైలును తన దగ్గరనించి సుందరం లాక్కున్నాడని నీతో అబద్ధం చెప్పాడు.

నువ్వు సుందరాన్ని పట్టుకొని ఆ ఎర్ర ఫైలుకోసం హింసించావు. అతను తెలీదన్నాడు. నువ్వు నమ్మకుండా కోపంతో అతన్ని పొడిచి చంపావు. అప్పుడు నీకు శివరావు డబుల్ క్రాస్ చేస్తున్నాడని అనిపించింది.

వెంట నే శివరావు ఇంటికి వెళ్ళి అతడ్ని హత్యచేసి ఇంట్లో వెతికావు. ఎర్రఫైలు దొరికింది. ఇప్పుడు దామోదరంతో బేరం పెడుతున్నావు. అంతే కదూ" అన్నాడు రణధీర్.

ఈశ్వరరావు తల వూపాడు నిజమే అన్నట్టు.

"అయితే యిందులో నాకు అర్ధంకాని అనుమానం ఒక్కటే. కల్పన హఠాత్తుగా దామోదరం దగ్గరనించి ఆ ఎర్ర ఫైలును తీసుకురానని పట్టుబడితే శివరావు ఆమెను లొంగదీయడానికి ఆమె చెల్లెల్ని తీసుకొచ్చాడట. కల్పన యెప్పుడూ తన తల్లిదండ్రులు యెక్కడ ఉన్నదీ శివరావుకు చెప్పలేదుట. మరి అలాంటప్పుడు అతనికి కల్పన ఫామిలీ గురించిన యెలా తెలిసింది" అన్నాడు రణధీర్.

అప్పుడు ఈశ్వర్ రావ్ ఇలా అన్నాడు.

"కల్పన కుటుంబం గురించి శివరావుకు నేనే చెప్పాను. నాకెలా తెలుసంటే ఆమెను పెళ్ళిచేసుకుంటానని లేవదీసుకు వచ్చి ఆ తర్వాత మోసంచేసి చెప్పకుండా వెళ్ళిపోయిన మనిషిని నేనే!"

—: అయిపోయింది:—

# లక్షకో హత్య

## టెంపోరావ్

రాజారావు కారు పోర్టికోలో ఆగింది. డ్రయివర్ తలుపు తెర్చాడు. అతను ఠీవిగా దిగి హాల్లోకి వెళ్లాడు. హాల్లో నాలుగు ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

భార్య ప్రమీల అతడికి యెదురైంది.

"భోజనం చేస్తారా? వడ్డించమననా?" అడిగిందామె.

అతడు భార్యవైపు చూడలేదు.

"ఆలస్యంగా తింటాను. వంటామెను యింటికి పొమ్మను" అని అతడు పైకి వెళ్ళాడు.

పడగ్గది పక్కనే బాత్రూమ్ వుంది. రాజారావు దుస్తులు మార్చుకొని బాత్రూమ్‌లోకి నడిచాడు.

"నమస్కారం, సార్" అన్నాడు రామ్మూర్తి.

తను యింట్లో పెట్టుకున్న బాత్రూమ్‌కి మేనేజర్‌గా ఉంటున్నాడు రామ్మూర్తి.

సోఫాలో కూర్చుని రాజారావు అతడివైపు చూశాడు.

"గెట్ మి స్కాచ్! షీ వాస్ రీగల్ "అన్నాడతను.

రామ్మూర్తి వినయంగా వెళ్ళాడు. కాస్సేపట్లో ఒక గ్లాసు తెచ్చి అతడిముందు పెట్టాడు. సోడా యెంత కలపాలో, ఐస్ క్యూబ్స్ యెన్ని వేయాలో రామ్మూర్తికి బాగా తెలుసు. రాజారావుకి తన బార్రూమ్ మేనేజర్ మీద చాలా విశ్వాసం ఉంది.

రామ్మూర్తి అతడి సిమెంట్ ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడు. ఆ పని అవగానే తిన్నగా అతడు బార్రూమ్‌కి చేరుకుంటాడు. పట్నంలో సులువుగా తిరగడానికి కంపెనీ రామ్మూర్తికి ఒక స్కూటర్ యిచ్చింది. యెంత పెట్రోలు ఖర్చయినా కంపెనీ యిస్తుంది.

ప్రమీల మౌనంగా వచ్చి భర్త పక్కనే మరో సోఫాలో కూర్చుంది. ప్రమీలంటే అతడికంతగా ఇష్టం లేదు. ఆమె తన మేనత్త కూతురు. చిన్నతనంలో పెళ్ళయి పోయింది.

రామ్మూర్తి ఆమె పక్కకు వచ్చాడు.

"ఏదేనా పట్రానా?" అడిగాడు.

"కాంపాకోలా" అందామె.

గ్లాసుకు తెచ్చి రామ్మూర్తి ఆమెకందించాడు.

"మై డ్రింకింగ్ కంపానియన్!" అని నవ్వుతూ రాజారావు విస్కీ తాగాడు.

రెండు బడా పెగ్గులు తాగేసి రాజారావు టైము చూశాడు. పది దాటింది. ఆవులిస్తూ ప్రమీల సోఫా లోంచి లేచింది.

"నేను వెళ్ళి పడుకుంటాను. నిద్రవస్తోంది."

"గుడ్ నైట్" అన్నాడు భర్త.

ఆమె వెళ్ళిపోయింది. రాజారావు, నవ్వుతూ

రామ్మూర్తివంక చూశాడు.

"ఈ రాత్రికి యెవర్ని తీసుకొచ్చావు?" అడిగాడతను సిగరెట్ పొగ వదుల్తూ.

"మూడు నెలలనుంచి ఆమెకోసం ప్రయత్నం సాగిస్తున్నాను. ఆమె యివాళ దొరికింది. పేరు రోజా. ఆమె భర్త నైట్ షిఫ్ట్‌లో ఫాక్టరీకి వెళ్ళాడు. నాలుగింటికి యింటికి వస్తాడు. ఆ లోపలే ఆమె యిల్లు చేరుకోవాలి!" అన్నాడు రామ్మూర్తి.

"ఆ బాధ్యత నీది!" అన్నాడు రాజారావు.

"ఆమెను మీ గెస్టు రూమ్‌లో ఉండమన్నాను. 3-30కి తీసుకెళ్ళి ఆమెను యింట్లో దింపేస్తాను."

"గుడ్!"

"సార్, మా పెద్దబ్బాయికి కొత్త స్కూల్లో సీటు వచ్చింది. రెండువేలు విరాళంగా యివ్వాలి."

"రేపు ఆఫీసులో తీసుకో! గెట్ మి అనదర్ పెగ్!" అన్నాడు రాజారావు.

పదకొండుదాకా అతడు స్కాచ్ విస్కీ సేవించాడు. తర్వాత పైనున్న డైనింగ్ హాల్లో భోజనం చేశాడు. రామ్మూర్తి వినయంగా అతడికి వడ్డించాడు.

డిన్నర్ అయేసరికి పదకొండున్నర అయింది. రాజారావు కుర్చీలోంచి లేచాడు.

"ఆమెను నా పడగ్గదిలోకి తీసుకురా!"

"అలాగే సార్. ఎప్పటిలాగే ప్రమీల తాగిన కూల్ డ్రింక్‌లో స్లీపింగ్ పౌడర్ కలిపాను. పొద్దుట యెనిమిద్దాకా ఆమె లేవదు."

"గుడ్! నువ్వు లేకుండా నేను జీవించలేను" అన్నాడు రాజారావు బయటకు నడుస్తూ.

# 2

తలుపును యెవరో తట్టారు. రాజారావు వెళ్ళి తలుపు తెరిచాడు.

బయట నిలబడి వుంది ఒక యువతి. ఆమెను లోపలకు వెళ్ళమని రామ్మూర్తి వైపు చూశాడు.

"ఈ వెయ్యి నీ దగ్గర వుంచుకో. మంచి పిల్లలాగే వుంది. నువ్వు తలుపు తట్టేసరికి నేనూ నిద్రలో వుండొచ్చు. 8-30కి తీసుకెళ్ళి ఆమెను యింట్లో దింపా అన్నావుగా! ఈ డబ్బు ఆమెకియ్యి."

"అలాగే సార్. నేను బాత్రూమ్‌లో పడుకుంటాడు"

"భోజనం చేసి పడుకో! గుడ్ నైట్" అని రాజారావు తలుపు మూశాడు.

సోఫా పక్కనే ఆమె నిలబడి వుంది. అతడామె చెయ్యి పట్టుకొని పెద్ద మంచం దగ్గరకు తీసుకెళ్ళాడు. పరుపుపైన వెల్‌వెట్ దుప్పటి తళతళ మెరుస్తోంది.

ఆమె సిగ్గు పడ్తోంది. వేళ్ళతో ఆమె ముఖం పట్టుకొని మెల్లిగా పిండాడతను. ఆమె కళ్ళలోకి చూశాడు. పొట్టిగా, పచ్చగా బంగారం బొమ్మలా వుందామె.

"ఇలా యెప్పుడేనా యెక్కడికేనా వెళ్ళావా?" ప్రశ్నించాడతను.

రామ్మూర్తి చెప్పినదంతా ఆమెకు బాగా జ్ఞాపకముంది.

"ఇదే మొదటిసారి" అందామె.

ఇలా చాలా చోట్లకు వెళ్ళానని జవాబిస్తే రాజారావు ఆమెను వెంటనే పొమ్మంటాడు.

"యూ స్ట్రీట్ బిచ్!" అని అరుస్తాడు.

అటువంటి యువతిని తీసుకొచ్చినందుకు రామ్మూర్తికి కూడా తిట్లు తప్పవు.

రాజారావు సంతోషంగా ఆమెను పరుపు మీదకు తోశాడు. ఆమె వెల్లకిలా పడింది. ఆమె పక్కకు జరిగి, కళ్ళలోకి చూశాడతను.

"నీకు పెళ్ళయిందని విన్నాను."

ఆమె తలాడించింది.

"పిల్లలున్నారా?"

"లేరు" అందామె.

పిల్లలుంటే రాజారావుకి ఆమె నచ్చదు. రామ్మూర్తి యిదంతా ఆమెకు చెప్పాడు.

"నువ్వు ఎక్కడికొస్తున్నావో ముందుగా తెలుసా?"

ఆమె నవ్వింది.

"మీ పేరు వినే రావడానికి ఒప్పుకున్నాను. మీ గురించి పత్రికల్లో యింతో చదివాను. చిల్లిగవ్వ లేకుండా జీవితం ప్రారంభించి నలభై ఏళ్ళు దాటేలోపల మీరు కోటీశ్వరులు అయ్యారు. ఇదంతా మీరెలా సాధించారో నాకు ఆశ్చర్యంగా వుంది" అందామె.

ఆనందంతో అతడామెవైపు చూశాడు.

"అభిమానంతో నువ్వు ఇక్కడికొచ్చినందుకు సంతోషిస్తున్నాను" అన్నాడతను.

రాజారావు గదిలోని లైట్లు ఆర్పేశాడు. మరో స్విచ్ నొక్కాడు. జీరో వాట్ బల్బు నీలంరంగు కాంతి పరుపు మీద పడ్తోంది.

ఆమె పక్కనే వాలాడతను. దగ్గరగా లాక్కొని ఆమె పెదిమలను బలంగా ముద్దెట్టుకున్నాడు.

బాత్రూమ్‌లో స్కాచ్ సేవిస్తూ రామ్మూర్తి భోజనం

చేస్తున్నాడు. అతడు టైమ్ చూశాడు. పన్నెండు దాటింది.

మరో మూడుగంటలు తర్వాత తను వెళ్ళి తలుపు తట్టి ఆమెను తీసుకెళ్ళి దింపేయాలి!

భోజనం ముగించి అతడు సోఫాలో వాలాడు. కాస్సేపట్లో అతడికి నిద్రపట్టేసింది.

అతడు అలారం విని లేచాడు. రాజారావు గదిముందుకు వెళ్ళి తలుపు తట్టాడు. తలుపు తెరవబడింది. ఆవులిస్తూ ఆమె అతడివంక చూసింది.

"హాయిగా పడుకున్నాను. యెందుకు లేపావు?" అందామె.

"ఇంటికి పోవాలిగా?"

"ఎందుకీ తొందర?" ప్రశ్నించిందామె.

"నీ భర్త ఫాక్టరీనుంచి నాలుగింటికి తిరిగి వస్తాడని ఆయనతో చెప్పాను."

"లయ్యర్" అందామె.

"పొట్టకోసం యెన్నో అబద్ధాలు చెప్పాలి! గెట్ రెడీ" అన్నాడతను.

కాస్సేపట్లో ఆమె తయారైంది. తన స్కూటర్ మీద ఆమెను రామ్మూర్తి తీసుకుపోయాడు.

చిన్న యింటిముందు స్కూటర్ ఆగింది. ఆమె దిగింది అతడు రెండువందలు ఆమెకిచ్చాడు.

"ఇంతేనా?"

"ఇంకా ఎంత కావాలి?"

"ఆయన్ని స్వయంగా చూశాను. ఆయనది చాలా పెద్ద చెయ్యి. నువ్వు నన్ను మోసం చేస్తున్నావు!" అందామె.

"రోజా, చిన్న హోటల్స్కు పోయి రాత్రల్లా వుండి యాభై గడిస్తున్నావు. నీకు రెండువందలు చాలా యెక్కువ!"

"ఎక్కువో, తక్కువో అది వేరే విషయం. ఆయన యిచ్చినది నాకు యిచ్చేయాలి!"

"అంతే యిచ్చారు."

"రేపు నన్ను మళ్ళీ రమ్మన్నారు ఆయన. అప్పుడు తేల్చుకుంటానులే."

"నిజంగా ఆయన నిన్ను మళ్ళీ రమ్మన్నారా? నాతో ఆయన చెప్పలేదే!"

"రేపు చెప్తారు!"

జేబులో వున్న ఎనిమిదివందలూ ఆమెకిచ్చేసేడతను.

"అలా దారికి రా!" అందామె.

"నాకు యెంతో కొంత యివ్వాలి."

"ఎందుకూ?"

"అక్కడకు తీసుకెళ్ళింది నేనేగా!"

"మీకు ఏమీ యివ్వద్దని ఆయన నాతో అన్నారు. ఆయన నీకు కావలసినంత యిస్తున్నారట."

"ఆయనిచ్చేది వేరు. నువ్వు ఇచ్చేది యియ్యి" అన్నాడతను.

"డబ్బిచ్చే అలవాటు నాకు లేదు. కావలిస్తే రా నా గదికి" అందామె.

రామ్మూర్తి తల బరువెక్కింది. ఆమెవైపు నిస్సహాయంగా చూశాడు.

రోజా గబగబా వెళ్ళిపోయింది. ఆమెకు రెండువందలిచ్చి, యెనిమిది వందలు తను వుంచుకోవాలని అనుకున్నాడు. కాని కథ అడ్డం తిరిగింది.

# 3

ఆర్. ఆర్. మాన్షన్స్ నాలుగంతస్తుల భవనంలో ఏర్ కండిషండ్ గదిలో కూర్చుని ఉన్నాడు రాజారావు. అతడిముందు విశాలమైన స్టీల్ టేబుల్, టేబుల్ మీద నాల్గు టెలిఫోన్లు ఉన్నాయి.

గదిలో చల్లగా, హాయిగా వుంది. అతడు రిసీవర్ ఎత్తాడు.

"హలో, సార్" అంది ఆపరేటర్.

"రామ్మూర్తిని నా గదికి రమ్మను" అని అతను రిసీవర్ పెట్టేశాడు.

కాస్సేపట్లో రామ్మూర్తి అతడిముందు హాజరయ్యాడు.

"నిన్నటి యువతి...."

"ఇవాళ మళ్ళా ఆమెను తీసుకొస్తాను, సార్" అన్నాడు రామ్మూర్తి అడ్డొస్తూ.

"యూ స్టుపిడ్, నాకు కావల్సింది ఆమె మళ్ళా రావడం కాదు. ఆమె దేవాంతకురాల్లా వుంది. నిద్రిస్తూన్న సమయంలో నా పర్సులో వుండే పదివేలు ఆమె పట్టుకు పోయింది."

"ఆమె అటువంటిది కాదు, సార్!"

"రామ్మూర్తీ, ఆమెకు సంతోషంగా వెయ్యి యిచ్చాను. దానితో తృప్తిపడి నా డబ్బు నాకు వాపసు చేయమను."

"ఇప్పుడే వెళ్తాను, సార్."

రామ్మూర్తి గాభరాగా వెళ్ళిపోయాడు. ఆమె ఇంటి వైపు స్కూటర్ని పోనిచ్చాడు.

ఇప్పుడామెకు బుద్ధి చెప్పాలి. నిన్న యిచ్చిన వెయ్యిలో తనకు రావలసిన 800 కూడా లాక్కోవాలి!

చిన్న యింటిముందు స్కూటర్ ఆపి అతను దిగాడు. ఆమె గది తలుపును తట్టాడు. తలుపు తెర్చిన నీగ్రో యువకుడిని చూసి అతడు తృళ్ళిపడ్డాడు.

"వాట్?" అర్చాడు నీగ్రో.

"రాజా" అన్నాడతను.

మరో గదిలోంచి వచ్చిందామె.

"మీరా, రండి" అందామె.

నీగ్రో ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమెవైపు రామ్మూర్తి సూటిగా చూశాడు.

"ఈ నీగ్రో ఎవరు?"

"నైజీరియానుంచి వచ్చాడితను. పేరు టామ్. ఇక్కడ చదువుతున్నాడు. నన్ను పెళ్ళాడాలని అతడి ఆశ" అందామె.

టామ్ అమాంతంగా లేచి రామ్మూర్తి చెయ్యిని పట్టుకొని నలిపేశాడు.

"గ్లాడ్ టు మీట్ యు!" అన్నాడతను.

"ఫామిలీ ఫ్రెండ్ రామ్మూర్తి" అని ఆమె పరిచయం చేసింది.

టామ్ పిశాచంలా వున్నాడు. కాని తన పని తను చేసుకుపోవాలి!

"రాజా, నిన్న ఆయన పర్సులోని పదివేలు నువ్వు పట్టుకుపోయావట. ఆయన పొద్దుటే అది చూసుకున్నారు. ఆ డబ్బు పట్టుకెళ్ళడానికి వచ్చాను" అన్నాడతను.

"పట్టుకు వెళ్ళు" అందామె.

"ఆ డబ్బు యిలా యివ్వు."

ఆమె పకపక నవ్వింది.

"నా చేతిలో పడ్డ డబ్బు తిరిగిరాదు. అది తెల్సుకో!

కాని ఏదీ చెయ్యకపోతే ఆయన నిన్ను తిడ్తాడు. నీ ఉద్యోగం కూడా పోవచ్చు. నేను చెప్పినట్లు చేస్తే నీకు ప్రమాదం ఉండదు.''

“ఏం చెయ్యాలి?”

“నేను వచ్చేసరికే నా భర్త యింట్లో ఉన్నాడు. మా యిద్దరికీ పోట్లాటయింది. నా భర్త నన్ను చావ గొట్టాడు. నేను హాస్పిటల్లో ఉన్నానని చెప్పు. యిది పోలీసు కేసు కావచ్చని చెప్పు. రేపు కోర్టులో ఆయన యింటికి వెళ్ళినట్లు చెప్పొచ్చు. అది ఆయనకు మంచిది కాదు! అలా చెప్పి చూడు! పొట్టకోసం అబద్ధా లాడాలిగా!”

“చూస్తాను, ఆయన యేమంటారో!”

“ఆయన్ని నమ్మించు. నీ తెలివి తేటలు ఉపయోగించు! నిన్ను కాపాడుకుంటూ నన్ను కాపాడు” అందామె.

“నాకే ప్రమాదంలేదు” అన్నాడతను.

“చిన్న హోటల్లో పోయే నాలాటి వేశ్యను ఆయన యింటికి తీసుకెళ్ళావు. నాకు పెళ్ళయినట్లు ఆయనతో చెప్పావు. నిజం ఆయనకు తెలిస్తే ఆయన నిన్ను పొమ్మం టారు. అందువలన నన్ను కాపాడే బాధ్యత నీది” అందామె.

“తన్ని మోసగిస్తే ఆయన మన్నించరు!”

“మనిద్దరం మోసం చేశాంగా! నేను మొదట చెప్పిన కథ చెప్పి ఆయన్ని శాంతపర్చు!”

రామ్మూర్తి లేచాడు. అతడితో కరచాలనం చేయ డానికి టామ్‌కూడా లేచాడు. కాని టామ్‌కు తన చెయ్యి అందకుండానే రామ్మూర్తి బయటకు పరుగెత్తాడు.

“ఫన్నీ మేన్!” అన్నాడు టామ్ ఆమెతో.

ఎదురుగా నిలబడిన రామ్మూర్తివైపు రాజారావు సిగరెట్ పొగ వదుల్తూ చూశాడు.

"ఇచ్చిందా?"

"ఆమె యిచ్చే స్థితిలో లేదు, సార్."

"ఏమైంది?"

"నేనామెను యింటి సమీపంలో 3-45కి వదిలి వెళ్ళి పోయాను. ఆమె భర్త యివాళ తెల్లారుజామున 3-30కే వచ్చాడట. ఆమెను యెక్కడికెళ్ళావని ప్రశ్నించాడు. ఆమెను చావగొట్టాడు. ఆమె హేండ్‌బాగ్‌లో ఉన్న పదకొండువేలు అతడు చూశాడు. అనుమానం ఎక్కువై యింకా కొట్టాడు. చివరికి యీ కేసు పోలీసులదాకా వెళ్ళొచ్చు. హాస్పిటల్లో ఉందామె. అక్కడకు వెళ్ళి ఆమెను చూశాను. అంతా ఆమె నాతో చెప్పింది. డబ్బు అడగడానికి మనస్సు రాలేదు నాకు. వెనక్కి తిరి గొచ్చాను."

"పూర్ ఫెలో, ఒక రాత్రి నాతో గడిపినందుకు చాలా కష్టపడింది."

"అవును సార్. ఇప్పుడు ఏం చేద్దాం?"

"ఈ కేసు పోలీసులదాకా వెళ్ళకుండా చూడ్డం మంచిది. రేపు కోర్టులో నా యింటికి వచ్చినట్లు ఆమె చెప్తే బాగుండదు. పదివేలు వదిలేద్దాం. ఆ డబ్బుపోయినా నాకు లెక్కలేదు."

"అలాగే చూస్తాను, సార్."

రామ్మూర్తి వెనక్కి తిరిగి వెళ్తున్నాడు.

"ఇదిగో, రామ్మూర్తీ!"

అతడు ఆగి వెనక్కి తిరిగాడు.

"ఆమె యే హాస్పిటల్లో ఉంది?" అడిగాడు రాజా

రావు.

"ఎందుకు సార్?"

"నా మూలంగా అన్ని దెబ్బలు తిన్న రోజాను ఒకసారి వెళ్ళి చూస్తాను."

రామ్మూర్తి గుండె దడదడలాడింది. తనిప్పుడు ఏం చెప్పాలి?

"హాస్పిటల్ పేరు చూడలేదు. కావలిస్తే నేను మిమ్మల్ని తీసుకెళ్తాను."

"పద, వెళ్దాం" అని రాజారావు లేచాడు.

రామ్మూర్తి కదల్లేదు. అతడి దగ్గరకొచ్చాడు రాజారావు.

"పద! కదులు!" అరిచాడు.

రామ్మూర్తిలో చలనం లేదు.

"రాస్కెల్! నువ్వు యేదో దాస్తున్నావు నిజం చెప్పు!"

రామ్మూర్తి అతడి కాళ్ళమీద పడిపోయాడు.

"ఆమె మోసగత్తె. పరమ దొంగ. ఆమె మాటలు నమ్మి, అందంగా ఉందని మీ యింటికి తీసుకొచ్చాను. ఆమె బరితెగించినమనిషి. డబ్బు యివ్వనంది. చేతిలో కొచ్చినది తిరిగిచ్చే అలవాటు తనకు లేదంది. ఒక నీగ్రో ఆమెకు బాడీగార్డుగా వుంటున్నాడు."

"ఆమె భర్త ఏమయ్యాడు?"

"అతడే ఆమె కాబోయే భర్త!"

"అంతా ఫిక్షీగా ఉంది. ఆమె యెక్కడుంటోంది?"

"అడ్రెసు తెలియదు, యిల్లు తెలుసు."

"రాత్రి వెళ్దాం" అన్నాడు రాజారావు.

"అలాగే సార్."

# 4

రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. పోలీస్ జీప్ వేగంగా కదుల్తోంది.

"కుడివైపుకు తిరగాలి" అన్నాడు రామ్మూర్తి.

ఇన్స్పెక్టర్ ఆజాద్ పక్కనే రామ్మూర్తి కూర్చుని ఉన్నాడు. టైమ్ పది దాటింది.

"ఇంకా ఎంత దూరం వెళ్ళాలి?" అడిగాడు ఇన్స్పెక్టర్ ఆజాద్.

"వస్తున్నాం."

చిన్న ఇంటిముందు పోలీస్ జీప్ ఆగింది. ఒక గుమ్మం వైపు రామ్మూర్తి చెయ్యి చూపించాడు.

"ఆ ఫ్లాట్లో వుంటోందామె," అన్నాడతను.

ఇన్స్పెక్టర్ ఆజాద్ కిందకు దిగాడు.

"మీరు జీప్లోనే కూర్చోండి" అన్నాడు యిన్స్పెక్టర్ రామ్మూర్తిని ఉద్దేశించి.

ఇన్స్పెక్టర్, ముగ్గురు కానిస్టేబుళ్ళు గుమ్మంముందుకు వెళ్ళారు. ఒక కానిస్టేబుల్ తలుపును తట్టాడు.

కొంతసేపయ్యాక తలుపు తెరవబడింది. గళ్ళ పైజామా ధరించిన నీగ్రో పోలీసులవైపు భయంతో చూశాడు.

ఇన్స్పెక్టర్ లోపలకు జొరబడ్డాడు. రోజా అర్ధనగ్నంగా యెదురైంది.

"ఏమిటిదంతా?"

"ఇదొక వేశ్యాగృహం. రెయిడ్ చేస్తున్నాం."

"ఇక్కడ నేను తప్ప మరెవ్వరూ లేరు!"

"నువ్వు వేశ్యగా జీవిస్తున్నావు. నీ ఆదాయంమీద అతడు బతుకుతున్నాడు" అన్నాడు యిన్స్పెక్టర్.

ఆమె భయంతో ఉండిపోయింది.

"గదులు వెతకండి!" అర్చాడతను.

"దేనికోసం వెతుకుతారు?"

"ఒక పెద్దమనిషి పర్సులోనుంచి నువ్వు పదకొండు వేలు దొంగిలించావు!"

"పదకొండు వేలు కాదు, సార్!"

"ఎంత?"

"పది వేలు" అందామె.

"ఆ డబ్బెక్కడుంది?"

"అది యిచ్చేస్తే పోతారా?"

"ఇచ్చి చూడు!"

ఆమె లోపలకు వెళ్ళింది. డబ్బు తెచ్చి ఇన్‌స్పెక్టర్‌కి యిచ్చింది.

ఇన్‌స్పెక్టర్ నీగ్రో వైపు చూశాడు.

"ఇక్కడ నువ్వు ఏం చేస్తున్నావు?"

"నా పేరు టామ్. నా దేశం నైజీరియా. ఆమె నా గర్ల్ ఫ్రెండ్."

రోజా ఏడుస్తూ ఇన్‌స్పెక్టర్ వైపు చూసింది.

"సార్, అతను నా ఫ్రెండ్ కాదు. బీచ్‌లో ఒకసారి నన్ను చూశాడు. అప్పటినుంచి వెంటాడి ఇంటికొచ్చాడు. జిడ్డులా నన్ను ఇతను వదలడంలేదు. ఇతడు మళ్లా యిక్కడకు రాకుండా చూడండి!" అందామె.

ఇన్‌స్పెక్టర్ టామ్ వైపు చూశాడు.

"ఆమె చెప్పింది అర్థమైందా?"

"లేదు."

ఆమె చెప్పినదంతా యిన్‌స్పెక్టర్ ఇంగ్లీషులో చెప్పాడు.

టామ్ కోపంగా ఆమెవైపు కోపంగా తిరిగాడు.

"అరెస్టు హిమ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నన్ను అరెస్టు చేయొద్దు. నేను మళ్లా యిక్కడకు రాను" అని టామ్, దుస్తులు మార్చుకొని బయటకు కదిలాడు.

"ఇన్‌స్పెక్టర్, మీ మూలంగా ఒక శని విరగడైంది. చాలా థాంక్స్" అందామె.

ఇన్‌స్పెక్టర్ అజాద్, కానిస్టేబుళ్ళు బయిటకు నడిచారు. అందరూ జీప్‌లో కూర్చున్నారు. జీప్ కదిలింది.

"ఆమె డబ్బు యిచ్చిందా?" అడిగాడు రామ్మూర్తి.

"కానిస్టేబుల్స్ చూడకుండా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

బాత్రూమ్‌లో కూర్చుని రాజారావు స్కాచ్ విస్కీ సేవిస్తున్నాడు. రామ్మూర్తి, ఇన్‌స్పెక్టర్ అజాద్ బాత్రూమ్‌లోకొచ్చారు.

అజాద్ వైపు రాజారావు నవ్వుతూ చూశాడు.

"ఆమె యిచ్చిన పదివేలు సార్" అని నోట్ల కట్టలను టీపాయిమీద వుంచాడు అజాద్.

"గుడ్ వర్క్, మైడియర్ ఫ్రెండ్" అన్నాడు రాజారావు.

రాజారావు దూరంలో వున్న రామ్మూర్తికి సౌజ్ఞ చేసి విస్కీ తెమ్మన్నాడు.

"ఆ డబ్బులోంచి రెండు వేలు నువ్వు తీసుకో" అన్నాడు రాజారావు.

అజాద్ రెండువేలు తీసుకొన్నాడు.

"మీకు ధన్యవాదాలు. గత రెండునెలలుగా నేను నాటకాల్లో పాల్గొనడం లేదు. మంచి సమయంలో పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా నటించే మంచి అవకాశం కల్పించి

పారితోషికం కూడా యిచ్చారు" అన్నాడు అజాద్.

"నీ తతిమా మిత్రులు యేమయ్యారు?"

"వాళ్ళకు డబ్బిచ్చి ఇళ్ళకు పొమ్మన్నాను"

విస్కీ గ్లాసును రామ్మూర్తి అతడికిచ్చాడు.

విస్కీని అజాద్ తాగాడు.

"తనివితీరా కూర్చుని తాగు! నాకు డ్రింకింగ్ కంపానియన్స్ యెప్పుడో గాని దొరకరు!" అన్నాడు రాజారావు.

"అలా అనకండి సార్. అవకాశం వస్తే యెంతమందేనా యిక్కడకొచ్చి తాగుతారు" అన్నాడు అజాద్.

అజాద్, రాజారావు పన్నెండుదాకా విస్కీ సేవిస్తూ కూర్చున్నారు. అజాద్ నిషాలో ఉన్నాడు.

"రామ్మూర్తీ, ఇతడిని తీసుకెళ్ళి గెస్టు రూమ్‌లో పడుకోబెట్టు" అన్నాడు రాజారావు.

"అలాగే సార్" అన్నాడు రామ్మూర్తి.

## 5

కోటీశ్వరుడు రాజారావు టిఫిన్ సేవించి ముందు హాల్లోకొచ్చి కూర్చున్నాడు. అతడి భార్య ప్రమీల వచ్చి పక్కనే మరో సోఫాలో కూర్చుంది.

ఓరగా ఆమెకేసి చూశాడతను. ఆమె చదువుకోలేదు యెక్కువగా. ఇంట్లో ఆమెకు కాస్తకూడా పనిలేదు. తెలుగు నవలలను చదువుతూ ఆమె కాలక్షేపం చేస్తూ ఉంటుంది.

ఆమె పక్క కూర్చుంటే అతడిలో ఏమీ రగులుకోదు. పెళ్ళయిన మొదట్లో ఇద్దరూ కొంత దగ్గరయినా ఎన్నేళ్ళ నుంచో వాళ్ళు వేర్వేరు గదుల్లో నిద్రిస్తున్నారు.

తన జీవితం తనది. ఆమె జీవితం ఆమెది. పేరుకి ఆమె అతడి భార్య. అంతకుమించి వాళ్ళిద్దరి మధ్యా ఎటువంటి అనురాగ బంధాలూ లేవు.

సోఫాలోంచి అతడు లేచి కారువైపు నడిచాడు. మెర్సిడిస్ కారులో కూర్చున్నాడు. డ్రయివర్ తలుపు మూశాడు.

కారు కదిలింది. గేటు దాటి కారు రోడ్డమ్మట పోసాగింది.

"హోటల్ టాజ్ కి పద!" అన్నాడతను.

టాజ్ హోటల్ ముందు కారు ఆగింది. అతడు దిగి హోటల్ ముందు హాల్లోకి వెళ్ళాడు. హోటల్ మేనేజర్ రామదాస్ యెదురయ్యాడు.

"హలో సార్" అన్నాడతను.

"హలో" అన్నాడు రాజారావు.

రామదాస్ అతడి పక్కనే నడవసాగాడు.

"నా ఫ్రెండ్ రిచర్డ్ కింగ్ యిక్కడున్నాడని విన్నాను. అతడిని చూడాలి" అన్నాడు రాజారావు.

"ఆయన రూమ్ నంబరు 105లో ఉన్నారు. మీరు లిఫ్టులో రెండో అంతస్థుకు వెళ్ళాలి" అన్నాడు రామదాస్.

"థాంక్స్, నే వెళ్ళగలను" అన్నాడతను.

రామదాస్ వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

రాజారావు లిఫ్టులో యెక్కాడు. లిఫ్టు మేన్ అతడికి వినయంగా నమస్కరించాడు.

"సెకండ్ ఫ్లోర్" అన్నాడు రాజారావు.

అదే క్షణంలో ఒక యువతి వేగంగా లిఫ్టులోకి యెక్కింది. ఆమె చెయ్యి రాజారావుకు మెత్తగా తగి

లింది. లిఫ్ట్ పైకి వెళ్తోంది.

ఖరీదైన సూటులో ఉన్న రాజారావు ఆమె వంక చూశాడు. అమాంతంగా అతని నాడుల్లో రక్తం వేగంగా ప్రవహించింది.

ఆమెవైపు అలా చూస్తూనే ఉన్నాడు. అతని హృదయంలో ఏదో శాంతి! ఏదో ఆనందం!

రెండో ఫ్లోర్‌లో లిఫ్ట్ ఆగింది. అతడికంటె ముందు ఆమె దిగింది. వెనకనే అతడు వెళ్ళాడు.

నడవమ్మట ఆమె నడుస్తోంది. ఆమెనే అతను చూస్తున్నాడు. అతడి శరీరం ఆవేశంతో వణుకుతోంది. ఆమె యెవరోగాని తనలో దుమారాన్ని సృష్టించింది.

రాజారావు ప్రపంచంలోని అన్ని దేశాలూ తిరిగాడు. కాని అంత అందమైన యువతిని అతడెక్కడా చూడలేదు.

ఆమె భూలోక సుందరి. సందేహంలేదు.

ఆమె రూమ్ నంబరు 110లోకి వెళ్ళింది. 105 గది ముందు నిలబడిన రాజారావు, ఆమె రూపం మాయమయ్యాక, ముందుకు నడిచాడు. 100 నంబరు గదిముందు క్షణకాలం నిలబడ్డాడు.

అతడి మెదడులో యెన్నో ఆలోచనలు! తలుపుతట్టి ఆమెతో మాట్లాడాలి! ఆమె యెవరో తను తెల్సుకోవాలి!

గుమ్మం ముందు నిలబడ్డాడు కాని తలుపును అతడు తట్టలేదు. మర్యాదగా ఉండదేమో!

అతడు వెనక్కు తిరిగాడు. 105 గదిలోకి వెళ్లాడు. రిచర్డు కింగ్‌తో మాట్లాడుతూ కూర్చున్నాడు. రిచర్డు కింగ్ కోసం అతను యీ హోటల్‌కి వచ్చాడు. కాని

ఆమెను చూశాక రిచర్డుమీద అతని మనసులేదు.

రిచర్డు ఏదో చెప్తున్నాడు. అతడు వింటున్నాడు. కాని అతని మనోఫలకం మీద ఆమె రూపం కనిపిస్తోంది.

"మీ మైండ్ యెక్కడో వుంది!" అన్నాడు రిచర్డు నవ్వుతూ.

"ఇక్కడే వుంది" అన్నాడతను.

రిచర్డుకింగ్ రెండు గ్లాసుల్లో బీర్ పోశాడు. ఇద్దరూ బీర్ తాగుతూ కూర్చున్నారు.

"ఫైన్ జర్మన్ బీర్" అన్నాడు కింగ్.

ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు. గ్లాసులోని బీరును తాగేసి రాజారావు లేచాడు.

"నేను సాయంత్రం మమ్మల్ని మళ్ళా కల్సుకుంటాను. అర్జంటు పనులున్నాయి. వెళ్ళాలి" అతడికి బైబై చెప్పి రాజారావు బయటకు నడిచాడు.

కిందనున్న మేనేజర్ గదిలోకి వెళ్ళాడతను. రామదాస్ కుర్చీలోంచి లేచాడు.

"కూర్చోండి, సార్" అన్నాడు మేనేజర్.

అతడివైపు రాజారావు సూటిగా చూశాడు.

"నాకు చిన్న సహాయం రహస్యంగా మీరు చెయ్యాలి" అన్నాడు రాజారావు.

"ఏం కావలసినా చేస్తాను, సార్" అన్నాడతను.

"110 నంబరు గదిలో ఒక యువతి ఉంటోంది. ఆమె పేరు యేమిటి? ఆమె యెందుకీ హోటల్లో బస చేస్తోంది? అంతా నాకు కావాలి!"

"ఇప్పుడే కనుక్కొని వస్తాను" అని మేనేజర్ రామదాస్ బయటకు వెళ్ళాడు.

సిగరెట్ తర్వాత సిగరెట్ పీల్చి పారేస్తున్నాడు

రాజారావు. పదిహేను నిమిషాల తర్వాత అతను తిరిగి వచ్చాడు.

"ఆమె పేరు మేనక. ఆమె బొంబేనుంచి వచ్చింది. ఆమె క్లాత్ బిజినెస్‌లో వుంది. చీరలు, పాంటు పీసెస్ ఆమె దగ్గర ఉన్నాయి. ఈ పట్నంలో మంచి డిస్ట్రిబ్యూటర్ కోసం ఆమె వెతుకుతోంది" అన్నాడు మేనేజర్.

"మిస్టర్ రామదాస్, ఆర్. ఆర్. టెక్స్టయిల్స్ కంపెనీతో ఆమెను సంప్రదించమనండి."

"ఆ కంపెనీ ఎక్కడుంది?"

రాజారావు తన ఆఫీసు ఫోన్ నంబరు యిచ్చాడు.

"ఆ నంబర్లకు ఫోన్ చేసి నాతో ఆమెను మాట్లాడమనండి" అన్నాడతను.

"మీరు డిస్ట్రిబ్యూషన్ తీసుకుంటానంటే ఆమె కళ్లు మూసుకొని యిస్తుంది. మంచి పార్టీ కోసం ఆమె చూస్తోంది. ఇంతవరకూ యెవరూ ఆమెకు నచ్చలేదుట."

"ఇవాళే ఫోన్ చేసి నాతో మాట్లాడమనండి. ఆలస్యం దేనికి!"

"అలాగే సార్" అన్నాడు రామదాస్.

## 6

ఆనాటి మధ్యాహ్నం మూడింటికి ఆమె ఫోన్ చేసింది. టెలిఫోన్ ఆపరేటర్ రాజారావుతో మాట్లాడింది.

"సార్, ఆర్.ఆర్. టెక్స్టయిల్స్ కావాలంటోంది ఆమె. ఆమె పేరు మేనకట. అటువంటి కంపెనీ ఇక్కడ లేదుగా!" అందామె.

"ఆమెతో ఏం చెప్పావు?"

"కాస్సేపు ఉండమన్నాను. మీరు కొత్త కంపెనీలు

పాపిసూ వుంటారని నాకు తెలుసుగా!"

"గుడ్, మిస్ మేరీ! కనెక్టు హర్ టు మి!"

ఈ స్పేపట్లో కనెక్షన్ వచ్చింది.

"హలో, రాజారావు హియర్" అన్నాడతను.

"హలో, ఐయామ్ మేనక ఫ్రమ్ బొంబే. మా గుడ్స్ డిస్ట్రిబ్యూషన్ గురించి మీతో మాట్లాడాలి. మీ గురించి యెంతో విన్నాను. యెప్పుడు మీరు నాతో మాట్లాడగలరు?" అందామె.

"మీరు వెంటనే యిక్కడకు రాగలరా?"

"వస్తాను" అందామె.

"అయితే వెంటనే రండి" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

అతడు రిసీవర్ ఎత్తాడు. టెలిఫోన్ ఆపరేటర్ "హలో, సార్" అంది.

"నటరాజాన్ని వెంటనే రమ్మను" అన్నాడతను.

మరుక్షణంలో నటరాజన్ గదిలోకొచ్చాడు.

"పదినిమిషాల్లో ఆర్.ఆర్. టెక్స్టయిల్స్ అనే బోర్డు బయట తగిలించాలి" అన్నాడతను.

"చేయిస్తాను, సార్" అని అతడు బయటకు పరుగెత్తాడు.

ఆర్.ఆర్. మాన్షన్స్ ముందు టాక్సీ ఆగింది. మేనక కిందకు దిగింది. ఆమె చేతిలో చిన్న సూట్‌కేసు వుంది.

ఆమె కంపెనీల బోర్డులవైపు పరీక్షగా చూసింది.

పైకి వెళ్ళింది. రిసెప్షన్ కౌంటరు వెనుకనున్న యువతితో మాట్లాడింది.

"రాజారావుగార్ని కలుసుకోవాలి. ఆయన నన్ను రమ్మన్నారు" అందామె.

"ఒన్ మోమెంట్, ప్లీజ్" అందామె.

మేనక కౌంటరు ముందు నిలబడి వుంది.

"ఆ గదిలోకి వెళ్ళండి" అంది రిసెప్షన్ యువతి.

మేనక ఏర్ కండిషండ్ గదిలోకి అడుగుపెట్టింది. రాజారావు ఆమెను సోఫాలో కూర్చోమని, పక్కనే కూర్చున్నాడు.

ఆమె వైపు చూస్తూ వుండిపోయాడు.

ఆమెలో విపరీతమైన ఆకర్షణ వుంది. ఎంతగా ఆమె వైపు చూసినా తనివితీరడంలేదు.

ఆమె అతడి చూపును గుర్తించింది. సూట్‌కేస్ తెర్చింది. శాంపిల్స్ చూపించింది.

"బొంబేలోని మూడు టెక్స్టయిల్ మిల్స్‌కు మేము డిస్ట్రిబ్యూటర్స్‌గా ఉంటున్నాం. ఈ శాంపిల్సు నచ్చితే మీరు మద్రాసు పట్నానికి మా సోల్ డిస్ట్రిబ్యూటర్స్‌గా వుండొచ్చు" అందామె.

"మీ శాంపిల్సు నాకు బాగా నచ్చాయి. మీకు మేం సోల్ డిస్ట్రిబ్యూటర్స్‌గా వుంటాం. మీ టరమ్స్ చెప్పండి" అన్నాడతను.

"లక్షరూపాయలు మీరు మాకు డిపోజిట్‌గా కట్టాలి. దానిమీద మీకు వడ్డీ రాదు. అటుపైన మీరు కావలసిన స్టాకు కొనుక్కోవచ్చు. కనీసం యాభై వేలకు తగ్గకుండా మీ ఆర్డరు ఉండాలి" అందామె.

"ఒప్పుకుంటున్నాను."

"మాకు 15% కమిషన్‌గా వస్తుంది. మీకు మేం 10% కమిషన్ యిస్తాం. మాకు 5% మాత్రం మిగులుతుంది."

"అగ్రీడ్" అన్నాడతను.

ఆమె సంతోషంగా అతడివైపు చూసింది.

"మేనకా, మీకు లక్షరూపాయలు డిపాజిట్ గా ఇస్తాను. ఐదులక్షల రూపాయల విలువైన టెక్స్టయిల్స్ మీరు మాకు వెంటనే పంపొచ్చు" అన్నాడతను.

అతడు చెప్పింది విని ఆమె ఉలిక్కిపడింది.

"ఐదు లక్షలు! బిగ్ ఆర్డరు!" అందామె.

"మీరు బాంకిద్వారా డాక్యుమెంట్స్ పంపొద్దు. డైరక్టుగా పంపండి. మీకు నేను యిప్పుడు ఆరులక్షలకు చెక్కు యిస్తాను" అన్నాడతను.

"చెక్కొద్దు. మా కంపెనీ పేర డి.డి. యివ్వండి" అందామె.

"అలాగే యిస్తాను" అన్నాడతను.

"మిమ్మల్ని కల్సుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. మూడు రోజుల్నించి తిరుగుతున్నాను. ఒక్క మంచి కంపెనీ కూడా నాకు దొరకలేదు" అందామె.

"మేనకా, బ్యాంకి టైమ్ యివాళ అయిపోయింది. రేపు మీకు డి.డి. యిస్తాను" అన్నాడతను.

"దటీస్ ఓ.కె, సార్" అందామె.

అతడు ఆమెవైపు సూటిగా చూశాడు.

"మీరు హోటల్లో ఉండడం నేను భరించలేను. మేం మీ సోల్ డిస్ట్రిబ్యూటర్లం. వెంటనే హోటల్ గది వదిలేసి మీరు నా యింటికి రండి. మీకు అన్ని సౌకర్యాలు చేకూరేటట్లు నేను చూస్తాను" అన్నాడతను.

కాస్సేపు ఆమె మాట్లాడలేదు. అతడామె వైపు మళ్ళా నవ్వుతూ చూశాడు.

"నా యిల్లు హోటల్ టాజ్ కంటె బాగుంటుంది.

అక్కడ మీరు సంతోషంగా వుండొచ్చు."

"మీరు పిల్చాక కాదనగలనా! హోటల్ గది వదిలేసి యీ రాత్రి మీ యింటికొస్తాను" అందామె.

"మీరు యెప్పుడు వస్తారు?"

"ఎనిమిది తర్వాత" అందామె.

"నేను మీకు కారు పంపుతాను. మా కంపెనీలకు 100 కార్లపైన ఉన్నాయి" అన్నాడతను.

"మీకు నా ధన్యవాదాలు" అందామె.

ఆమె సోఫాలోంచి లేచింది. అతడికి నమస్కరించి ఆమె వెళ్ళిపోయింది.

రాజారావు సోఫాలో కూర్చుని ఆమెను గురించే కలలుకంటూ ఉండిపోయాడు.

## 7

ఎనిమిదింటికి రాజారావు తన మెర్సిడిస్ కారును హోటల్ టాజ్ కు పంపాడు.

బాత్రూమ్‌లో రాజారావు కూర్చున్నాడు. స్కాచ్ విస్కీ సేవిస్తున్నాడు.

రామ్మూర్తి వినయంగా అతడి పక్కకు వచ్చాడు.

"ఇవాళ రాత్రి మీకు ఫెస్టివల్" అన్నాడతను.

"ఏమిటది?

"ఒక కాలేజి స్టూడెంట్ నాకు దొరికింది. ఆమెను యిక్కడకు తీసుకొచ్చి గెస్టు రూమ్‌లో ఉంచాను" అన్నాడతను.

"రామూర్తీ, ఆమెను వెంటనే పంపేయి" అన్నాడు రాజారావు.

"కష్టపడి తీసుకొచ్చాను. ఎలా పొమ్మనడం?" అడిగాడు రామ్మూర్తి.

రాజారావు అతడికి వెయ్యి రూపాయలు యిచ్చాడు.

"ఇది యిచ్చి ఆమెను పొమ్మను" అన్నాడతను.

"అలాగే సార్" అన్నాడు రామ్మూర్తి.

రామ్మూర్తి గెస్టురూమ్‌లోకి వెళ్ళాడు. ఆ గదిలో వున్న యువతివైపు చూశాడు.

"అమ్మాయి రా!" అన్నాడతను.

ఆమె అతడి వెనకనే వెళ్ళింది.

"రాజారావుగారి ఆరోగ్యం బాగాలేదు. అందువలన నిన్ను పంపేస్తాను" అన్నాడతను.

విచారవదనంతో ఆమె అతడివైపు చూసింది.

"నేను చాలా కష్టంలో వున్నాను. కాలేజి ఫీజ్ కట్టాలి," అందామె

"నా ముందు స్టూడెంట్‌గా నటించకు!"

"వర్రిపోయాను. ఎంతో కొంత ఇవ్వండి, పోతాను" అందామె.

అతను ఆమెకు 200 రూపాయలు యిచ్చాడు.

"రేపు ఫీజు కట్టు" అన్నాడు నవ్వుతూ.

"మీకు చాలా థాంక్స్. సార్" అందామె.

ఆమెను తీసుకెళ్ళి బస్టేండ్ దగ్గర దింపేశాడతను. "నాకు పనులున్నాయి. గుడ్ నైట్" అని అతడు తన స్కూటర్ని పోనిచ్చాడు.

రామ్మూర్తి బాత్రూమ్‌లోకి ప్రవేశించాడు. రాజారావు దగ్గరగా వెళ్ళాడు.

"రామ్మూర్తీ, ఒక యువతి నా మెర్సిడెస్ కార్లో వస్తుంది. ఆమెకు గెస్టురూమ్ చూపించు. తర్వాత ఆమెను యిక్కడకు తీసుకురా!" అన్నాడు రాజారావు.

"అలాగే సార్" అన్నాడతను.

మేనక వచ్చేసరికి తొమ్మిది దాటింది. ఆమెను గెస్టు రూమ్‌లోకి రామ్మూర్తి తీసుకెళ్ళాడు.

"మీరు స్నానం చేయండి. తర్వాత మిమ్మల్ని రాజారావుగారి దగ్గరకు తీసుకెళ్తాను" అన్నాడు రామ్మూర్తి.

"అలాగే" అందామె.

పదింటికి ఆమెను రామ్మూర్తి బాత్రూమ్‌లోకి తీసుకొచ్చాడు.

సోఫా చూపించి ఆమెను రాజారావు కూర్చోమన్నాడు. అతడి పక్క సోఫాలో ప్రమీల కూర్చుని వుంది.

"ఈమె నా భార్య ప్రమీల" అతడు పరిచయం చేశాడు.

మేనక నవ్వుతూ ప్రమీలకు నమస్కరించింది.

"మీ యింటికి నన్ను ఆహ్వానించినందుకు చాలా సంతోషిస్తున్నాను" అందామె.

"ఆనందం మాది" అన్నాడు రాజారావు.

"ఆనందాన్ని నలుగురికీ పంచడమే నా జీవితలక్ష్యం" అంది మేనక.

కొంతసేపయ్యాక తనకు నిద్ర వస్తోందని చెప్పి ప్రమీల వెళ్ళిపోయింది.

రాజారావు ఆమెవైపు ఆప్యాయంగా చూశాడు.

"డ్రింక్స్ తీసుకుంటారా?" అడిగాడతను.

"నాకా అలవాటు లేదు" అందామె.

"సాఫ్ట్ డ్రింక్స్" అన్నాడతను.

ఆమె టైమ్ చూసింది.

"ఈ పాటికి నేను భోజనం చేస్తూ వుంటాను" అందామె.

గ్లాసులోని విస్కీని అతడు గడగడ తాగేశాడు.

"పదండి. భోజనం చేద్దాం" అన్నాడు రాజారావు.

ఇద్దరూ డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళి కుర్చీల్లో కూర్చు న్నారు. రామ్మూర్తి వడ్డించాడు.

ఇద్దరూ తింటూ మాట్లాడుకోసాగారు.

"మీ గురించి చెప్పండి" అన్నాడతను.

"రెండేళ్ళ క్రితం నాకు పెళ్ళయింది. నా భర్త ఆర్మీలో వుండేవారు. జీప్ యాక్సిడెంట్‌లో ఆయన కాళ్ళు పోయాయి."

"వెరీ బాడ్!"

"నా భర్త పేరు జీవన్. ఆయన యెక్కువగా బయటకు వెళ్ళరు. నేను కూడా వుంటే గాని ఆయన కదలడు" అందామె.

రాజారావు ఆమెవైపే చూస్తున్నాడు. బంగారం లాంటి శరీరచ్ఛాయ, కోల మొహం, విశాల నేత్రాలు, సన్నటి నడుం, చిన్న పాదాలు. ఆమె ఎంత వయ్యారంగా నడుస్తుంది!

ఎర్రటి పెదిమలు, దానిమ్మ గింజల్లాంటి పళ్ళు! నుదురు మీద ఎర్రటి తిలకం!

"ఈ వ్యాపారంలోకి మీరు ఎందుకు దిగారు?"

"బొంబాయిలో వున్న మూడు టెక్స్‌టైల్ మిల్స్ మా కంపెనీని డిస్ట్రిబ్యూటర్‌గా నియమించారు, మాకు సహాయపడాలనే ఉద్దేశంతో — నా భర్త తిరగలేడుగా, అందుకని నేనిక్కడికొచ్చాను" అందామె.

"మీ వ్యాపారం లాభదాయకంగా వుందా?"

"వచ్చేది మాకు చాలు!" అందామె.

రాజారావు నవ్వుతూ ఆమెవైపు చూశాడు.

"మీలో నన్ను యేదో ఆకర్షిస్తోంది!" అన్నాడతను.

ఆమె తీయగా నవ్వింది.

"నా అమాయకత్వమేమో!" అందామె.

"మీరు చాలా అందంగా వుంటారు."

"నన్ను పొగడేస్తున్నారు."

"మీ అంత అందమైన యువతి యీ లోకంలో లేదు" అన్నాడతను.

"లోకాన్ని చూసివచ్చినట్లు మాట్లాడుతున్నారు" అందామె.

"ప్రపంచమంతా నేను తిరిగాను. ఎందరో స్త్రీలను చూశాను."

"ఎంత చూసినా మీరు చూడని లోకం వుంటూనే వుంటుంది" అందామె.

అతడు నవ్వాడు.

"అఫ్‌కోర్స్. యూ ఆర్ రైట్" అన్నాడతను.

భోజనాలు ముగించి యిద్దరూ లేచారు. హాల్లోకి నడిచారు. ఇద్దరూ పెద్ద సోఫాలో పక్క పక్కనే కూర్చున్నారు.

ఆమెను చూస్తూంటే అతని హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆమె పక్కన అలా శాశ్వతంగా కూర్చుని వుండాలనిపిస్తోంది. మేగ్నెట్ లా ఆమె అతడిని తన వైపు లాగేస్తోంది. అతడి జీవితంలో యిలా యింతకు ముందు యెన్నడూ జరగలేదు.

వాళ్ళిద్దరూ తప్ప హాల్లో మరెవ్వరూ లేరు. అమాంతంగా ఆమె లేచింది. అతడివైపు చూసింది.

"నేనిక వెళ్ళి పడుకోనా?" అందామె.

"అప్పుడే?"

"నేను పెందరాళే పడుకుని, తొందరగా లేస్తాను" అందామె.

ఆమెవంక అతను తీక్షణంగా చూశాడు.

"నాకోసం కాస్సేపు కూర్చోండి!"

ఆమె మాట్లాడలేదు. పక్కనే కూర్చుంది. అతడామె చెయ్యి పట్టుకొన్నాడు.

అతడి చేయి వణుకుతోంది, ఎందుకో!

ఆమె వింతగా నవ్వింది.

"మీ భార్య మీ కోసం ఎదురుచూస్తూ వుంటుంది వెళ్ళండి" అందామె.

"ఆమె గాఢనిద్రలో వుంటుంది" అన్నాడతను.

కొంతసేపు యిద్దరూ మౌనంగా వున్నారు.

"నా చిన్నతనంలో నా పెళ్ళయిపోయింది. నా భార్య అంటే నా కెందుకో నచ్చదు. నేను కష్టపడి యెన్నో కోట్లు సంపాదించాను. కాని నాకు ఆనందం లేదు!" అన్నాడతను ఉద్రేకంతో.

"ఆనందంకోసం మీరు వెతకనక్కరలేదు. అది మీ రున్నచోటే వుంది!"

"అవును, యిక్కడే వుంది. నా కానందాన్ని యివ్వగల వ్యక్తి నువ్వే!" అన్నాడతను.

ఆమె కిల కిల నవ్వింది.

"వెళ్ళి పడుకుంటాను, గుడ్ నైట్!" అని ఆమె తన గెస్టురూమ్‌లోకి వెళ్ళిపోయింది.

రాజారావు సోఫాలో అలాగే కూర్చున్నాడు. ఆమె తలుపు మూసింది.

రామ్మూర్తి అతడి ముందుకు వచ్చాడు. "వెళ్తాను,

సార్" అన్నాడతను.

"గుడ్ నైట్!" అన్నాడు రాజారావు.

## 8

రాజారావు కారును పోనిస్తున్నాడు. ఆమె పక్కనే కూర్చుంది.

"మేనకా, నువ్వు బొంబే వెళ్ళిపోతున్నావు. నిన్ను చూడకుండా నేనుండలేను. ఐ లవ్ యూ!" అన్నాడతను.

"సారీ, నేను పెళ్ళయిన స్త్రీని.

"పెళ్ళయితే కావచ్చు. అతడిని వదిలేసి నన్ను పెళ్ళాడు!"

"అదెలా వీలవుతుంది?"

"ఎందుకు కాదు? ఈ లోకంలో సాధ్యంకానిది లేదని నా నమ్మకం."

"నన్ను క్షమించండి," అందామె.

అతను రోడ్డు వారగా కారును ఆపాడు. ఆమెవైపు సూటిగా చూశాడు.

"కాళ్ళు లేని అతడికోసం బలయిపోయి నీ జీవితాన్ని వ్యర్థం చేసుకోకు!"

"ప్లీజ్, కారును పోనీయండి. ఆలస్యమైతే విమానం వెళ్ళిపోతుంది" అందామె.

"డోంట్ బాదర్! నిన్ను చార్టర్డు ప్లేన్‌లో బొంబే పంపిస్తాను" అన్నాడతను.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"నువ్వు తప్ప మరెవ్వరూ నన్ను ఆనందపర్చలేరు. నా కోసం పుట్టిన నువ్వు అన్యాయంగా జీవన్ హస్తాల్లో యిరుక్కున్నావు. అతడిని వదిలేసి నాతో వుండిపో!"

"జీవన్ని నేను వదల్లేను!"

"ఎందువలన?"

"అతడికి నేను కావాలి. అతడికి నేను అత్యావసరం" అందామె.

"సిల్లీ! ఒక నర్స్‌ను పెడ్దాం. ఆమె అతడిని సవ్యంగా చూసుకుంటుంది."

"నర్స్ సేవ చేయొచ్చు కాని నాలా ప్రేమ నివ్వ లేదు!"

"కాళ్ళు లేనివాడికి ప్రేమెందుకు?"

ఆమె అతడివైపు కోపంగా చూసింది.

"నేను ప్రస్తుతం యేం చెప్పినా మీకు అర్థంకాదు. మీ శరీరం కోరికల పుట్ట అయింది. కాని నేను మిమ్మల్ని పెళ్ళాడలేను. జీవన్ లేకపోతే ఆ అవకాశం వుండే దేమో!"

ఆమెవైపు చూశాడతను.

"మీ భార్య ప్రమీల వుంది. ఆమె వుండగా మరో పెళ్ళి మీరు చేసుకోవడం ధర్మంకాదు!"

"నా భార్యా, నీ భర్తా లేరనుకో, అప్పుడు?"

"అప్పుడు పెళ్ళికి ఒప్పుకునేదాన్ని" అందామె.

అతడు కారును పోనిచ్చాడు.

"మేనకా, నన్ను పెళ్ళాడినా, పెళ్ళాడకపోయినా నిన్ను ప్రేమిస్తూనే వుంటాను. చివరకి దేవుడు యేం చేస్తాడో చూద్దాం" అన్నాడతను.

"అది మంచి పద్ధతి" అందామె.

విమానాశ్రయంలో మేనక అతడితో కరచాలనం చేసింది.

"బొంబే వస్తే తప్పక మా యింటికి రండి!"

అందామె.

"బిజినెస్ మీద నేను బొంబే తరచు వస్తూంటాను. మీ యింటికి తప్పక వస్తాను" అన్నాడతను.

ఆమె ప్రయాణం చేస్తూన్న విమానం ఆకాశంలో దూసుకుపోతోంది. అతడు తన కారును ఆఫీసువైపు పోనిచ్చాడు.

## 9

బొంబే!

ఎవరో తలుపును తట్టారు. మేనక వెళ్ళి తలుపు తెర్చింది. ఎదురుగా నిలబడిన రాజారావువైపు నవ్వుతూ చూసింది.

"ఉత్తరం రాయకుండానే వచ్చేశారు!" అందామె.

"ఉత్తరాలు రాసే అలవాటు లేదు నాకు," అన్నాడతను నవ్వుతూ.

ఆమె వెనకనే అతడు లోపలకు వెళ్ళాడు. హాలు అందంగా, యింపుగా వుంది. మధ్యలో సోఫాలున్నాయి.

"మీ ఇల్లు రాజభవనంలా వుంది. మాది చిన్న ఇల్లు" అందామె.

ఆమె అతడివంక చూసింది.

"రండి, జీవన్‌తో పరిచయం చేస్తాను" అందామె.

పడగ్గదిలో పరుపుమీద జీవన్ వెల్లకిలా పడుకుని వున్నాడు. అతడి కళ్ళు ప్రకాశిస్తున్నాయి.

"జీవన్, రాజారావుగారు యీయనే" అందామె.

జీవన్ అతనితో కరచాలనం చేశాడు. మంచం పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. జీవన్ పక్కమీద ఆమె చతికిలబడింది.

అతడివైపు రాజారావు సూటిగా చూశాడు. జీవన్ యువకుడు. రెండు కాళ్ళూ మోకాళ్ళదాకా తీసేశారు.

"మేనక మీ గురించి చెప్పింది. మీరు ఆమెను చాలా మర్యాదగా చూశారని విన్నాను. మీరు యిక్కడే ఉండాలి" అన్నాడతను.

"డోంట్ బాదర్, హోటల్ తాజ్ లో గది తీసుకున్నాను. ఈ పట్నంలో ఉన్నంత కాలం రోజూ వచ్చి మిమ్మల్ని చూస్తుంటాను" అన్నాడు రాజారావు.

రాజారావు చూపు ఆమెవైపు తిరిగింది.

"మేనకా, నీతో బిజినెస్ విషయాలు మాట్లాడాలి" అన్నాడతను.

"మా ఆఫీసు ముందున ఉంది, పదండి" అందామె.

ఇద్దరూ ఆఫీసు గదిలోకి వెళ్ళారు. ఆమె కెదురుగా అతడు కూర్చున్నాడు.

"మీకు స్టాఫ్ లేరా?"

"లేరు. అన్ని పనులూ నేనే చూసుకుంటాను. ఒక ఆఫీస్ బాయ్ ఉన్నాడు. వాడు పనిమీద వెళ్ళాడు. చెప్పండి!"

"మేనకా, ఐ లవ్ యూ!" అన్నాడతను ఉద్రేకంతో.

"అది చాలాసార్లు చెప్పారు" అందామె.

ఆమెవైపు చూస్తూ వుండిపోయాడతను. ఆమె చెయ్యి పట్టుకున్నాడు. విదిలించుకుని చెయ్యిని వెనక్కి తీసుకుందామె.

"జీవన్ బాధపడ్డం నా కిష్టంలేదు. అతడికి కాళ్ళు లేకపోవచ్చు కాని కళ్ళున్నాయి. ఇటుపైన నా చెయ్యి పట్టుకోకండి, ప్లీజ్!" అందామె.

"మేనకా!, అతడు యీ లోకంలో యేమీ సాధించ లేదు. నీకు యేమీ యివ్వలేడు. అతడి కంటి పెట్టుకుని నీ జీవితాన్ని పాడు చేసుకోకు!"

"అతడు నాకేమి యివ్వలేకపోవచ్చు. కాని నే నతనికి యెంతో యివ్వగలను. నేను యెదుట ఉంటే కాళ్ళు లేవన్న విషయం అతడు మర్చిపోతాడు."

"యూ ఆర్ మాడ్!"

టెలిఫోన్ మ్రోగింది. ఆమె ఏదో మాట్లాడి రిసీవర్ని అతడి కిచ్చింది.

"హలో రాజారావు హియర్" అన్నాడతను.

"సార్ రామ్మూర్తిని. అమ్మగారు గాస్ సిలండర్ యాక్సిడెంట్ లో మరణించారు. పోలీసులు వచ్చారు" అన్నాడతను.

"బాడ్ న్యూస్."

"మీరు వస్తున్నారా?"

"తర్వాత ఫోన్ చేసి చెప్తాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

"ఏమైంది?" అడిగింది మేనక.

"గ్యాస్ సిలండర్ యాక్సిడెంట్ లో నా భార్య మరణించిందట."

"ఎప్పుడు?"

"వివరంగా తెలియదు."

"మీరు బోంబేకి ఎప్పుడొచ్చారు?

"నేను ఢిల్లీ వెళ్ళి అక్కడ నుంచి యివాళ యిక్కడికొచ్చాను."

"చాలా విచారకరమైన వార్త. "మీరు వెంటనే

మద్రాసు వెళ్ళండి" అందామె.

"వెళ్ళి యేం చెయ్యాలి?"

"ఆమె మీ భార్య. ప్రమాదవశాత్తూ మరణించింది. వెళ్ళి చూడండి" అందామె.

"నువ్వు చెప్పావని వెళ్ళాలి!"

"అందుకేనా వెళ్ళండి" అందామె.

అతడు కుర్చీలోంచి లేచాడు. ఆమెవైపు సూటిగా చూశాడు.

"మేనకా, ఒక అడ్డుగోడ కూలిపోయింది!" అన్నాడతను.

"ఎందుకు?"

"మనం దగ్గరవాలని దేవుడు ఆదేశిస్తున్నట్లు అగుపిస్తోంది!"

"ఆమె అతడివైపు అదోలా చూసింది.

"మీది చాలా కఠిన హృదయం అనుకుంటాను. నీ భార్య పోయింది బావా అంటే మరదల్ని పెళ్ళాడ్తానన్నట్టుంది మీరు చెప్పేది." అందామె.

రాజారావు సిగరెట్ వెలిగించాడు.

"మీరు ఇంటికి ఎస్.టి.డి. కాల్ చేసి వస్తున్నానని చెప్పండి" అందామె.

"అలాగే చేస్తాను" అన్నాడతను.

ఏదో పిలుపు విని ఆమె లోపలకు వెళ్ళింది. టేబుల్ మీదున్న రిసీవర్ని ఎత్తి అతడు తిప్పాడు. అటువైపు నుంచి రామ్మూర్తి కంఠం వినపడింది.

"రామ్మూర్తీ నేను యివాళ వస్తున్నాను" అని రిసీవర్ పెట్టేశాడు.

# 10

బాత్రూమ్‌లో లైట్లు వెల్గుతున్నాయి.

సోఫాలో రాజారావు కూచ్చుని విస్కీ సేవిస్తు న్నాడు.

అతడు వాచ్ చూశాడు. పది అయింది.

"మీ కోసం సత్తిరాజు అనే అతను వచ్చాడు" అన్నాడు రామ్మూర్తి.

"రామ్మూర్తీ, టేబుల్ మీద ఒక రమ్ బాటిల్, గ్లాసు, సోడాబుడ్లు పెట్టు. అతడిని లోపలకు రమ్మను. మళ్ళా నేను పిల్చినదాకా నువ్వు లోపలకు రావద్దు" అన్నాడతను.

"అలాగే సార్!"

టేబుల్ మీద అన్నీ పెట్టి రామ్మూర్తి బయటకు వెళ్ళాడు. కాస్సేపట్లో సత్తిరాజు లోపలకు వచ్చాడు.

సన్నగా పొడుగ్గా ఉన్నాడతను. పైజామా, జుబ్బా ధరించాడు. చిన్న కళ్ళు, నల్లటి మనిషి.

"కూర్చో!" అన్నాడు రాజారావు.

"నమస్కారాలు" అని సత్తిరాజు కూర్చున్నాడు.

"పోసుకు తాగు!" అన్నాడతను.

గ్లాసులో రమ్ పోసుకుని సోడా కలపకుండా సత్తి రాజు తాగేశాడు.

"ఈ ఫోటో చూడు" అన్నాడు రాజారావు.

ఫోటోను అతడు పరీక్షగా చూశాడు.

"అతడు బొంబేలో వుంటాడు. అడ్రెసు యిస్తాను. అతడిని చంపాలి!"

"వెంటనే చంపేస్తాను, సార్!"

"నువ్వు పట్టుబడకూడదు!"

సత్తిరాజు నవ్వాడు.

"650 మందిని చంపాను, సార్! ఇంకా పట్టుబడ లేదు" అన్నాడతను సగర్వంగా.

"ఎంత కావాలి?"

"హత్యకో లక్ష. అది నా రేటు, సార్."

"ఇస్తాను."

"యాభై వేలు అడ్వాన్స్‌గా యివ్వాలి. పని పూర్తి చేశాక మిగతాది యియ్యొచ్చు."

రాజారావు బాగ్ తెర్చి ఐదు నోట్ల కట్టలు అతడి కిచ్చాడు.

"ఒక్కో కట్టలో పదివేలు వుంటుంది."

"సత్తిరాజు డబ్బును తన బాగ్‌లో పడేసుకున్నాడు.

"ఇది అతని బొంబే అడ్రెసు" అని ఒక స్లిప్‌ను సత్తిరాజు కిచ్చాడు.

"విమానంలో బొంబే వెళ్తాను. తాత్కాలికంగా ఖర్చులకు మరో ఐదువేలు మీరు తర్వాత యివ్వాలి" అన్నాడు సత్తిరాజు.

"ఇస్తాను."

"ఫోటోను, అడ్రెస్ స్లిప్‌ను సత్తిరాజు దాచుకున్నాడు. "నేనిక వెళ్తాను సార్?"

"గుడ్‌లక్! ఆ బాటిల్ నీది. టేకిట్!"

రమ్ బాటిల్ను సత్తిరాజు బాగ్‌లో పెట్టుకొని సోఫాలోంచి లేచాడు. రాజారావుకి నమస్కరించి అతడు వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిపోయాక రాజారావు బయటకు వెళ్ళి

రామ్మూర్తిని పిల్చాడు.

రామ్మూర్తి వేగంగా లోపలకొచ్చాడు.

"అతడు యిక్కడకు ఎలా వచ్చాడు?"

"మోటర్ బైక్ మీద, సార్."

"ఫిల్ ది గ్లాస్!" అన్నాడు రాజారావు.

గ్లాసులో స్కాచ్ విస్కీ పోసి, సోడా కలిపి, ఐస్ క్యూబ్స్ పడేశాడు రామ్మూర్తి.

ఉషారుగా గ్లాసును అందుకున్నాడు.

# 11

రోజులు దొర్లి పోతున్నాయి. సత్తిరాజు రాకకోసం అతడు ఎదురుచూస్తున్నాడు.

రాజారావు బార్రూమ్‌లో కూర్చుని విస్కీ సేవిస్తున్నాడు. టెలిఫోన్ మ్రోగింది.

"మీ కోసం సార్" అన్నాడు రామ్మూర్తి.

"హాలో రాజారావ్ హియర్!"

"సత్తిరాజు, సార్. పని పూర్తయింది. రేపటి ప్లేనులో వస్తున్నాను. మిమ్మల్ని కలుసుకుటాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

రాజారావు ఉషారుగా విస్కీ సేవించాడు. ఇప్పుడు మేనక తనని తప్పక పెళ్ళాడుతుంది! ఏ అడ్డంకులూ లేవు!

రాత్రి రెండు దాకా అతడు తాగుతూనే వున్నాడు. మేనక అతని హృదయంలో నృత్యం చేస్తోంది.

తెల్లవారింది. అతడు ఆఫీసుకు పోలేదు. బార్రూమ్ లోనే కూర్చుని వుండిపోయాడు.

సాయంత్రం ఐదింటికి వచ్చాడు సత్తిరాజు. రామ్మూర్తిని అతడు బయటకు వెళ్ళమన్నాడు. యాభై

అయిదు వేలు తీసి అతడికిచ్చాడు.

సత్తిరాజు నోట్ల కట్టలను దాచుకున్నాడు.

"నిన్నెవరూ చూడలేదుగా?" అడిగాడు రాజారావు.

సత్తిరాజు నవ్వాడు.

"హత్య చేస్తూంటే నన్ను యెవరేనా చూస్తే వాళ్ళు బ్రతికుండరు, సార్. అక్కడ యిదే జరిగింది. అతడిని షూట్ చేస్తూంటే ఒక యువతి నాకు అడ్డుపడింది. నాతో పోట్లాడింది. ఆమె చాలా అందంగా వుంది సార్, అయినా ఆమెను చంపవలసి వచ్చింది. తర్వాత అతడిని చంపాను" అన్నాడు సత్తిరాజు.

సత్తిరాజు అతడివైపు చూశాడు.

రాజారావు నోటమ్మట మాటరాలేదు. అతడలాగే సోఫాలో పక్కకు పడిపోయాడు.

అతడికి యేమైందో తెలియని సత్తిరాజు మెల్లిగా బయటకు నడిచాడు.

రాజారావు పిలుపుకోసం రామ్మూర్తి కాచుకు కూర్చున్నాడు. యెంతకీ పిలుపురాక బాత్రూమ్‌లోకి వెళ్ళాడు. సోఫామీద పడున్న రాజారావును తట్టాడు, "సార్, సార్!" అని పిల్చాడు.

అతడిని ముట్టుకు చూశాడు. గాభరాగా నాడిని పరీక్షించాడు. కొట్టుకోడంలేదు. వెంటనే డాక్టర్ చలపతికి ఫోన్ చేశాడు.

డాక్టర్ చలపతి వచ్చి రాజారావును పరీక్షించాడు.

"ఆయన చనిపోయారు!" అన్నాడు డాక్టర్.

"వారం రోజులనుంచి ఆయన విపరీతంగా విస్కీ తాగుతూ వుండేవారు. నేనెంత వద్దన్నా వినేవారు కాదు" అన్నాడు రామ్మూర్తి.

"విధి అలా చేయిస్తుంది."

"ఇప్పుడు ఏం చెయ్యాలి సార్?"

"ఆయన అడ్వకేట్ కి ఫోన్ చేసి యీ వార్త చెప్పు" అన్నాడు డాక్టర్ చలపతి.

డాక్టరు చలపతి దీనంగా రాజారావువైపు చూస్తూ నిలబడ్డాడు. రామ్మూర్తి టెలిఫోన్ వైపు నడిచాడు.

—:అ యి పో యిం ది:—

సీరియల్




(గత సంచిక తరువాయి)

దీప్తికి యిలాంటి భయానక దృశ్యాలు చూడటం బాగా అలవాటయిపోయింది. ఆమెకిప్పుడు కార్తీక్‌ని కల్సుకోగలిగినందుకు చాలా ఆనందంగా వుంది. అంతవరకు అనుభవించిన మనోవేదన, మానసిక శ్రమ మరచిపోగలిగింది. కన్నుమూస్తే అందమైన కల కరిగిపోతుందేమో అతను కనపడకుండా పోతాడేమోనన్నట్టు కన్నార్పకుండా అతన్నే చూస్తోంది.

"నా నివాసానికి రండి అందరూ. జరగవలసిన విషయాలు అక్కడ చర్చిద్దాం!" అన్నాడు వసంతవర్మ, అందర్నీ ఉద్దేశించి.

వర్మను, అభిలాష్‌ను వసంతవర్మకు పరిచయం చేశాడు కార్తీక్. దీప్తిని చివరగా పరిచయం చేశాడు.

అందరికీ విచిత్రంగా కనిపిస్తోన్న సమస్య ఒకటే! కళ్యాణస్వామి ఎలా తప్పించుకు పోయాడు?

అశ్విని గమనించిన విషయం అందరి దృష్టికీ తెచ్చాడు. అక్కడ యిదివరకు కిందపడున్న ఎముక యిప్పుడు కన పడటంలేదు! అంటే వెళ్ళిపోతూ కళ్యాణస్వామి ఎముకను తీసుకుపోయాడన్నమాట!

అందరి కళ్ళు గప్పి కళ్యాణస్వామి ఎలా తప్పించుకో గలిగాడు? అంత అకస్మాత్తుగా ఎలా మిస్సయ్యాడు?

అశ్విని, హిమవంత్ ఆ రాతిగదిని దానికి చేర్చివున్న పాడవాటి పూజా మందిరాన్ని, పరీక్షించి వచ్చారు. ఎక్కడా మనిషి దాక్కోగలిగిన జాగా కనిపించలేదు. రాతిగదికి యివతలిపక్క పాడవాటి పూజా మందిరానికి అవలిపక్క యిక యేవిధమైన గదులు లేవు! అటు యిటు కూడా ఖాళీ ప్రదేశమే!

అందరు వసంతవర్మతోపాటు అతని నివాసానికి చేరు కున్నారు బిలంగుండా.

* * *

"మీరిక మీ వూరు వెళ్లాలంటే యథేచ్ఛగా వెళ్ళొచ్చు. నాకు చేతనైన సాయం నేను మిమ్మల్ని యీ సారంగం మార్గం దాటించి కొండకు చేర్చటం! నేను మీకు తోడు వచ్చి నేను దిగబెడతాను" అన్నాడు వసంతవర్మ.

ఆయనముందు వర్మ, కార్తీక్, అశ్విని, హిమవంత్, అభిలాష్, దీప్తి కూచుని వున్నారు. తన ఎత్తయిన రాతి ఆసనంమీద వసంతవర్మ కూచుని వున్నాడు.

అప్పటికే వసంతవర్మ గురించిన వివరాలు హిమవంత్ నుంచి సేకరించాడు వర్మ. హిమవంత్ కి వర్మపట్ల మొద ట్నుంచీ సదభిప్రాయంలేదు. అయినా తమ ప్రాణాలు

ఒకప్పుడు కాపాడిన కారణంగాను, యిప్పుడు ఏ ఆపదా లేకుండా తాము బయటపడినందువల్లను వర్మ అడిగిన వాటికి వివరంగా సమాధానాలు చెప్పేశాడు. ఆ వివరాల్లో రాగిఫలకం వసంతవర్మకి దొరికిపోయిన విషయం కూడా దొర్లిపోయింది.

వసంతవర్మ చెప్పిన మాటలు అందరికీ నచ్చాయి. తమ కష్టాలు గట్టెక్కినందుకు ప్రతిఒక్కరికీ సంతోషంగా వున్నది! అయితే ఓ పక్క కష్టాలు పూర్తిగా కడతేరిపోలేదనటానికి సూచనగా కళ్యాణస్వామి తప్పించుకు పారిపోయి, ఏ అవాంతరం తెచ్చిపెడతాడోననే బెంగ కూడా లేకపోలేదు.

అందరికీ చాలా బడలికగా వుంది. బాగా అలసిపోయి వున్నారు. అయినా, క్షేమంగా యీ టైగర్ హిల్స్‌నుంచి చింతపల్లి చేరుకొని అక్కడ్నుంచి తమతమ నెలవులు చేరిపోతే చాలనిపిస్తోంది.

"అలాగేనండి తాతగారూ! మా సంగతి సరే, మిమ్మల్ని ఆ స్వామి ఎన్ని యాతనాలకు గురిచేస్తాడో భయంగా వుంది" అన్నాడు కార్తీక్.

"స్వామి నన్నేం చెయ్యలేడు! ప్రాణాలకు భయపడి పారిపోయిన పిరికిపంద నన్నేం చేయగలడు? వాడి ప్రాణం దక్కించుకోవటానికి తప్పించుకు పారిపోయాడు. నా ఊహే నిజమైతే వాడు మళ్ళీ యీ ఛాయల కెన్నడూ రాడు! నాకిక మా ప్రభువు వచ్చేవరకు యీ మేన ప్రాణాలు భరించక తప్పదు! రాకుంటే నా జీవితం యిలాగే యీ గడ్డమీదనే ముగిస్తాను!.... కాని మీరు నాకో సహాయం చెయ్యాలి" అన్నాడు వసంతవర్మ వాళ్ళవంక పరీక్షగా చూస్తూ.

"అడగకండి తాతగారూ!" అన్నాడు కార్తీక్.

"ఇక్కడి విషయాలన్నీ మీరు ఈ సొరంగం దాటుతూనే మరచిపోవాలి! ఈ సొరంగం లోపల కళ్యాణదుర్గమున్నట్లుగాని, నిధివున్న రహస్యంగాని మానవమాత్రులెవరికీ తెలియనివ్వమని నాకు ప్రమాణం చేసి చెప్పండి!"

శ్రోతలు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ముందుగా వర్మ మాట్లాడాడు. "మాకెవరికీ ఆ సంగతి చెప్పవలసిన అగత్యం లేదిక! .... తాతగారూ, నేనే మీరు యెదురుచూస్తున్న కళ్యాణవర్మ వారసుడ్ని—జయవర్మను!" అన్నాడు.

వసంతవర్మతోబాటు, కార్తీక్ బృందమంతా యీ మాటలు అని నిర్ఘాంతపోయారు. కొద్దిక్షణాలవరకు ఎవరి నోటా మాట రాలేదు.

ముందుగా తేరుకున్నది వసంతవర్మ!

"ఏమిటి బాబూ, నీవంటున్నది? మీరు....మీరు....మా ప్రభువులు కళ్యాణవర్మ వారసులా? నిజమా? ఎంతటి శుభవార్త! నేడెంత సుదినం!" అన్నాడు వసంతవర్మ ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ.

కార్తీక్, అభిలాష్, వర్మవంక అభినందన పూర్వకంగా చూస్తూ. "మీరు రాజవంశానికి చెందినవారా? ఎంత అద్భుత విషయం! మీరేదో జమీందారీ వంశం వారని, సిరిపల్లె మీ నివాస స్థలమనీ, మీ పేరు జయవర్మ అనీ చెప్పారే!" అన్నారు.

"అవును. మా పూర్వీకులు రాజవంశస్థులే. రాను రాను రాజ్యాలు నశించిపోయి పరగణాలు వాటిమీద జమీందార్లు వచ్చారు. ఇప్పుడిప్పుడు జమీలు కూడా పోయి

రాజాభరణాలు మాత్రమే నిలబడ్డాయి. నేను మీతో చెప్పినదాంట్లో అవాస్తవికత ఏదీ లేదుకదా!" అన్నాడు వర్మ చిరునవ్వుతో.

వసంతవర్మ, జయవర్మను గాఢాలింగనం చేసుకొని "ప్రభూ! ఎన్నాళ్ళకు నా కోరిక ఫలించింది!? ఈ రోజు కోసమే కళ్ళల్లో వత్తులు వేసుకుని ఎదురుచూస్తున్నాను. తమ తండ్రిగారి నామధేయమేమిటి? కళ్యాణవర్మ ప్రభువులకు తమరు ఎన్నోతరం వారసులు?" అన్నాడు కుశల ప్రశ్నలు వేస్తూ.

వర్మ మందహాసం చేసి, "మా తండ్రిగారి పేరు ప్రచండవర్మగారు. కళ్యాణవర్మ ప్రభువుల కుమారులు ప్రశాంతవర్మగారు. మా తండ్రిగారికి ప్రశాంతవర్మగారు ముత్తాతగారు. ఆ విధంగా నాది ఏడోతరం" అన్నాడు.

వసంతవర్మ ఆనందంగా జయవర్మ వంక చూస్తున్నాడు. ఆయన కళ్ళల్లో ప్రభుభక్తి, స్వామిభక్తి పరాయణత కొట్టొచ్చినట్టు కనబడుతున్నాయి.

కార్తీక్ బృందానికి యిదంతా కలో, నిజమో అర్థం కావటంలేదు. అనుకోకుండా ఆపదలో ఆదుకున్న యీ తేజశ్శాలి వ్యక్తికి, ఆరడుగులపైగా పొడవున్న ఆజాను బాహుడిని చూడగానే తాము పెద్ద వంశం వాడని అనుకున్నారు. అన్నట్టుగానే తర్వాత జమిందారీ వంశస్థుడనని తన పేరు జయవర్మ అని చెప్పాడు. కళ్యాణవర్మ వంశం కూడా వర్మ పేరుతోనే అంతమవుతున్నది. అంటే యీ జయవర్మ ఖచ్చితంగా రాజవంశస్థుడే అనుకున్నారు.

"తాతగారూ, మీకు నా దగ్గరున్న రాగిఫలకం ఎలా చేజిక్కింది? నేను అంతదాకా నా చేతిలోనే అది పట్టుకొని వున్నాను. ముఖద్వారం దగ్గర నా సుస్తుల్లో దాచు

కున్నాను. స్వామి అనుచరులతో పోట్లాడినాక వాళ్ళు మమ్మల్ని బంధించేముందు చూడబోతే దుస్తుల్లో కనిపించ లేదు. వాళ్ళతోబాటు నాక్కూడా ఆశ్చర్యం కలిగింది! అది మీకెలా చేరింది?" అడిగాడు జయవర్మ.

"మీరు దుస్తుల్లో దాచుకున్నాననుకొని తొందరలో దాన్ని నేలమీద జారవిడిచారు. నేనది గమనించి వెంటనే అంటే మీరు ముఖద్వారం దగ్గరకు చేరుకోగానే దాన్ని వశంచేసుకొని రాళ్ళగుట్ట దగ్గర వేచివున్నాను. ఆ తర్వాత మీ యిద్దర్నీ కళ్యాణస్వామి అనుచరులు నేలమీద ఫాక్షించి తీసుకుపోగానే, నేను ద్వారం లోపలికి ప్రవేశించాను. సరిగ్గా అదే సమయంలో యీ ముగ్గురు ద్వారం దగ్గరకు చేరారు. నేను వాళ్ళకు ద్వారం దగ్గరే యెదురుపడి, నా వెంట తీసుకువచ్చాను .. ఆ క్షణంలో నేలమీద దొర్లింపబడుతున్న మీరే నా ప్రభువులని తెలిసివుంటే ఆ పాపాత్ముల్ని అప్పుడే నరకానికి పంపించి వుండేవాడ్ని!" అన్నాడు వసంతవర్మ.

అందరకూ అప్పటిదాకా ఆ రాగిరేకు వసంతవర్మ దగ్గరకు చేరిన విషయం ఓ పజిల్ లాగా వుండిపోయింది. ఇప్పుడు ఆ మబ్బుతెర విడిపోయింది.

జయవర్మ, వసంతవర్మవైపు తిరిగి, "ఆ నిధి యెక్కడున్నదో ఓసారి చూడాలని మనసు వేగిరపడుతున్నది. ఈ దుర్గంలోకి అడుగుపెట్టిన వెంటనే నాకు, యీ ప్రదేశానికీ జన్మజన్మల అనుబంధమున్నట్టు ఓ విచిత్రమైన అనుభూతి కలిగింది...." అన్నాడు.

వసంతవర్మ మందహాసంచేసి, "జన్మాంతర సంబంధాలున్న గడ్డ బాబూ యిది! అందుకే వారసులైన తమరు కనిపించిన మరుక్షణం, ఎన్నాళ్ళుగానో తమకోసమే

ప్రాణాలు నిలుపుకొని వున్న నా అన్నగారు తమ తనువు చాలించారు. మీకు ఆ రాగిఫలకం కళ్ళబడటం కూడా దైవసంకల్పమే! ఇక నా సంకల్పం, కర్తవ్యం రెండూ నెరవేరినట్టే!

ఆ నిధి నేనింతదాకా ఎన్నడూ కళ్ళతో చూసినది లేదు ప్రభూ! నేనే కాదు, మా అన్నగారుగాని మా తండ్రిగారుగాని, వారి తండ్రిగారుగాని ఎవ్వరూ చూడ లేదు. మా పూర్వీకులు మాపైన పెట్టిన బాధ్యత శిరసావ హించి ఆ ప్రకారమే యీ నిధిని కాపాడుకుంటూ యీ రాగిఫలకాన్ని దైవంకన్న మిన్నగా పూజించుకుంటూ వచ్చామిన్నాళ్ళూ! అంతకుమించి ఆ నిధిని క్షేపాలు ఎక్క డున్నాయో, ఏమున్నాయో ఎన్నడూ వాటి జోలికి పోయిన వాళ్ళంకాదు.

అయినా తమరొచ్చారు, యిక అన్నీ మీరే చూసుకో వచ్చును! ఇంటికి వెళ్ళి తమ మనుషుల్ని తీసుకొని వచ్చి, నిధి పట్టించుకొని వెళ్దామా?" అన్నాడు వసంతవర్మ.

"ఈ విషయం మనం అందరికీ తెలియనివ్వటం మంచిది కాదు! నిధిని క్షేపాలు మా రాజవంశం వాళ్ళకే అయినా యిప్పుడు మాకు హక్కు లేనట్టే! తెలిస్తే ప్రభుత్వం స్వాధీనం చేసేసుకుంటుంది. చేతులారా మనమే విషయాన్ని బయట పెట్టుకున్నట్టవుతుంది!" అన్నాడు జయవర్మ.

"పెవాళ్ళకెందుకు చెప్పుకుంటాం రాజావారూ? మన యింటివాళ్ళనే వెంట తెచ్చుకొని నిధిని తీసుకుపోవచ్చు ననే అభిప్రాయంతో చెపుతున్నాను. ఆనక మీ ఇష్టం!"

"నాకో అభిప్రాయం ఏర్పడుతుందికదా నిధి చూస్తే! పోయి చూద్దామా?"

"ఇదిగో బాబూ, ఆ రేకు—తమరే చూడండి. నేను తమ ఆజ్ఞను శిరసావహించే వాడినేగాని, తమకు చెప్పేటంతటి వాడినికాను!" వసంతవర్మ రాగిరేకును జయవర్మకందించాడు.

జయవర్మ దాన్ని పైకీ కిందికి చూస్తూ "మీకు సంస్కృతం వచ్చుగా తాతగారూ!" అన్నాడు.

"వచ్చును బాబూ! .... అదేమిటి, తమకు రాదా ఏమిటి?" అన్నాడు వసంతవర్మ కొద్దిపాటి ఆశ్చర్యంతో.

"మా తండ్రిగారి హయాంనుంచీ కూడా మాకు యింగ్లీషు చదువులే చెప్పించారు. అందుకని సంస్కృత భాషను నిర్లక్ష్యం చేయటం జరిగింది.... సరే, పదండి. నిధి చూసివద్దాం!" అన్నాడు జయవర్మ.

వసంతవర్మ చిన్నగా మందహాసం చేసి, "తమరు నిధి యిక్కడే, కళ్యాణ దుర్గంలోనే పాతిపెట్టబడుందను కుంటున్నారు కదూ!" అన్నాడు.

జయవర్మ ఆశ్చర్యపోయి "మరి....?" అన్నాడు.

"ఇక్కడికి దాదాపు రెండు మైళ్ళ దూరంలో ఓ ప్రత్యేకమైన స్థలంలో నిధి దాచబడివుంది!"

"అక్కడ ఎందుకు దాచారు? మరి ఈ దుర్గంలో యింత పకడ్బందీగా యేర్పాట్లు చేశారెందుకు?"

"మీ పూర్వీకులు చాలా తెలివైనవారు! ఎవరైనా రాగిఫలకం దొరకనివాళ్ళు యీ దుర్గాన్ని తవ్విపోసే స్తారని వారికి ముందుగానే తెలుసు! అప్పుడు నిధి బయట పడిపోక తప్పదు! అందుకే అంత దూరంలో పాతిపెట్టి ఆ వివరాలన్నీ రాగిఫలకంమీద స్పష్టంగా సూచించారు!"

జయవర్మ, అభిలాష్‌వంక సూటిగా చూశాడు. ఆ చూపుల్లోని వాడిని, వేడిని అందరు గ్రహించేరు. తనకి

కావాలనే నిజందాచి చెప్పాడని అర్థమయింది వర్మకు.

కార్తీక్ పరిస్థితిని తేల్చివేయటం మంచిదనే అభిప్రాయంతో, "వర్మగారూ! దయచేసి మాకు ఇక సెలవిప్పించండి! మేము టైగర్ హిల్స్‌కి, అక్కడినుంచి చింతపల్లె వెళ్ళిపోతాం!" అన్నాడు.

జయవర్మ నవ్వి, "ఈ నిధి నిక్షేపాల్లో మీకు కూడా భాగముంది. మీ భాగం తీసుకోకుండా వెళతానంటే మాత్రం నేను మిమ్మల్ని వదుల్తానా? ఇంతదాకా నాకు చేదోడువాదోడుగా వుండి యిప్పుడు, నిధి విషయం బయల్పడేముందు వెళ్ళిపోతాననటం భావ్యం కాదు!" అన్నాడు.

కార్తీక్, అతని స్నేహితులు ఆ మాటలకు చాలా ఆశ్చర్యపోయినట్టు వాళ్ళ ముఖకవళికలే చెప్తున్నాయి. నిధిలో తమకు భాగమా? నమ్మశక్యం కావటంలేదు.

కొన్ని వేలకోట్ల రూపాయల విలువగల నిధి! వర్మ ఒక్కడు ఏం చేసుకుంటాడు? అతని వంశస్థులు తరతరాలుగా కూచుని తిన్నా తరగని అంతులేని ఐశ్వర్యం! వీళ్ళకు ఒక్కొక్కరికీ ఎంత యిచ్చినా అది యీ అఖండ ఐశ్వర్యంలో ఏపాటి?

వసంతివర్మ నవ్వుకున్నాడు.

"మీరు కూడా రండి, అందరం కలిసి వెళ్ళొద్దాం! మిమ్మల్ని జాగ్రత్తగా చింతపల్లె పంపించే బాధ్యత నాది!" అన్నాడు జయవర్మ.

కార్తీక్ బృందానికి చాలా అసౌకర్యంగా, అసంతృప్తిగా వుంది. తాము తిరిగి వెళ్ళటానికి ఎంత ఆతృత పడుతున్నారో, వర్మ అంత తాత్సారం చేస్తున్నాడు. పైగా నిమ్మకు నీరెత్తినట్టు తాపీగా, కులాసాగా కబుర్లు

చెపుతున్నాడు. ఈ ధోరణి వాళ్ళకు నచ్చలేదు.

"వర్మగారూ, నేనెక్కడికీ కదల్లేను క్షమించండి!" అన్నది దీప్తి. ఆమె చాలా డల్ గా, బాగా డీలాపడి పోయినట్టు కనిపిస్తోంది.

కార్తీక్ ఆమెవంక జాలిగా, ఆప్యాయంగా చూశాడు.

"ఫరవాలేదు. మీరు, కార్తీక్ యిక్కడే రెస్టు తీసుకోండి. మా యిద్దరితో బాటు అభిలాష్, అశ్విని, హిమవంత్ లు వస్తారు!" అన్నాడు జయవర్మ.

అశ్విని కొంచెం కోపంగానే అన్నాడు "వర్మగారూ! మాకు ఆస్తులూ వద్దు పాటాలూ వద్దు. దయచేసి మమ్మల్ని వెళ్ళనివ్వండి."

వర్మ ముఖం గంభీర ముద్ర దాల్చింది. అతని మనసులో చెలరేగే భావాలు ఎవరి ఊహకూ అందటంలేదు!

వసంతవర్మ కల్పించుకున్నాడు. "వాళ్ళు ఎన్నాళ్ళు గానో తమవాళ్ళకు, తను వూరికి దూరమై అనేక విధాల కష్టాలను భరించారు. ఇప్పుడు కష్టాలు గట్టెక్కి తమ స్వస్థలం పోవాలని ఉబలాట పడుంటే కాదనటం దేనికి? మీకు అంతగా వాళ్ళకు యేమయినా ధనం యివ్వాలను కుంటే తరువాత పంపించవచ్చును కదా ప్రభూ!" అన్నాడు.

వర్మ కళ్ళలో రక్తజీరలు స్పష్టంగా కనిపించాయి. అసలే తేనెరంగు కళ్ళు మరింత ఎర్ర రంగును సంతరించు కున్నాయి.

"నా కెవరూ యెదురు చెప్పటానికి వీల్లేదు! నువ్వు నా సేవకుడివే గాని నాకు సలహాలిచ్చేటంత గొప్పవాడివి కాదని గుర్తుంచుకో!" అన్నాడు వర్మ వసంతవర్మతో.

వసంతవర్మ మనసు చివుక్కుమన్నది! ఇన్నాళ్ళుగా బాధ్యతవు, నీతికి కట్టుబడి తను రాజవంశపు వారసుడి కోసం యెదురుచూస్తుంటే, తనకు లభించిన ఆదరణ, ఆత్మీయత యింత ఘోరంగా వుంటాయని ఆయన వూహించ లేదు. కోపంతో ఆయన శరీరం వణికింది. కాని దాన్ని యేమాత్రం బయటకు రాకుండా నిగ్రహించుకున్నాడు. కార్తీక్ బృందానికి కూడా వర్మ మన స్తత్వం కొరుకుడు పడటంలేదు. రాజవంశానికి చెందినవాడిననీ, అతని అహంకారం కాబోలు! తమని శాసించాలనుకోవటం, అధికారం చలాయించుకోవాలనుకోవటం అతని అవివేకం! తాము అతనికి లొంగివుండాల్సిన ఆగత్యంగాని, అతనికి కట్టుబడి వుండాల్సిన అవసరంగాని లేవు!

వర్మ వసంతవర్మవైపు తిరిగి, "ఏం అలా నిల్చుండి పోయావు. పద, నిధి చూపించు!" అన్నాడు.

అంతవరకు తాతగారూ అంటూ ఆప్యాయంగా పిలిచిన వర్మ యేకవచనంలో సంబోధించటమే కాక అధికారయుతంగా ప్రవర్తించటం వసంతవర్మకు చాలా బాధాకరంగా వున్నది. అయినా తన ప్రభువు, తనను ఆజ్ఞాపించటానికి అర్హత వున్నవాడు కానిస్తుంటే శిరసా వహించక తప్పదు.

"అలాగే ప్రభూ! బయలుదేరే ముందు విఘ్నాలు రాకుండా తమ వంశమువారు పూజించే కులదైవానికి ప్రార్థన చేసుకుందాం!" అన్నాడు వసంతవర్మ.

"విఘ్నేశ్వరుడి స్తోత్రం నువ్వే చేసెయ్యి, నాకు రాదు!" అన్నాడు వర్మ.

వసంతవర్మ మాత్రం ఆశ్చర్యంగా, "అదేమిటి ప్రభూ, మీ కులదైవం సూర్యభగవానుడు కదా, వినా

యుపడని అంటా రేమిటి?" అన్నాడు.

వర్మ వెంటనే "ఆ విషయం నాకు తెలియక కాదు! యే పనయినా మొదలు పెట్టే ముందు గణపతిని పూజి స్తారు కదా, అందుకని అలా అన్నాను!" అన్నాడు.

వసంతవర్మ "నాకు వినాయక స్తోత్రం తెలియదు ప్రభూ! సూర్యస్తుతి చేస్తాను!" అంటూ శ్లోకం చదివి ప్రార్థన చేశాడు.

"చాలు, యిక బయల్దేరుదాం! ముందోసారి ఈ రాగి రేకులోని సంకేతాలకు అర్థం చెప్పు! ఇక్కడ గీతలు, బాణం గుర్తులు ఏదో భాషలో రాయబడిన మాటలు— సంస్కృతం అన్నావు కదూ—అవన్నీ ఓసారి చెప్పు!" అన్నాడు వసంతవర్మను చూసి, వర్మ.

వసంతవర్మ రాగిరేకును తీసుకుని ఓసారి పరీక్షగా చూసి, "ఇదిగో యిటు చూడండి ప్రభూ! ఇదే కళ్యాణ దుర్గం. బొమ్మ గీచివున్నది చూశారా! కళ్యాణదుర్గం ఎడమవైపున ఓ ద్వారం చూపించబడింది కదా అదే యిప్పుడు నేనున్న నివాసానికి దగ్గర్లో వున్న ద్వారం! ఇక్కడి నుంచి సరాసరి బాణం గుర్తు దారి చూపించ బడింది. ఇది కళ్యాణప్రభువుల పేరు, ఆయన రాజ్యాన్ని పరిపాలించిన కాలం సంస్కృతంలో వ్రాయబడి వున్నది.

"ఇదిగో, యిది ఆయన వంశవృక్షం! కళ్యాణవర్మ ప్రభువుల తండ్రి తాతల పేర్లు, వివరాలు. ఇది సూర్య భగవానుడు, మీ కులదైవం బొమ్మ. ఇది ప్రశాంతవర్మ వారి పేరు. ఈ వంశానికి వారసుడు ఆయనేనని స్పష్టంగా రాయబడి వున్నది! ఇప్పుడు మళ్ళీ నిధికి దారిచూపబడింది. ఇదిగో యీ బాణం గుర్తు రెండు మైళ్ళ విస్తారాన్ని కింద

రాసి వుంచారు. ఆ రెండు మైళ్ళ దూరం సరాసరి దారి కాదు, ఇదిగో యీ కొండల బారు, దాని వెనుకగా లోయలు, ఆ పక్కనుంచి మరిగుజ్జు చెట్లు, వాటి నానుకుని ఓ సెలయేరు, దాని పక్కగా రాళ్ళ గుట్టలు, ఆ పక్కగా ఓ గుహ, లోపలకు సన్నటి దారి, వరసగా చూపించబడ్డాయి.

వీటిన్నిటిని దాటుకుని వెళ్ళగలవాడికి అక్కడ మరో రాగి ఫలకంమీద నిధి సంక్షిప్తం చేయబడ్డ సరైన స్థలాన్ని, నిధి పూర్తివివరాల్ని రాసిపెట్టి ఆ గుహలో కుడివైపున పాతిపెట్టారట! దాన్ని తవ్వి తీసుకుని ఆ వివరాల ప్రకారం వెళ్తే నిధి బయటపడుతుంది!" అన్నాడు.

వర్మకు ఛర్రున కోపం వచ్చేసింది. "ఏమిటీ నువ్వు చెప్పేది కాశీ మజిలీ కథలా వుంది? ఈ రాగిరేకులోనే పూర్తి వివరాలున్నాయనుకుంటే మళ్ళీ రెండు మైళ్ళ దూరంలో మరో రాగిఫలకం వుండట మేమిటి? దాన్ని యెక్కడో భూమిలో పాతి వుంచట మేమిటి? ఇదంతా నేను నమ్మను! నా ఉద్దేశ్యం ప్రకారం యిక్కడే కళ్యాణదుర్గలోనే యెక్కడో నిధి పాతిపెట్టబడి వుంది. నువ్వు నన్ను తప్పుదారిన నడపటానికి ప్రయత్నిస్తున్నావు!" అన్నాడు.

వసంతవర్మ యీసారి కోపాన్ని అతి బలవంతాన నిగ్రహించుకుని "ప్రభూ! మీరు నా ఆత్మగౌరవాన్నే కించపరచే మాటలంటున్నారు. నా రాజవంశ వారసులు మా పూర్వీకులని ఎన్నడూ పల్లెత్తు మాట అన్నవారు లేరు! పైగా ఎంతో మన్ననగా, మర్యాదగా మమ్మల్ని గౌరవించేవారు. అబద్ధాలు చెప్పటం, ఆడిన మాట

తప్పటం మా వంశాచారం కాదు! మీకు నా మాటమీద విశ్వాసం లేకుంటే, సంస్కృతం తెలిసిన మరెవరికైనా చూపించుకోండి!" అన్నాడు.

వర్మ ఒక్కసారిగా చల్లబడిపోయాడు. "అదేమిటి తాతగారూ, ఒక్కమారే అలా మారిపోయారు? నేను మీ ప్రభువును కదా! గట్టిగా యేదయినా అనటానికి అధికారం లేదా? మీరు నన్నపార్థం చేసుకోకండి! ఈ నిధినిక్షేపాల వెనక యింత తతంగం వుందని నాకు తెలీదు. చేతి కందినట్టే అంది దూరమవుతున్న నిధిపట్ల కోపమొచ్చి అలా అన్నానంతే!" అన్నాడు.

అక్కడ సంస్కృతం వచ్చినవాడు అభిలాష్ ఒకరే! కాని అతనిదివరకే తనకు నిజం చెప్పలేదు రాగిరేకు చదివి కూడా. యిప్పుడు తనమీద గుర్రుగా వున్నారందరు. అసలే నిజం చెప్పడు! ఆరు ఫర్లాంగుల దూరంలో నిధి నిక్షిప్తమై వున్నట్టు ఘోరంగా అబద్ధం చెప్పాడిదివరలో.

వర్మ మాటలకు వసంతవర్మ కాఁలించినట్టే కనిపించాడు. అప్పటికి కనుచీకటి పడుతోంది.

"ఏమిటి, మీ రింకా మీనమేషాలు లెక్కపెడుతున్నారు. బయల్దేరండి!" అన్నాడు వర్మ అందర్నీ కలియ చూస్తూ.

ఎవరూ సుముఖంగా లేరని ముఖకవళికల్నిబట్టే తెలిసిపోతోంది.

వసంతవర్మ యేదో గుర్తొచ్చినట్టు, "ఈ రోజు శుక్రవారం ప్రభూ!" అన్నాడు.

వర్మ ముఖం చిట్లించి, "అయితే...." అన్నాడు.

వసంతవర్మ చెప్పేవరకు ఆ రోజు శుక్రవారమని యెవ

రికీ గురు లేదు! ఆటోమాటిక్ వాచీలో ఆ రోజు పేరు, తేదీ చూసేవరకు యెవరికీ ఆ దృష్టే లేదు. వసంతవర్మ జ్ఞాపకశక్తికి, అతని మేధాసంపత్తికి ఆశ్చర్యపోయారు! ఎన్నో ఏళ్ళుగా వారంతిథులు గుర్తుపెట్టుకున్న విద్వాంసుడతను!

వసంతవర్మ వివరణ యిచ్చాడు. "తమ పూర్వవంశ ప్రభువులు పొరపాటున కూడా శుక్రవారం చీకటిపడ్డాక ధనాగారాన్ని తాకే వారు కాదు! అటు చూసేవారే కాదు! శుక్రవారం అంత పవిత్రమయిన రోజు వారికి. ఇప్పుడు చీకటి పడిపోయింది. ఈ రాత్రికి ఆగి ఉదయమే బయల్దేరి వెళ్దాం!" అన్నాడు.

వర్మకు ఆ ద్రికాలి మంట నెత్తికెక్కింది. "ఇలాంటి చాదస్తం కబుర్లతో కాలహరణ చెయ్యటానికి ప్రయత్నించకు! నీ ధోరణి నాకు అనుమానాస్పదంగా వుంది. అసలు నిధి దారి నీకు బాగా తెలుసు__అయినా యేదో దాచి పెడుతున్నావు. లేనిపోనివి కల్పిస్తున్నావు. మేమిది సహించలేం!" అన్నాడు.

వసంతవర్మ చెక్కు చెదరలేదు. "మీరే మా ప్రభువు లని, అన్ని విషయాలు తమకు చెప్పేశాను. నేను దాచిన మీదే లేదు. ఉన్నదున్నట్లు నిధి గురించిన రహస్యాలన్నీ చెప్పేశాను. కాని నేను పొరపాటు చేశానని యిప్పుడనిపిస్తోంది" అన్నాడు.

వర్మ దెబ్బతిన్నట్టు చూశాడు. "అంటే నేను రాజవంశస్థుడ్ని కాదని నీ అనుమానమా?" అన్నాడు.

"రుజువు చూపించేవరకు నమ్మకం కుదరటం కష్టం కాదా ప్రభూ!"

"అంటే నీ ఉద్దేశ్యం...."

"మీరే కళ్యాణవర్మ ప్రభువుల వారసులని నిరూపించుకోవాలి మీరు!"

"ఓహో అలాగా! ఏం చూపించి నిరూపించాలి?"

"ప్రశాంతవర్మగారు తప్పిపోయినప్పుడు ఆయన వద్ద కళ్యాణవర్మ ప్రభువుల రాజముద్రిక వుండింది. అది చూపించినవారికే యీ నిధి అప్పగించాలని మా పూర్వీకులు ఆదేశించారు మాకు!"

"ఓ, రాజముద్రికా? అది మా యింటిలో వున్నది. సిరిపురం పోయి తేవాలి!"

"అందుకే ప్రభూ నేను మొదట్లోనే చెప్పాను— మీతో ఇంటికొస్తానని! నేను కళ్ళతో చూసేవరకు ఏదీ నమ్మలేను, క్షమించండి."

"నువ్వు సిరిపురం రావటంకన్న నేనే ఆ ముద్ర నిక్కడికి తీసుకురావటం సులభం కదా! నేను ఆ ముద్రిక చూపించే నిధిని తీసుకువెళ్తాను. ఇప్పుడు కేవలం నిధిని కళ్ళతో చూడటం వరకే నేను నిన్నడిగినది! తీసుకుపోయే ముందు ముద్రికను తీసుకురావటమే కాదు, నిన్ను కూడా మాతో మా భవంతికి తీసుకువెళ్తాం. దేవిడీలో మీకు ఘనమైన సత్కారం చేస్తాం! చూసి వెళ్ళిపోతాం! మళ్ళీ వస్తాం!" అన్నాడు వర్మ హుందాగా.

వసంతవర్మ చటుక్కున వర్మ చేతినుంచి రాగి ఫలకాన్ని తీసేసుకుని, "క్షమించండి. అంతదాకా యీ తామ్రపత్రాన్ని నా దగ్గరే వుండనివ్వండి. మీరు ముద్రిక తెచ్చి చూపించాక గాని నేను మీకు నిధి చూపించలేను!" అన్నాడుఖచ్చితంగా.

వర్మ కోపంతో ఛీత్కారం చేశాడు. "ఎంత అహంకారం నీకు? నామీద యెందుకు అనుమానం వచ్చింది?

మేము తలుచుకుంటే నిన్నేం చేస్తామో తెలుసా?"
అన్నాడు.

"మాటలు అనవసరం. కళ్యాణవర్మ వారసులు ఎవరూ యింత దురుసుగా ప్రవర్తించరు! సూర్యస్తుతి కలిలో కూడా ఆయన వంశసులు మరచిపోరు! శుక్రవారం పొద్దు పోయి ధనరాశుల్ని ముట్టరు! మీదుమిక్కిలి తమ అమాత్యులతో యున్నదూ అహంకారంతో ప్రవర్తించరు. ఈ కారణాలవల్లనే మీరు కళ్యాణవర్మ వారసులు కాదని గ్రహించాను! అసలు మీరు రాజవంశసులు కాని మాట అటుంచి, జమీందారు కూడా కాదు! మీరు తెలుగు వారే కాదు! ఎవరో విదేశీయుడివి. నా కళ్ళు, నా యిన్నేళ్ళ అనుభవం, వివేకం నా కివన్నీ చెపుతున్నాయి! తక్షణం యిక్కడ్నుంచి వెళ్ళిపో!" అన్నాడు వసంత వర్మ కళ్ళనుంచి నిప్పులు రాలుస్తూ.

కార్తీక్ బృందంతోపాటు అందరూ నిర్ఘాంతపోయి చూస్తున్నారు. వసంతవర్మ కాలరుద్రుడిలా కనిపించాడు వారి కళ్ళకు! వర్మ గురించి మొట్టమొదటిసారిగా యేదో వినరాని సంగతి విన్నట్టనిపించింది వాళ్ళకు!

అయితే అప్పుడే ఓ ఊహించరాని సంఘటన జరిగి పోయింది.

వర్మ పాంటు జేబునించి రివాల్వర్ తీసి వసంతవర్మను కాల్చేశాడు. ఒకసారి కాదు రెండుసార్లు కాదు నాలుగు గుళ్ళు! ఒకదాని మరొకటి వెంట వసంతవర్మ గుండెల్లోకి, పొట్టలోకి దూరిపోయాయి.

ఊహించని యీ దాడి నెదుర్కోవటానికి వసంత వర్మ సిద్ధంగా లేదు. నేల కూలిపోతూ కూడా తన పొడ వాటి కత్తిని అందుకొని వర్మను నరికెయ్యాలనుకున్నాడు.

కాని యీ లోపల మెరుపులా అశ్విని చేతిలో నున్న గన్ లాక్కొని వర్మ మరో రెండుసార్లు వసంతవర్మను కాల్చాడు!

అయినా వసంతవర్మ ప్రాణాలు పోలేదు! అతను వర్మను శపించేలా చూస్తూ, "ఆ నిధి నీకు దక్కదు! నువ్వు నికృష్టమయిన చావు చస్తావు. యిక్కడే యీ కళ్యాణ దుర్గంలోనే నీ శవం నేలమీద పొర్లాడుతుంది! ఇది నూటికి నూరుపాళ్ళు నిజం!" అన్నాడు.

వర్మ వసంతవర్మ కత్తి నందుకుని అతని తలను మొండెం నుండి వేరుచేసేశాడు.

చూస్తున్న అందరికీ భయంతోను, గగుర్పాటుతోను, శరీరాలు జలదరించాయి! అంత చలిలోను ముచ్చెమట్లు పోశాయి! వర్మ చేసిన ఘాతుకం చూడలేక దీప్తి కళ్ళు మూసుకుంది. అతన్ని వారించటానికి అశక్తులైనట్టు కార్తీక్ బృందం అచేతనంగా నిల్చుండిపోయారు.

* * *

అంతా క్షణాలమీద జరిగిపోయింది! రక్తపు మడుగులో తేలున్న వసంతవర్మ జరిగింది వాస్తవమే, కల కాదని గుర్తు చేస్తున్నాడు! స్వామిభక్తిపరాయణుడైన వసంతవర్మ, కర్తవ్యమే దైవంగా భావించుకునే వసంతవర్మ, అన్ని నాళ్ళుగా రాజవంశ వారసుడి కోసం అజ్ఞాతవాసం చేస్తూ మోడులా బతికిన వసంతవర్మ—తన బాధ్యత పూర్తిగా నిర్వర్తించకుండానే అమానుషంగా వర్మ చేతిలో బలయిపోయాడు!

ఈ సంఘటన చూస్తూన్న కొద్దీ అందరికీ కళ్ళు చెమ్మగిల్లాయి. గుండెలు బరువెక్కాయి. తమ ప్రాణదాత అనుకున్న వర్మ, మరో ప్రాణిని నిస్సంకోచంగా చంపే

కాడు! వసంతవర్మ కూడా ఓ విధంగా తమ ప్రాణ దాతే! ఆతిథ్య మిచ్చి ఆదరించటమే కాకుండా, తమ స్నేహితురాలు దీప్తిని, ఆత్మీయుడు అభిలాష్‌ని కళ్యాణ స్వామి చెర నుంచి విడిపించటానికి సాయం చేశాడు. తమని తమ యిళ్ళకు పంపించమని వర్మను నొక్కి చెప్పాడు. అలాంటి మహోన్నత వ్యక్తిని క్షణాలమీద శవంగా మార్చేశాడు వర్మ!

ఎంత కిరాతకుడు! వర్మలో యిప్పుడు వాళ్ళకు స్నేహితుడు కనిపించటంలేదు.

అశ్విని ఉండబట్టలేక అనేశాడు. "ఉత్త పుణ్యానికి వసంతవర్మను చంపడం యేం బాగాలేదు. ఇది మేమంతా గర్హిస్తున్నాం!"

వర్మ పగలబడి నవ్వాడు.

"ఉత్తపుణ్యానికి కాదు, వీడు హద్దు మీరాడు! తన కన్న కర్తవ్యపరాయణుడు లేడని నాకు పోజు కొట్టబోయాడు. అహంకారంతో విర్రవీగాడు. ఫలితం అనుభవించాడు!" అన్నాడు.

"దీన్నిబట్టి మీరు రాజవంశానికి చెందిన వారసులు కాదని మా అందరికీ తెలిసిపోయింది...." అన్నాడు కార్తీక్.

"నేను మాత్రం వారసుడ్నని చెప్పుకుంటున్నానా? నాకు కావలసింది నిధి! నేను రాజవంశానికి చెందిన వాడినా కాదా అన్నది కాదు ప్రస్తుత సమస్య! ఆ నిధికి నేనే ఏకయిక వారసుడ్ని అన్నది ప్రస్తుత నగ్నసత్యం" అన్నాడు వర్మ ఊహాలోకాల్లో తేలిపోతూ.

"ఇన్ని ప్రాణాలు బలిగొన్న ఆ నిధి యింకెందరి ప్రాణాలు బలి తీసుకుంటుందో, అసలు యిక్కడ ఆ నిధి

వున్నదో లేదో భగవంతుడి కెరుక! మీరు వెళ్ళి ఆ నిధిని మీరే అనుభవించండి. మమ్మల్ని మా మానాన పోనివ్వండి, సెలవు!" అన్నాడు ఫ్రెడ్రిక్.

వర్మ పకపక నవ్వి, తొందరపడతావేం యాంగ్రీ యంగ్ మాన్! ఆ నిధినంతా నేనొక్కడ్నీ యేం చేసుకుంటాను? మీ అందరికీ పంచేస్తాను. నాతో రండి! ఆ నిధి వశం చేసుకున్న వెంటనే యిక్కడి నుంచి అందరం వెళ్ళిపోదాం! మీ కిది సువర్ణావకాశం, వదులుకోకండి!" అన్నాడు.

అంతవరకు మౌనంగా వున్న అభిలాష్ నోరు విప్పాడు.

"వర్మగారూ! మాకు యే నిధినిక్షేపాలు వద్దు! ఇంత వరకు అనుభవించిన కష్టాలు చాలు! మేమింక యిక్కడ ఒక్క క్షణం కూడా వుండదల్చుకోలేదు. మీరు వచ్చినా రాకపోయినా మేం తిరిగి వెళ్ళిపోతున్నాం. వచ్చిన దారినే పోతే టైగర్ హిల్స్ చేరుకోగలం, మాకు ఎవరి సాయమూ అక్కర్లేదు!" అన్నాడు.

హిమవంత్ మాత్రం యేమీ చెప్పకుండా వుండి పోయాడు. దీప్తికి వర్మ ఘాతుకచర్య చూశాక అతని మీద వున్న సదభిప్రాయం యెగిరిపోయింది. అతనిమీద అసహ్యం, జుగుప్స పుట్టాయి.

అశ్వని తన దగ్గరున్న బుల్లెట్స్ వర్మకి తిరిగిచ్చేస్తూ, "ఇవిగో మీ ఆస్తి! తుపాకీ మీ వద్దనే వుంది. ఫ్రెడ్రిక్, ఆ తుపాకీ కూడా వర్మగారి కిచ్చెయ్యి. మనకిక ఈ మారణాయుధాలతో పనిలేదు!" అన్నాడు.

వర్మ బుల్లెట్స్ అందుకుని భద్రపరిచాడు. చకచక

ఆరు గుళ్ళు రివాల్వర్‌లో లోడ్ చేసుకున్నాడు.

"మీ నిజాయితీకి చాలా సంతోషిస్తున్నాను. కాని మీరెవ్వరూ ఇక్కడ్నుంచి అడుగు కదపటానికి వీల్లేదు!" అన్నాడు వర్మ కోరగా నవ్వుతూ.

అందరు అతనివంక అదిరిపడి చూశారు.

కాంత్రీక్ తుపాకీ యివ్వబోయినవాడల్లా చెయ్యి వెనక్కి తీసుకున్నాడు.

"కమాన్ మిస్టర్, ఆ తుపాకీ యిలా తే! అందులో గుళ్ళు లేవు! దానివల్ల యేం ప్రయోజనముండదు నీకు!" అన్నాడు నవ్వుతూ.

అశ్విని ఆవేశంగా కాంత్రీక్ చేతిలోని తుపాకీ అందుకుని వర్మకు గురిపెట్టాడు.

వర్మ హుంకరించాడు. "పిచ్చివేషాలు వెయ్యొద్దు! నా రివాల్వర్ గురి తప్పదు. నేనెలాంటివాడినో మీరీ పాటికి గ్రహించి వుంటారు. స్నేహానికి ప్రాణం పెట్టినట్టే, శత్రుత్వం వస్తే ప్రాణాలు తీయటానికి వెనుతీయను. మీరు అంతదాకా పరిస్థితిని సాగలాగరని నాకు తెలుసు. ఊc, అశ్వినీ గుళ్ళులేని ఆ తుపాకీని కింద పారెయ్యి!" అన్నాడు.

అశ్విని వర్మమీద తిరగబడబోయాడు. కాంత్రీక్ అతన్ని చూపుల్తోనే వారించాడు. అభిలాష్, హిమవంత్ నిర్వికారంగా వుండిపోయారు. తిరగబడి ప్రయోజనం లేదని వాళ్ళకు తెలుసు! దీప్తి పెద్ద పెద్ద కళ్ళను మరింత పెద్దవిగా చేసుకొని భయంగా చూస్తోంది!

వర్మ చిన్నగా నవ్వి, "గుడ్! మీలో చక్కటి క్రమశిక్షణ వుంది. కమాన్, వరసగా నుంచోండి. మిస్ దీప్తి, నువ్వు కూడా! నేను చెప్పినట్టు వింటే మీ కే విధంగానూ

హాని జరుగదు. నా పని పూర్తికాగానే మిమ్మల్ని యథేచ్ఛగా వదిలేస్తాను!" అన్నాడు.

"ఇప్పుడు మేము మీకే విధంగాను అడ్డు రావటం లేదుకదా! మమ్మల్ని బెదిరించటంలో మీ ఉద్దేశమేమిటి? మీరు నిధి వెతుక్కుని అనుభవించండి. మా దారిన మేం పోతాం!" అన్నాడు కార్తీక్.

వర్మ అదే మందహాసంతో, "మీరు ఊరు చేరిన మరుక్షణం నన్ను పట్టివ్వటానికీ, నిధిని ప్రభుత్వాని కప్పగించడానికీ మీరు చెయ్యగలిగిన దంతా చేస్తారని నాకు తెలుసు! నేనేం అమాయకుణ్ని కాదు, వెర్రివాడ్ని అసలే కాదు! నా లక్ష్యం నెరవేరేవరకు మీరు నా అతిథులు!" అన్నాడు.

అశ్విని కోపంగా యేదో అనబోయాడు. కార్తీక్ వారించాడు.

ఈ లోపల వర్మ తన జేబునుంచి పొడవాటి ప్లాస్టిక్ తాడు బయటికి తీశాడు.

"ఇది పర్వతాల నెక్కేందుకు ఉపయోగించే బలమయిన తాడు. చూడడానికి చాలా సన్నగా కనిపిస్తుందని దీని బలాన్ని తక్కువగా అంచనా వెయ్యొద్దు. మిమ్మల్ని దీనితో తాత్కాలికంగా కట్టి ఒకరికొకర్ని సన్నిహితం చేస్తాను. ఏమనుకోకండి ఫ్రెండ్స్" అన్నాడు వర్మ, వాళ్ళకు రివాల్వర్ గురిచేసి వుంచి. వెనుక విరిచిన చేతులకి బంధాలు వేసేసి రెండు చివర్లు తన చేత పట్టుకున్నాడు.

ఎవరూ ప్రతిఘటించలేదు. ప్రతిఘటించినా ఫలితం వుండదని అందరికీ తెలుసు. వర్మ నరరూప రాక్షసుడని అప్పటికే వాళ్ళ కర్థమైపోయింది.

కాంట్రీక్ విరక్తిగా నవ్వి, "మాకు యీ బంధనాలు కొత్త కాదు! ఇప్పటికి యెన్నోసార్లు యిలా కట్టించుకున్నాం. మమ్మల్ని యిలా బంధించకపోయినా మేము ఎదురు తిరిగే ప్రసక్తి లేదు. మీ యిష్టమొచ్చినంతసేపు బంధించుకోండి! ఇక ప్రాణాలమీద ఆశ ఎప్పుడో చచ్చిపోయింది." అన్నాడు.

వర్మ రాగిరేకును తీసి దుస్తుల్లో భద్రంగా దాచుకున్నాడు.

వసంతవర్మ కళ్ళు యింకా యీ ఘాతుకాన్ని చూస్తున్నట్టే తెరుచుకుని వున్నాయి భయంకరంగా.

అప్పటికి రాత్రి ఎనిమిది గంటలు దాటింది. వసంతవర్మ వెలిగించిన కాగడా ఆ బిలంలో చీకటిని పారదోలి వెలుగునిస్తోంది!

వర్మ స్నేహితులందర్నీ కలియచూసి, ప్రస్తుతానికి మీరందరూ యీ దర్భ చాపలమీద నడుములు వాల్చి విశ్రాంతి తీసుకోండి! నేనిప్పుడే పోయి ఆ నిధి యెక్కడున్నదీ చూసుకొని వస్తాను. తర్వాత మీలో కొందర్ని నాతో తీసుకుపోతాను. ఎందుకో తెలుసా? అంత బంగారాన్ని నేనొక్కడ్ని మోసుకు రాలేనుకదా, జస్ట్ సాయం కోసం!" అన్నాడు నవ్వుతూ.

వర్మ నవ్వు చాలా భయంకరంగా వుంది. ఎర్రటి కాగడా వెలుగులో చాలా వికృతంగా కనిపిస్తున్నాడు వర్మ. అతనిలో భయంకరమైన ధన పిశాచి వెర్రితలలు వేసింది. సమయం, సందర్భం కూడా చూడకుండా ధనాశలోపడి నిధిని వెతుక్కోవటానికి ఒక్కడే పోవటానికి సిద్ధమయిన ఆ మనిషిని ఎలా అర్థం చేసుకోవాలో వాళ్ళకు తెలియలేదు.

వర్మ ఆ గుహలాంటి బిలంలో వెతికి మరో కాగడా పట్టుకున్నాడు. దానికి యేవో నారచీరల్లాంటివి కట్టి వున్నాయి. ఓ పాత్రలో చమురులాంటి పదార్థం కనిపించింది. కాగడాకు ఆ పదార్థం పట్టించాడు. తర్వాత దాన్ని వెలుగుతున్న కాగడాకు ముట్టించాడు.

కాగడా వెలిగింది!

దుస్తుల్లోనించి ఓసారి రాగిరేకునుతీసి గుర్తుల్ని పరిశీలనగా చూసుకున్నాడు. వసంతవర్మ చెప్పిన ప్రతి వివరమూ కంఠ స్థమే తనకి! అతను అబద్ధం చెప్పలేదు. కావాలనే తను అతన్ని రెచ్చగొట్టి నిజం చెప్పించాడు!

రెండు మైళ్ళు పోవాలి. అదీ అడ్డగిడ్డంగా వున్న దారి! ఒక్కడూ వెళ్ళటం కష్టమే! తనకో మనిషి తోడు కావాలి. ఎవరొస్తారు?

వర్మ ప్రేమగా కార్తీక్ బృందంవైపు చూసి, "ఫ్రండ్స్! మీలో ఒకరు నాతో రావాలి! నాకు భయంవేసి రమ్మనటంలేదు! ఒకరు కాగడా పట్టుకుంటే మరొకరు దారి చూసి చెపుతుండాలి! నాతో వచ్చే వ్యక్తికి యీ జన్మలో యెన్నడూ చూడనంత బంగారమిస్తాను! పది తరాలవరకు తరగని ఐశ్వర్యం! కమాన్, ఎవరొస్తారు?" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. వర్మవైపు చూడటానికే మనస్కరించనట్టు మౌనం వహించారంతా.

వర్మ నలుగురు మగాళ్ళవంకా గుచ్చి చూస్తూ, "ఏం, ఎవరూ మాట్లాడటంలేదు?!" అని రెట్టించాడు.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు.

"ఇంతసేపూ నేను బతిమాలుతున్న ధోరణిలో అడుగుతున్నాను. కాని, యిప్పుడు శాసిస్తున్నాను. మీలో

ఎవరోకరు నాతో రాక తప్పదు! మీరు మొండిగా మొరాయిస్తే, ఎలా దారికి తేవాలో నాకు తెలుసు" వర్మ దీప్తి దగ్గరగా వచ్చి నించుని ఆమె కళ్ళల్లోకి చూసి వింతగా నవ్వాడు.

చూస్తున్న వాళ్ళందరికీ వర్మలో కొత్త వ్యక్తి కనిపిస్తున్నాడు. అంతవరకు తమలో ఒకడిగా యెంతో స్నేహంగా మసలిన వ్యక్తి అలా ప్రవర్తించటం వాళ్ళకు ఉక్రోషాన్ని, ఆగ్రహాన్ని కలిగించాయి.

కార్తీక్ వర్మ అభిప్రాయం గ్రహించాడు. వర్మ చేత్తో దీప్తి బుగ్గల్ని సుతారంగా నిమిరాడు.

కార్తీక్ కోపంగా అరిచాడు. "ఆడవాళ్ళపట్ల మర్యాద చూపించలేని మనిషి పశువుతో సమానం!"

దీప్తి ముఖం అరుణిమ తాల్చింది. కోడెతాచులా బుసలు కొట్టింది. "నువ్వింతవరకు ఎంతో పెద్దమనిషిలా మమ్మల్ని కాపాడిన ప్రాణదాతలా చాలా చక్కగా నటించావు. నీ అసలు రూపం యిప్పుడే బయటపడుతోంది. నువు కేవలం ఈ నిధికోసమే బయల్దేరివచ్చావని యిప్పుడర్థమవుతోంది. యింతసేపు ధనపిశాచిపట్టి మూర్ఖుడిలా ప్రవర్తించావనుకున్నాను. ఇప్పుడు కామాంధుడివని అర్థం చేసుకున్నాను. నీలాంటి రావణాసురులకు చివరికి అధోగతే ప్రాప్తించేది!" అన్నది.

"శపిస్తున్నావా? మీ హిందూ దేశంలో ఆడవాళ్ళకి సెంటిమెంట్సెక్కువ! మీ దేశపు ఆడవాళ్ళంటే నాకెందుకో చాలా మక్కువ! నిన్ను చూసిన మరుక్షణమే నిన్ను మోహించాను. కాని సమయం, సందర్భం కలిసి రావాలని యెదురుచూస్తున్నాను!" దీప్తి చెక్కిళ్ళు నిమిరాడు వర్మ.

దీప్తి శీత్కారం చేసింది. "నీలాగే నా మీద మోహం పెంచుకున్న నికోలస్ కుక్క చావు చచ్చాడు. నీకూ అలాంటి నికృష్టపు చావే రాసిపెట్టుంటే అలాగే చెయ్యి" అన్నది ఉద్రేకంలో నోరుజారి.

వర్మ నిర్ఘాంతపోయినట్టు చూశాడు. అతని తేనె రంగు కళ్ళు ఆశ్చర్య సంభ్రమాల్ని దాచలేకపోతూయి.

"నికోలస్....నికోలస్‌ని మీరేనా చంపింది?" అన్న మాటలు అప్రయత్నంగా వెలువడ్డాయి వర్మ నోటివెంట.

"అవును మేమే! వాడి కొనప్రాణం నా చేతుల్లోనే పోయింది. కాల్చి చంపాను. ఆడది తలుచుకుంటే చెయ్యలేని సాహసం లేదు! ఆడదాన్ని రెచ్చగొడితే ప్రళయాన్నే సృష్టించగలదు, జాగ్రత్త!"

కార్తీక్ సంజ్ఞ చేస్తూన్నా, అశ్విని మోచేత్తో వెనక నుంచి దీప్తిని వారించబోయినా ఆమె తన వాక్ప్రవాహాన్ని ఆపలేదు.

వర్మ దిగ్భ్రాంతినుంచి ఇంకా తేరుకోలేదు. కార్తీక్‌ని సమీపించి అతని రెండు చెంపలు ఛెళ్ళుఛెళ్ళున చరిచాడు. కార్తీక్ పెదిమ చిట్లి నోటి చివరనుంచి రక్తం ధార కట్టింది. ఉద్రేకం, ఆగ్రహం, పౌరుషం ఉప్పెనలా పొంగి తాళ్ళు తెంచుకొని వర్మమీద పడి చంపేద్దామన్నంత కోపం వచ్చింది కార్తీక్‌కి. కాని అతను గింజుకొనే కొద్దీ తాళ్ళు మరింత బిగిసి చర్మం లేచిపోయి మంట పుట్టిందేగాని ముడి వీడలేదు.

"ఏరా, నాకే మస్కా కొడతావా? కథ అల్లి నన్నే మోసగించావు కదరా! నిన్నేంచేసినా పాపం లేదు!" వర్మ క్రూరంగా కార్తీక్ కళ్ళల్లోకి చూశాడు.

"నికోలస్ నీ మనిషా?" అడిగాడు కార్తీక్ సూటిగా

వర్మ చూపులెన్నెదుర్కుంటూ.

"అవును, నా మనిషే! వాడితో బాటు మరో ముగ్గురుండాలి, వాళ్ళేనేం చేశారు?" వర్మలో ఉద్రేకం క్షణక్షణం పెరిగిపోతోంది.

"వాళ్ళుకూడా చచ్చారు!" అశ్విని అరిచాడు.

"ఆఁ! రాక్సన్, జాఫర్, రోమన్ కూడా మీ చేతుల్లో చచ్చిపోయారా?"

"ఉత్త పుణ్యానికి మమ్మల్ని బంధించి హింసించబోయాడు. నికోలస్ దీప్తిని చెరచబోయాడు. వాడే మా ప్రొఫెసర్ని కూడా చంపేశాడు. అలాంటి రాక్షసుల్ని చంపక, ప్రాణంతో వదలాలా?" అభిలాష్ కంఠంలో కోపం, ఉక్రోషం ధ్వనించాయి.

"ఓరి పాపాత్ములారా! మెరికల్లాంటి నా అనుచరుల్ని పొట్టన పెట్టుకున్నారు. మీ ప్రాణాలు యిక మీవి కావు! నా వాళ్ళని చంపినందుకు మిమ్మల్నందర్నీ ఖండ ఖండాలుగా నరికి నా ప్రతీకారం తీర్చుకుంటాను!" వర్మ ఆవేశంతో శివమెత్తినవాడిలా వూగిపోతున్నాడు.

"వసంతవర్మ చాలా చక్కగా వూహించాడు. నువ్వు విదేశీయుడవని! మేము కూడా నీ ఉచ్చారణ చూసి అనుమానించాంగాని, నువ్వు విదేశీయుడవని అనుమానించలేదు. తెలుగు సరిగా రాదనుకున్నాం. అయితే మమ్మల్ని రక్షించినప్పుడు, నువ్వు మమ్మల్ని తరచి తరచి వివరాల గురించి క్రాస్ చేసినపుడు నీమీద నాకనుమానం వచ్చింది. అందుకే నికోలస్ గురించి రాక్సన్ గురించి తక్కిన యిద్దరి గురించి—వాళ్ళ పేర్లు యిప్పటివరకూ తెలీదు—నిజాన్ని దాచిపెట్టి ఆ రెండో బేచ్ వాళ్ళ గురించి మాత్రమే చెప్పాను.

రెండో బేచ్ వాళ్లే మమ్మల్ని బంధించినట్టు, మాంత్రికుడి అనుచరులు మా వేన్ డ్రయివర్ ధరణిని చంపినట్టు అప్పట్నుంచీ చెప్పినవి నిజాలే! నువ్వు ఎనిమిదో గుహలో అడుగు పెట్టివుంటే, నీకు నిజం తెలిసిపోయుండేది! నీ వాళ్ళు శవాల రూపంలో నీకు దర్శనమిచ్చి మేం చెప్పనక్కర్లేకుండా నే కథ చెప్పి వుండేవాళ్ళు! అప్పుడు కథ మరోలా వుండేది" అన్నాడు కార్తీక్.

వర్మ కోపంతో బుసలు కొడుతున్నాడు. "నన్నింత మోసం చేస్తారా? నా వాళ్ళను చంపేసి నాకు తీరని నష్టం కలగజేశారు. ఇక నా గురించి చెప్పి మరీ చంపుతాను మిమ్మల్ని, నా పేరు రెడ్ సన్. విదేశీయుడ్నని వసంతవర్మ, మీరూ కూడా సరిగ్గానే అంచనా వేశారు.

ఈ ప్రాంతాన్నేలిన కళ్యాణవర్మ గురించి భారతదేశ చరిత్రలో చదివాను. చరిత్ర నా అభిమాన అంశం. అప్పుడే నాకు కళ్యాణవర్మ వద్ద కొన్ని వేల కోట్ల రూపాయల బంగారం, జవహారీ వుండేదని తెలిసింది. పొరుగు రాజుతో యుద్ధంలో ఓడిపోయిన కళ్యాణవర్మ ఆ నిధినిక్షేపాలనేం చేశాడో మాత్రం చరిత్రలో వివరణ దొరకలేదు. కాని చరిత్రకారులు ఆ తరువాత వచ్చిన బ్రిటిష్‌వాళ్ళు ఆ నిధినిక్షేపాలను వశం చేసుకొని వుండవచ్చునని ఊహాగానాలు చేశారు.

ఆ చరిత్ర చదువుతున్న నాకు నిధి బ్రిటిష్‌వాళ్ళకు చేరివుండలేదని మరికొంత పరిశోధన చేశాక తెలిసింది. అయితే ఈ టైగర్ హిల్స్ దగ్గరే యుద్ధం జరిగినట్టు చరిత్రలో రాయబడి వున్నది. టైగర్ హిల్స్ దగ్గరే ఎక్కడో నిధిని కళ్యాణవర్మ పాతిపెట్టి చనిపోయి వుంటాడని గ్రహించాను.

కాని సొరంగం లోపల ఓ దుర్గం కట్టబడి వున్నట్టు, అక్కడే యీ నిధినిక్షేపాలు దాచిపెట్టబడినట్టు చరిత్రకారుల వూహకు కూడా అందకుండా కళ్యాణవర్మ యిక్కడ నిక్షిప్తం చేశాడు. పూర్వం రాజులు కష్ట సమయంలో సురక్షితంగా పారిపోయి తలదాచుకోవటానికి రహస్య స్థావరాలు, సొరంగాల్లో నిర్మించుకునే వారని మీ హిందూదేశ చరిత్రలో రాయబడి వున్నది.

కళ్యాణవర్మ విషయంలోనూ అదే జరిగింది. కాని నాకూడా టైగర్ హిల్స్ దగ్గరే ఎక్కడో పాతిపెట్టి వుంటాడనుకున్నానుగాని, యింత పకడ్బందీగా సొరంగం తొలిచి లోపల దుర్గం నిర్మించి, ఆ నిధి వివరాలు మళ్ళీ ఓ రాగిఫలకంమీద రాసి దాన్ని కాపాడటానికి మనుషుల్ని కూడా నియమించినట్టు ఈ క్షణందాకా తెలియదు.

నాకు నమ్మకస్తులైన ఆరుగురు సేవకులున్నారు. వాళ్ళను తీసుకొని నా దేశంనుంచి మీ ఆంధ్ర దేశం వచ్చాను. కష్టపడి టీచర్ని పెట్టుకొని తెలుగు నేర్చుకున్నాను. నేను విదేశీయుడ్నని తెలియకుండా జాగ్రత్తలు తీసుకున్నాను. ఇక్కడి ప్రజలు మాట్లాడే భాష తెలుగు కాబట్టి, యిక్కడి వివరాలు సేకరించటానికి మీ భాష నేర్చుకోక తప్పలేదు. అందుకే మీరు నన్ను తెలుగు వాడని భ్రమపడ్డారు. అందుకనుగుణంగా నా పేరు కూడా జయవర్మ అని చెప్పాను

నేను ఓ నెలరోజుల క్రితం టైగర్ హిల్స్‌కు వచ్చి యిక్కడి సమాచారం సేకరించాను. చరిత్ర స్టూడెంటునని యీ చుట్టుపక్కల గ్రామాలయిన సిరిపురంలోను, చింతపల్లెలోను అమాయక ప్రజల్ని నమ్మించాను. వాళ్ళు నేనిక్కడికి వచ్చిపోవటం వింతగా చెప్పుకోకుండా నేను

తీసుకున్న ముందు జాగ్రత్త అన్నమాట!

ఇక్కడి వివరాలు సేకరించి మేప్ తయారుచేశాను. తరవాత మా నివాసానికొచ్చి నా వాళ్ళకు యెలా ప్రొసీడ్ కావాలో, యెక్కడ తవ్వకాలు సాగించాలో అన్నీ వివరంగా చెప్పి పంపించాను. వాళ్ళు నాలుగు రోజులైనా ఏ మెసేజ్ నాకు పంపకపోవటంతో అనుమానం వచ్చి మిగతా నా యిద్దరు కవల అనుచరుల్ని తీసుకొని వచ్చాను. వాళ్ళకు లవుడు, కుశుడు అని మీ పురాణాల్లోని పేర్లు పెట్టాను. మీరు నమ్మేశారు.

సరిగ్గా నేను వచ్చిన సమయానికి యిక్కడ యుద్ధం జరుగుతోంది. నా వాళ్ళకు ఏమైనా అపద వాటిల్లిందేమోననుకున్నాను మొదట. బాగా పరిశీలించినమీదట వాళ్ళు ఎవరో మాలాగే యీ పనిమీద వచ్చారని, మిమ్మల్ని వేటాడబోతున్నారనీ తెలిసింది. మీరు చూడబోతే విద్యార్థుల్లాగా కనిపించారు. వాళ్ళు గూండాల్లా చూడగానే తెలిసిపోతున్నారు. దాన్నిబట్టి మీమీద వాళ్ళే అఘాయిత్యం చేయబోతున్నట్టు గ్రహించాను.

వెంటనే మా వాళ్ళిద్దరితోను రంగంలోకి వచ్చాను. వాళ్ళను కాల్చి మిమ్మల్ని రక్షించాను. నేను మా వాళ్ళు కనిపించకపోవడంతో అ ఫెండయ్యాను. మీరు నాకు చెప్పిన కథ నమ్మాను. బహుశా నా వాళ్ళను మీరు చెప్పిన మాంత్రికుడుగాని గుహ లోపల యెక్కడైనా బంధించి వుంచాడో దేవివిగ్రహానికే బలిచ్చాడో చూద్దామనుకున్నాను. అందుకే ఆ మాంత్రికుడి నేలమాళిగ చూపించమని అడిగాను. దారిలో అనుకోని అవాంతరాలు ఎన్నో వచ్చాయి. నాకున్న ఆ యిద్దరు అనుచరుల్నికూడా బలితీసుకున్నాడు మాంత్రికుడు. కాని నిధి రహస్యం

తెలిసింది. కొంత వూరట కలిగింది. రాగిఫలకం మీది నిజాలు అభిలాష్ అర్థం చెప్పాడని అప్పట్లో వూహించ లేదు. వసంతవర్మ చెప్పాక నిజానిజాలు తెలిశాయి. అన్నిటికన్న ఘోరమైన పచ్చి నిజం యిప్పుడే.... తెలిసింది.... నా వాళ్ళని మీరే పొట్టన పెట్టుకున్నారని!

నా వాళ్ళనుకున్న వాళ్ళందరూ చచ్చిపోయారు. కాని నేను మిగిలివున్నాను. ఈ నిధితో పాటు మీ అందరి ప్రాణాలని నాతో తీసుకుపోతాను. రక్తానికి రక్తం, ప్రాణానికి ప్రాణం—యిదే నా మోటో!" రెడ్‌సన్ ఆయాసం తీర్చుకోటానికన్నట్టుగా ఆగాడు.

వింటున్న కార్తీక్ బృందానికి ఓ యింగ్లీషు సినిమా చూస్తూన్న అనుభూతి కలిగింది. ఎక్కడో పరాయి దేశంలో వున్న విదేశీయుడు భారతదేశ చరిత్ర చదివి నిధినిక్షేపాల కోసం భారతదేశం వచ్చాడని, అందునా ఆంధ్రప్రదేశానికొచ్చాడని యెవరయినా చెబితే నమ్మివుండేవాళ్ళు కాదు! కాని ప్రత్యక్షంగా చూస్తూ నమ్మకుండా వుండేదెలా?

వర్మగా పరిచయమయిన రెడ్‌సన్ వికృతంగా నవ్వాడు. "నా వాళ్ళను చంపినా నేననుకున్నది సాధించి తీరుతాను. ఈ నిధిని వశంచేసుకుంటాను. అంతేకాదు, దీప్తివంటి సౌందర్యవతిని నేనింతవరకు చూడలేదు, అనుభవించలేదు. దీప్తిని ఈ నిధితో పాటు నా దేశం తీసుకుని పోతాను. మీరే కాదు, లోకంలో మరెవ్వరూ నన్నడ్డు కోలేరు. నాకీ దేశం పౌరసత్వం కూడా యీ మధ్యనే దొరికింది. నేనీ దేశంలో వున్నా, మా దేశం పోవాలన్నా నన్నభ్యంతర పెట్టేవాళ్లెవ్వరూ లేరు" అన్నాడు దీప్తిని సమీపించి ఆమె ముఖంమీద ముఖం పెట్టి.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

దీప్తి ఆడపులిలా గర్జించింది. "ఒరే, చావనైనా చస్తానుగాని నీవంటి కుక్కకు లొంగుతాననుకోకు! నా వాళ్ళతోపాటు నన్నూ చంపెయ్యి. నేను మాత్రం నీకు దక్కుతానని కలలోకూడా ఆశించకు!" అన్నది.

వర్మ పిరగబడి నవ్వాడు. "నీలాంటి పొగరుగల ఆడదాన్ని, అందాల రాశిని యింతవరకు ఎక్కడా చూడలేదు. సాహసివి కూడా. నీతో పొందు బలే మజాగా వుంటుందిలే....అయినా అందుకు యిది సమయము, సందర్భము కాదు. కాని ఆ సమయం ఎంతో దూరంలో లేదు. ఒరే కుర్రాళ్ళూ, మిమ్మల్ని ఈ క్షణమే చంపి పాతరవేసే వాడినేగాని, నాకు నిధి, నిధికన్న అపురూపమైన దీప్తి మీవల్లనే దక్కబోతున్నాయి. అందుకని కొంత గడువిస్తున్నాను. నిధి తెచ్చుకున్న తర్వాత మీ స్నేహితురాల్ని హేండోవర్ చేసుకుంటాను, ఓ.కే!?" అన్నాడు తమకంతో.

తమ చావు యిప్పుడు కాకున్నా మరి కొద్ది గంటల్లో ఖాయమని అందరికీ తెలుసు. చచ్చేలోపల యేదైనా సాధించాలి! ఈ తొత్తు చేతుల్లో నికృష్టపు చావు చావకూడదు.

ఎలా? అవకాశంలేదే! ఇదే ఆలోచన వాళ్ళ మెదళ్లని తొలిచేస్తోంది.

"ఎనీవే, చివరిసారిగా నాతో కాసేపు సరదాగా రావాలనుకుంటున్న వాళ్ళెవరైనా వుంటే రావచ్చు. జస్టు, నిధిని మోసుకురావటానికి. బహుశా మీకెవరికీ ఇష్టం వుండదని నాకు తెలుసు. ఇదివరకటి పరిస్థితి వేరు! మిమ్మల్ని నా పనయిపోయాక వదిలేద్దామనుకున్నాను. కాని మీరు నాకు ఆగర్భశత్రువులని తెలిసిపోయాక, మిమ్మల్ని ప్రాణాలతో నేను వదిలేదిలేదు. మీరెవరూ

నాకు సహకరించరనీ నాకు తెలుసు!

ఆల్ రైట్, నేనొక్కడినే వెళ్తాను. మోయగలిగినంత బంగారం నేనే మోసి ఒకటికి నాలుగుసార్లు తిరుగుతాను! టైగర్ హిల్స్ దిగువ నా జీప్ సిద్ధంగా వుంది. దానిలోనే మేమిక్కడికి వచ్చాం. దాంట్లో బంగారమంతా వేసుకొని రెండో కంటివాడికి తెలీకుండా మా స్నేహితురాలితో విహార యాత్రకు వెళ్ళినట్టు వెళ్ళిపోతాను!" రెడ్‌సన్ చంటిపిల్లాడిలా జరగబోయేది వడవడ వాగేస్తూ చిందులు తొక్కుతున్నాడు.

కాత్రీక్, అభిలాష్ కళ్ళతోనే సైగలు చేసుకున్నారు.

"ఆల్ రైట్! ఒకప్పుడు నువ్వు మా ప్రాణం కాపాడినందుకు ప్రతిఫలంగా నీతో రావటానికి సిద్ధంగావున్నాం! మా కట్లు విప్పదియ్యి!" అన్నాడు కాత్రీక్.

రెడ్‌సన్ పడిపడి నవ్వాడు. "మీ యిద్దర్నీ విప్పదీస్తే నామీద విరగబడి నన్నేదో చెయ్యాలని పిచ్చిభ్రమలో వున్నట్టున్నారు! నేనేమీ వెర్రివాడిని కాదు, మీ వలలో పడటానికి! నా చేతిలో మారణాయుధమున్నంత సేపు మీరెవరూ నన్నేం చెయ్యలేరు! కాని నిధి వశం చేసుకోకుండా అడ్డుతగులుతారనే బంధించాను. కాస్సేపటి తర్వాత శాశ్వతంగా మిమ్మల్ని యమపురికి పంపిస్తాను. అది వేరే సంగతి!

అయితే నాకో మనిషి సాయం అవసరం! అందుకు కాత్రీక్‌ని తీసుకు వెళ్తున్నాను. ఎందుకంటే నా దీపికి యిష్టమైనవాడు నాకూ యిష్టుడే! అభిలాష్, నిన్ను ఈ జన్మలో నమ్ముతాననుకున్నావా? రాగిఫలకంమీది వివరాలు తప్పుగా చదివి నన్ను పక్కతోవ పట్టించాలనుకున్న దుర్మార్గుడివి నువ్వు! నిన్ను హింసించి మరీ చంపుతాను తిరిగొచ్చాక! తయారుగా వుండు!" అన్నాడు. (ఇంకావుంది)

